# ఉచితం

తళతళ మెరిసే స్టెయిన్‌లెస్ స్టీల్ గిన్నె

కొత్త

# పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం

రెండు టిన్నులు కొన్నప్పుడు

క్రొత్త ఫారెక్స్ అధిక రుచికరం
క్రొత్త ఫారెక్స్ అధిక సంపూర్ణం

ప్రేమతో మీరు పెట్టే ప్రతి చెంచాడు
మీ పాపాయి పెరుగుదలకు మంచిది.

మంచి ఆరోగ్యానికి మూలస్థానం–గ్లాక్సో




ఈ కానుక ఎంపిక చేయబడిన పట్టణాలలో ప్రత్యేక కానుక టిన్నులపై సరుకు వున్నంత వరకు లభ్యం.

CLARION/B/GX/ 244 EL

# “మీ గ్యాస్ సిలెండర్‌ని మార్చేటప్పుడు మొట్టమొదటగా మీరు చెయ్యవలసిందేమిటి ?”



మొట్టమొదటగా, వంటింట్లోని నిప్పు, మంటలనూ అన్నిటినీ ఆర్పెయ్యండి; దీపం, అగరువత్తి, కిరసనాయిలు స్టవ్, పొయ్యి, సిగరెట్లు, అన్నీను. తర్వాత ఎలక్ట్రికల్ ఉపకరణాలన్నిటి తాలూకు స్విచ్‌లనూ ఆర్పెయ్యండి; రిఫ్రిజిరేటర్‌ని కూడా. అలా చేసారుగా, మంచిది.

దాంతోబాటే, డెలివరీ మేన్ యివన్నీ చేసేలా చూడండిక.

1. ప్రెషర్ రెగ్యులేటర్ స్విచ్/సిలెండర్ వాల్వ్‌నీ, మీ స్టవ్‌పైన గలగ్యాస్ ట్యాప్స్‌నీ/మూసెయ్యడం.
2. కొత్త సిలెండర్‌పైన గల సీల్‌ని మీకు చూపించడం.
3. సిలెండర్ వాల్వ్/రెగ్యులేటర్ జాయింట్, రబ్బర్ ట్యూబ్, వాటి కనెక్షన్లూ వీటికి లీకేజ్ అవుతోందేమో పరీక్ష చెయ్యడం.
4. రెండు బర్నర్లనూ వెలిగించడం, అవి ‘ఫుల్’ నుంచి ‘లో’ దాకా సరిగ్గా పనిచేస్తూన్నాయా అని పరీక్షించడం.
5. ఏ అవసరం అయినా కలిగితే, మెకానిక్ కోసం కబురు పెట్టడం.

భద్రత దృష్టితో, యివి చెయ్యండిక.





**Bharatgas**

## కుకింగ్ గ్యాస్‌ని మీ నేస్తంగా చేసుకోండి.

ARTIG 4365 TEL

ప్రజల హితంకోసం భారత్ పెట్రోలియమ్ కార్పొరేషన్ లిమిటెడ్ వారిచే యిది విడుదల చేయబడినది.

## శుభాకాంక్షలు

మా పాఠకులు, రచయిత(త్రు)లు, ఏజెంట్లు, ప్రకటనకర్తలందరికీ రిపబ్లిక్ దినోత్సవ శుభాకాంక్షలు.

—సం.

## ముఖచిత్రం

నూతన సంవత్సర శుభాకాంక్షలతో జయప్రద, మా ముందు నందనోద్యానవనంలో పురి విప్పి నాట్యమాడే నెమలిలా మా [illegible]సులను రంజింపజేసింది

కుమార్ గంటా ఉమా శంకర్‌రెడ్డి, బరంపురం

• • •

28-12-84 క్రొత్త సంవత్సరంలో వెలువడిన మొట్టమొదటి సంచిక పాఠకలోకానికి శుభాకాంక్షలు తెలుపుతూ జయప్రద ముఖచిత్రంతో ప్రకృతి సౌందర్యాలను పునికి పుచ్చుకుని మమ్మల్ని ఆనందంలో ముంచి వేసింది

పెద్ది రమేష్ నీలిమ ఇల్లెందు

• • •

28-12-84 సంచిక ముఖచిత్రం, నా అభిమాన నటి జయప్రద చాలా బాగున్నది నా అభిమాన నటుడు శోభన్‌బాబుది వేస్తారని ఆశిస్తున్నాను

బి ప్రసాద్‌రావు విజయవాడ

• • •

28-12-84 నాటి ఆంధ్రసచిత్ర వారపత్రిక ముఖచిత్రం 'జయప్రద' బాగుంది

ఇ శ్రీనివాసరావు, ఖమ్మం

• • •

28-12-84 తేదీ సంచిక అందాలతార 'జయప్రద ముఖచిత్రం చాలా ఆకర్షణీయంగా ఉంది

వి లక్ష్మణశాస్త్రి భీమవరం

## కథలు

జయప్రద ముఖచిత్రంతో వెలువడిన సంచికలో మారని మనుషులు కథ నాకు మా కుటుంబ సభ్యులకు చాల బాగ నచ్చింది డాక్టర్ జయ నాగ రాజుగార్కి నా అభినందనలు

డి రుద్రప్ప, బళ్లారి

• • •

'జయప్రద' ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో 'సుబ్బారావు'సుబ్బారావు''కథ బాగుంది

కె ఎన్ కె శ్రీనివాస్, మైలవరం




• • •

శ్రీదేవి ముఖచిత్రం చాలా ఆకర్షణీయంగా వుంది ఇంతకీ ఇదే జాతి 'కొత్త సైకిల్ కథలు బాగున్నాయి

పి ఎస్ నాయుడు, కిచ్చాడ

## సీరియల్స్

సీరియల్స్ 'మౌనవిపంచి , దేదీప్య చాలా బాగున్నాయి యీ సీరియల్స్ మా కుటుంబ సభ్యులందరమూ చదువుతున్నాము

బత్తుల వెంకటేశ్వరరావు, కాకినాడ-1

• • •

దేదీప్య సీరియల్ మా ఇంటిల్లిపాదికీ నచ్చింది

పెద్ది రమేష్ ఇల్లెందు

## మహా సాహసం

శ్రీ తిరుమల రామచంద్రగారి 'హైదరాబాదు నోట్‌బుక్'లో శ్రీ ఎన్ టి రామారావుగారి మహా సాహసం గురించి ఈరోజే విడుదలయిన 21 12 84 సంచికలో చదివాను ఈ ఉత్తరం వ్రాసే సమయానికి లోక్‌సభ ఎన్నికల ఫలితాలు దాదాపుగా తెలుగుదేశం- మిత్ర పక్షాలు ఎక్కువ స్థానాలు కైవశం చేసుకున్నట్లుగా ప్రకటించబడ్డాయి ఆంధ్రదేశ రాజకీయ చరిత్రలో ఈ పరిణామం నూతనాధ్యాయానికి నాంది శ్రీ తిరుమల రామచంద్రగారు బహుదా అభినందనీయులు

యం మధు, హైదరాబాదు

## అచ్చు పొరపాటు

తేదీ 21-12-84, శ్రీదేవి ముఖచిత్రముతో వెలువడిన సంచికలో 'ఏకరూపులైన ఏకోదరులు వ్యాసంలో సోదరులు ఇద్దరూ 9 ఏండ్ల వారు బ్లూబెల్స్‌లో 10వ తరగతి చదువుతున్నారని రాసినారు 9 ఏండ్ల వయసు వాళ్లు 10వ తరగతి అందులో కాన్వెంట్‌లో చదవడం అసాధ్యం

ఎల్ వేణుగోపాల్, మంగళగిరి.

★ 5వ తరగతి చదువుతున్నారని ఉండాలి అచ్చు పొరపాటుకి చింతిస్తున్నాము —సం


## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు

దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938 - 1972)

శుక్రవారం 25-31 జనవరి, '85

శ్రీరక్తాక్షినామ సం మాఘ శు చవితి

సంపుటము 77 : సంచిక 21

సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

| | | |
|---|---|---|
| విడిప్రతి వెల | రు | 2-00 |
| ఆరు మాసాల చందా | రు | 55-90 |
| పోస్టులో ఏడాది చందా | రు | 111-80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక


ముఖచిత్రం

నటి. ముచ్చెర్ల అరుణ

(ఫోటో [illegible])

**కథలు :**

బహుమతి 14

మనస్తత్వం 26

అందరూ ఆలోచించండి 50

ఇదీ ఈ దేశం 61

**సీరియల్ నవలలు :**

రాగసంధ్య 8

పసిడి బొమ్మ 18

మౌన విపంచి 42

కాగితపు పడవలు 56

**వ్యాసాలు, శీర్షికలు :**

ఉత్తరాలు-4, న్యూఢిల్లీ లేఖ-5, వ్యక్తిగతం, వారఫలం-12, డాక్టర్ సలహాలు-17, ప్రశ్నావళి-25, సినిమా విశేషాలు-34, ఫాల్గుని డైరీ-40, ధర్మపథం-48, ఇ'వేమన' పద్యాలు-53, బాలల సంక్షేమం కోసం-54,హైదరాబాద్ నోట్‌బుక్-66

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# విచిత్రమైన ఎన్నికలు

మొన్న జరిగిన ఎన్నికలు చాలా విచిత్రమైనవి గెలిచిన పార్టీ మీద ప్రజాభిమానం ఎన్నికలకి ముందు చాలా కొంచెం కనిపించింది ఎన్నికల తర్వాత అంతకన్నా బాగా తగ్గింది వాటిని గురించి ప్రజలు మాట్లాడుకోడం మీకు కనిపించదు జనతా ప్రభంజనంలో జనతాపార్టీ విజయం సాధించి నప్పటిలాగే ఇప్పుడు కూడా తీవ్రమైన రాజకీయ చర్చలకి ఆలవాలమైన ఆఫీసులలో, బస్సులు మొదలైన వాటిలో కూడా ఎన్నికల గురించిన చర్చలు జరగటంలేదు అంతర్గతమైన వొత్తిడివల్లనో, మరో కారణంగానో తమకి ఇష్టం లేకపోయినా తప్పనిసరై ఎన్నికలలో వోటు వెయ్యడం చేసి నట్లని పిస్తున్నది మొన్న ఒక రోజున మా పొరుగున ఉన్న వారిద్దరు గంటకి పైగా దేన్ని గురించో మాట్లాడుకోడం నేను విన్నాను కానీ వారి సంభాషణలో ఒక్కసారి కూడా ఎన్నికల గురించిన ప్రస్తావన వాళ్ళు చెయ్యలేదు వాళ్ళిద్దరూ వోటు వేశారు, కానీ వాటి గురించి మాట్లాడుకోడం వారికి ఇష్టం లేనట్లు నాకనిపించింది

దేశాన్ని దాదాపు ఆరువారాల పాటు తన గుప్పిటలో పెట్టుకున్న ఒక వెర్రి ఆవేశాన్ని సృష్టించిన ఆ కెరటంవల్ల కావచ్చు లేదా అటువంటిది ఏమీ లేకపోయినా శ్రీమతి గాంధీ దారుణ హత్య అనంతరం జాతిలో కలిగిన ద్వేషపూరిత మనస్తత్వాన్ని వారు వోటు చెయ్యడం ద్వారా వదిలించు కోడానికి చేసిన ప్రయత్నం అయి ఉండవచ్చు అది పూర్తి కాగానే దేశంలో మామూలు పరిస్థితులు నెలకొని నిత్య జీవన గమనం ప్రారంభం అయింది

నా ఉద్దేశంలో, అది సరైన దనడానికి ఆధారం లేకపోయినా, మరి కొంతకాలం తర్వాత దేశానికి మరో చిక్కు ముడివంటి పెద్ద సమస్య ఎదురవ-వచ్చు హత్యకి ప్రతిగా ఏ మాత్రం అర్హత లేనటు-వంటి కొందరు వ్యక్తులకి అధికారం కట్టబెట్టటానికి మనం మూకుమ్మడిగా వోట్లు వెయ్యడం సరైన పద్ధతేనా? జర్మలానీని కాదని సునీల్‌దత్‌కో, ఎంతో కాలంగా లాభసాటి అయిన వృత్తిలో ఉంటూ ఏ నాడూ ఉదారంగా ఒక్కటి కూడా చెయ్యని ఆడి పాడే సినిమా నటుడు అమితాబ్ వంటి వారికీ వోటు వెయ్యడంలో ఇమిడి ఉన్న తత్వం ఎలాంటిదై ఉంటుంది? హెగ్డే సాధించలేని దానిని వైజయంతీ-మాల చెయ్యగలదా? జాతి భవిష్యత్తుని తీర్చిదిద్దే బాధ్యతని దేశం ఎన్నో సమస్యలని, అవి కూడా ఆయన తల్లి సృష్టించినటువంటివి, ఎదుర్కొం టున్న సమయంలో రాజీవ్‌గాంధీకి అప్పగించడానికి ఆయనలో ఉన్న విశిష్టమైన ఆ ప్రత్యేకత ఏమిటి?

సమైక్యత, సమగ్రత వంటి వాటిని గురించి మాట్లాడటం సబబే కానీ దేశం ఎదుర్కొంటున్న ఎన్నో సమస్యలు స్వాభావికంగా ఆర్థిక పరమైనటు-వంటివి మీరు మంత్ర దండాన్ని గాలిలో ఊపడం ద్వారా వాటిని మాయం చెయ్యలేరు బొంబాయి-లోని మురికివాడలలో నివసించే వారికి సునీల్‌దత్ నీడకల్పించలేదు అలాగే మదరాసులో నివసించే ప్రజలకి వైజయంతిమాల మంచినీటిని అందించ-లేదు ఇప్పటిదాకా వాళ్ళేదో సంఘ వ్యతిరేక చర్యలకి పాల్పడ్డట్లుగా వారికనించి సంఘసేవా కార్యక్రమాలు చేపడతామని చెబుతున్నారు కానీ సంఘ సేవవల్ల మురికివాడల నిర్మూలన, వానదేవుడి ముందు నృత్యంచేసినంత మాత్రాన ప్రజలకి మంచినీటిని అందించడం వంటివి ఎవరూ చెయ్యలేరు ఇవి చాలాకష్టమైన ఆర్థిక నిర్ణయాలు సమాజ రాజకీయాల అవగాహన ఏది మంచిదో, ఏది అంత మంచిది కాదో నిర్ణయించగల సామర్థ్యం ఉన్నవారు మాత్రమే చేయగల నిర్ణయాలు వెలిసి-పోయిన జీన్స్ వేసుకునే ఈ కుర్రకారు అలాంటి నిర్ణయాలు చెయ్యగలరా? విధాన నిర్ణయాలు తీసుకోడానికి వారికి ఉన్న జ్ఞానం ఏపాటిది? తమ వృత్తిరీత్యా ఇంతకాలం బూట్ పాలిష్ వ్యాపారం-లోనో, యాంటీ సెప్టిక్ ఔషదాల విక్రయంలోనో గడిపిన వారికి ఒక్కసారిగా దేశంలోని కోట్లాది ప్రజల భవిష్యత్తుకి సంభంధించిన నిర్ణయాలు తీసుకునే శక్తి ఎలా వస్తుంది? లాభాలని ఎలా సంపాదించా-లన్న విషయంలో వారు తమ వ్యాపారాల నిర్వహణలో నేర్చుకున్న నిర్ణయాల వంటివి ఇప్పుడు ఎంత మాత్రం తగవుకదా?

ఇవి అంత తేలికైన ప్రశ్నలు కావు! ఇంతకి ముందే చెప్పినట్లు ఈ ప్రశ్నలని ఏదో ఒక రోజున ఎవరో ఒకరు వారిని అడగక మానరు అది ఎప్పుడన్నది కాలమే నిర్ణయిస్తుంది భారత దేశంలో సమస్యలు రాత్రికి రాత్రి ఉద్భవించి పెంపొంది నటువంటివి కావు అంతే కాక, ఏవో కొన్ని తప్ప అవి ప్రత్యేకంగా మనదేశానికే ఉన్నటువంటివీకావు వాటిని సృష్టించిన విదానాలని సమూలంగా సంస్కరిస్తే తప్ప వాటి పరిష్కారం సాధ్యంకాదు అది అంత తేలికైన పనికాదు పంజాబ్‌లో ప్రజ్వరిల్లుతున్న రాజకీయ సమస్యనే తీసుకోండి సిక్కుల వేర్పాటు వాదం ఒక్క



రోజులో పెరిగినదికాదు అయితే శ్రీమతి గాంధీ చేతిలో అది తిరిగిన మలుపుకి మాత్రం బాధ్యత ఆమెదే దానిని కావాలనే ఆమె అలా చేశారా లేక పరిస్థితుల ప్రభావం ఆమెచేత అలా చేయించిందా? బహుశ రెండూ కావచ్చు రాజకీయ పరిణామాలు వాటికవే రూపు దిద్దుకుంటాయి రాజీవ్ గాంధీ ఆయన యువబృందం ఆ రాష్ట్రంలో చెలరేగుతున్న అగ్ని జ్వాలలో ఎలా దూక గలరు? ఇది కంప్యూటర్లనే సామర్థ్యానికి సంబంధించినది కాదు తెలివైన వ్యక్తులు. వారిలో కొందరు పార్టీ వెలుపల ఉండవచ్చు సహకారం ద్వారా ఆ రాష్ట్రంలో ప్రజల మనసుకి తగిలిన గాయాలని ఉపశమింప చేసే ప్రయత్నం జరగాలి కానీ వెలిసిపోయిన జీన్స్‌లో ఉండే ఈ కుర్రకారుకి తెలివైన వృద్ధులంటే తిరస్కారభావం ప్రతిపక్షంలో ఉన్నవారంటే అంతకన్నా మరీ ఎక్కువ కంటగింపు కాంగ్రెసు పార్టీ 400 మందికి పైగా సభ్యులని పార్లమెంటుకి పంపించి ఉండవచ్చు కానీ ఎన్నికలలో వోటు వేసిన వారిలో సగానికి పైగా ఆ పార్టీకి వ్యతిరేకంగా వోటు వేశారన్న విషయాన్ని వారు గుర్తుంచుకోడం మంచిది 10 కోట్ల మందికి పైగా అధికార పార్టీకి వ్యతిరేకంగా వోట్లు వేశారంటే అది తక్కువ సంఖ్య ఏమీకాదు కృత్రిమమైన క్రోధం ద్వేషంతో కూడిన ఒక కెరటానికి తాము ఎదురీదుతున్నామని తెలిసే వారు ధైర్యంగా




న్యూఢిల్లీ లేఖ. ...

నిర్భీతితో వ్యతిరేకంగా వోట్లు వేశారు అది చాలా వివేకవంతమైన ఆలోచన అన్నది తర్వాత అనిపిస్తుంది

కాంగ్రెసు పార్టీ తిరిగి అధికారాన్ని హస్తగతం చేసుకుని ఉండవచ్చు విజయాన్ని సమర్థించే వ్యాఖ్యాతలు ఎప్పుడైనా ఉంటూనే ఉంటారు కానీ ఇప్పుడు అలాంటి వారెవరూ లేకపోవడం ఆశ్చర్యకరమైన విషయం పత్రికలు తమకి ఎప్పుడూ అనుకూలంగా లేవని రాజీవ్,ఆయన మిత్ర బృందం అనవచ్చు దానిని పట్టించుకోవాల్సిన పనిలేదు పత్రికల వారికి తమ కాళ్ల కింద ఏం జరుగుతున్నదో తెలియదని కూడా వారు అనవచ్చు కానీ అది నిజం కాదు దేశాన్ని ముంచెత్తే ఒక వరద లాంటిదేదో రాబోతున్నదని మనలో చాలా మంది గ్రహించే ఉంటారు దాని ఉధృతం ఎంత అన్నది మాత్రం తెలియదు అధికారంలో ఉన్న పార్టీకి కూడా అది తెలియదు అయినా అది అంత ప్రధానమైన అంశం కాదు కానీ తమాషా ఏమిటంటే అధికారంలో ఉన్న పక్షంవారు ఏవో గమ్మత్తుల ద్వారా పరిపాలించాలని ప్రయత్నిస్తే అది దేశ సమైక్యతకి కాక అనైక్యతకి దోహదం కల్పించినట్లు అవుతుంది దేశ సమైక్యత సమగ్రతల పరిరక్షణకే ప్రజలు ఆ పార్టీకి ఓటు వేశారు అనుమానించడానికి ఎంత మాత్రం వీలులేని జాతిమీద ఇది దారుణమైన హాస్యోక్తి కావచ్చు కానీ ఉప్పెన కెరటంద్వారా అధికారంలోకి ఎవరైతే వచ్చారో చివరికి వాళ్లే నష్ఠలపాలు కావాల్సి ఉంటుందన్న సంగతి వారికి తెలియనట్లే కనిపిస్తున్నది □

---

సీరియల్

# రాగసంధ్య

కాశీనాథుని సువర్చలా దేవి

(గత సంచిక తరువాయి)

సంధ్య గుండెలమీద ఎవరో బలంగా అడుగు మోపినట్టయింది శ్రీకాంత్‌ని చూచిన మధు ముఖంలో వెయ్యి దీపాల కాంతి! అతని ముఖంలో శరత్కాంతులు! సంధ్య కర్థం కానిదదే! శ్రీకాంత్ కనబడగానే మధు ముఖంలో కొట్టవచ్చినట్టు ఆనందం! ఒక పసివాడు ఏదో అద్భుతం చూచినట్టు చూస్తాడు!

"శ్రీ రా, రా! ఇంతచక్కని ఆహ్లాదకరమైన వాతావరణంలో నీరాక ఎంత హాయిని కల్గిస్తున్నదో తెలుసా! సూర్యాతపంతో ఉడుకెత్తిపోతున్న శరీరం మీద తుషార బిందువులు చిలికినట్టున్నది –' ఆప్యాయంగా శ్రీకాంత్ చెయ్యి నందుకుంటూ అన్నాడు మధు

శ్రీకాంత్ కూడా ఆప్యాయంగా, ప్రేమగా అతని చేతిని నొక్కుతూ పక్కనే కూర్చున్నాడు

ఇంటి కెళుతున్నాను! దూరంగా నువ్వు పార్కులోకి వెళ్లటం కనిపించింది ఈ బిజినెస్ వ్యవహారంతో నా తల వేడెక్కిపోయింది నీతో కాసేపు కులాసాగా గడపవచ్చని కారాపి ఇటొచ్చాను –' అంటూ సంధ్య వైపు తిరిగి 'మేడమ్! మీరు క్షమించాలి! నారాక మీకు అభ్యంతరమైతే – నారాక మీకు కష్టాన్ని కలిగిస్తే మన్నించాలి శ్రీకాంత్ నొచ్చుకుంటున్నట్టుగా అన్నాడు

'ఎంతమాటన్నావు – ఇవిగో తిను–' అంటూ తనచేతిలో కాగితంలో చుట్టిన మసాలా పప్పు అందించాడు మధు శ్రీకాంత్‌కి

చాలా రుచిగా ఉన్నా కారంగా ఉన్న ఆ పప్పుకి శ్రీకాంత్ కళ్లల్లోకి నీళ్ళు వచ్చినయి

'ఇప్పుడీకారం పోవాలంటే ఏం చెయ్యాలి! కసిగా అంది సంధ్య 'నా పెదవులమీద తేనె నిస్తాను' చాలా మామూలుగా అంటున్న మధుని కళ్ళు పెద్దవి చేసుకుని చూసింది సంధ్య ఏం మనిషి తను తనేం మాట్లాడు-తున్నాడో తెలియకుండానే ఎంత అసందర్భంగా తాగిన వాడిలా మాట్లాడు-తున్నాడు శ్రీకాంత్ సాన్నిధ్యం అతనికంత మైమరుపా! సంధ్య ఆశ్చర్యంనుంచి తేరుకుంది సంధ్య ఎంతో సహనంతో తనలో నిండిన కోపాన్ని మింగింది కాని, అసహ్యం నిండిన ఆమె కళ్ళు ఆమె అంతర్యాన్ని ఏమాత్రం దాచలేక పోయినయి. "నా భక్తి నీ కర్థంకాదు నాకెంత ఆరాధనో తెలుసా!" మధు విజయోత్సాహంతో అన్నాడు

కోపంతో సంధ్య ముక్కుపుటాలు ఎగిరి పడుతుండగా అన్నది బాగుంది

**జరిగిన కథ-1 : సంధ్య మధుతో జీవితం పంచుకోవడానికి అంగీ-కరించింది. మధు, దమయంతి – శ్రీనివాసరావుగారి మొదటి భార్య సంతానం. రెండో భార్య సీతాలక్ష్మి. మధు స్నేహితుడు శ్రీకాంత్ అంటే సంధ్యకు తగని చిరాకు, అసహ్యం. సంధ్య పిన్ని కూతురు గీత. గీతను శ్రీకాంత్ కిచ్చి పెళ్ళి చేస్తే బాగుంటుందని పిన్ని సుందరమ్మ ఆలోచన.**

– చాలా బాగుంది – ఒక మరమనిషితో జీవితం ఎట్లా ఉంటుందో బాగా రుచి చూపిస్తున్నావు!"

వీళ్ళిద్దరి సంభాషణా తలాతోకా తెలియక తికమకగా ఉంది శ్రీకాంత్‌కి సంధ్య మధు మాటల దెబ్బనుంచి కోలుకో లేకుండా వుంది 'మీరిద్దరూ ఇలా వేద భాషలో మాట్లాడుకుంటుంటే నాకు మతిపోతున్నది – ఇప్పుడీ వేదానికి ఎవరిచేత భాష్యం రాయించను–' ఇద్దర్నీ మార్చి మార్చి చూస్తూ అన్నాడు శ్రీకాంత్ ఇంతలో రెండు మూడేళ్లపాప – కుందనపు బొమ్మలా ఉంది ఏడుస్తూ వీళ్లవైపే వచ్చింది శ్రీకాంత్ ఆత్రంగా ఆ పాపని దగ్గరకు తీసుకున్నాడు తన జేబులోంచి చిన్న బిస్కెట్ ప్యాకెట్ తీసి ఒక బిస్కెట్ తీసి పాపకిచ్చాడు తన పెన్ను తీసిచ్చాడు ఆప్యాయమైన ఆ స్పర్శకి పాప ఆడుతూ అతని ఒళ్లో కూర్చున్నది పాపకి తెలుగు రానట్టున్నది శ్రీకాంత్ హిందీలో అడిగి తెలుసుకుంటున్నాడు పాప ముద్దు ముద్దుగా చెప్తున్నది తను, పాప తప్ప లోకంలో ఇంకెవ్వరూ లేనట్టుగా పాప లోకంలో కెళ్ళిపోయాడు శ్రీకాంత్ మధు, సంధ్య ఆశ్చర్యంగా చూస్తూ వింటూ కూర్చున్నారు పాపపేరు సీమ తల్లి పేరు మమ్మీ– తండ్రిపేరు డాడీ– వాళ్ల కారులో వచ్చారు తల్లి పేరు చెప్పి పాప మళ్ళీ బిక్క మొహంవేసి ఏడవటం మొదలు పెట్టింది దాదాపు గంట కావచ్చినా పాప తాలూకు వాళ్ళెవరూ రాలేదు మదు సంధ్యలతో పాటు శ్రీకాంత్‌కి కూడా కొద్దిగా భయంవేసింది ఇంతలో 'సీమూ– బేబీ– అంటూ దాదాపు శ్రీకాంత్ మీద వాలిపోయి పాపని గబుక్కున ఎత్తుకొని గుండెల కదుముకున్నది ఒక యువతి పక్కనే ఉన్న వ్యక్తి 'మున్నీ–బేబీ–' భార్య చేతిలోంచి లాక్కుని ముద్దుల వర్షం కురిపించసాగాడు చాలా సేపటికి తేరుకొని శ్రీకాంత్‌ని కౌగలించుకొని 'థ్యాంక్యూ సార్– చాలా సేపటి నుంచి వెతుకుతున్నాం– పాప కనబడలేదు – మా అదృష్టం– ఇవ్వాళ లేచినవేళ మంచిది మీ ఋణం తీర్చుకోలేం–' అంటూ కృతజ్ఞత వెలిబుచ్చాడతను స్వచ్ఛమైన తెలుగులో మాట్లాడుతున్న అతన్ని, పంజాబీ డ్రస్‌లో ఉన్న అతని బార్యని మార్చి మార్చి చూస్తున్న శ్రీకాంత్‌కి తన బార్యని పరిచయం చేశాడతను అతను తెలుగువాడే! భార్య పంజాబీ ఆవిడ పేరు 'మాళవిక' అతను పెట్టుకున్నదే మాళవిక అందం కళ్లను మిరుమిట్లు కొల్పుతున్నది దాదాపు ముగ్గురు సభ్యతను కూడా మర్చిపోయి మాళవికను చూచారు

వాళ్ళు పదే పదే థ్యాంక్యూ చెప్పి పాపతో వెళ్లిపోయారు చాలా సేపటికి తేరుకున్నారు వాళ్ళు ముగ్గురూ

'అబ్బ! ఏమందం ఆవిడది–' ప్రశంసాపూర్వకంగా అన్నాడు మధు

'అవును, నేనుకూడా కళ్ళు తిప్పుకో లేకపోయాను ' సంధ్య శ్రుతి-కలిపింది , తాత్కాలికంగా జరిగింది మర్చిపోయి

క్షణం సంధ్య వైపు చూచాడు శ్రీకాంత్

కదూ, శ్రీకాంత్– మనం అనుకో కూడదుగాని– ఆవిడ చాలా అందంగా ఉంది–' మనసులో దాచుకోలేని మధు అన్నాడు శ్రీకాంత్ మళ్ళీ సంధ్య వైపు చూచాడు

'ఏమైనా– ఆ కళ్లల్లో అంత వెలుగులేదు పెదవుల్లో కోపంలేదు నీకు కోపం రాకుండా ఉంటే చెప్తాను నీ కాబోయే భార్యలాగ పిచ్చెక్కించే అందం మాత్రం ఆవిడకిలేదు చాలా సీరియస్‌గా కామెంట్ చేశాడు శ్రీకాంత్

మధు గర్వంగా సంధ్య ముఖంలోకి చూచాడు స్నేహపూర్వకంగా శ్రీకాంత్ చెయ్యి నొక్కాడు

సంధ్య బ్రాన్పడి పోయింది మధు అమాయకత్వానికి ఏడవాలో శ్రీకాంత్ అహంకారానికి ప్రతీకారం చెయ్యాలో క్షణం తెలియలేదు

'పరాయి ఆడవాళ్ల అందాన్ని పొగడుకొనే సంస్కార విహీనులు మీరు– ఇద్దరికిద్దరూ సరిపోయేరు ' గిరుక్కున తిరిగి వెళ్లిపోయింది సంధ్య

వెనక నుంచి మధు పిలుస్తూనే ఉన్నాడు ఇంటికొచ్చేవరకూ తిరిగి చూడలేదామె

కళ్ళ ముందు తిరిగిన ఆ సాయంకాలపు సంఘటనతో చేదుగా ఉన్న మనస్సు మరింత చేదుగా మారింది బరువుగా ఊపిరి పీల్చుకుని మరోక వైపుకి తిరిగి పడుకుంది సంధ్య రాత్రంతా శ్రీకాంత్ కళ్ళల్లో మెదులుతూనే వున్నాడు

*   *   *   *   *

నాలుగు రోజులు చాలా ప్రశాంతంగా గడిచి పోయినయి సంధ్య మామూలుగా ఆఫీసుకి వెళ్ళి వస్తున్నది గీత టైపు పరీక్ష రిజల్ట్సు వచ్చినయి ఎక్కడైనా ఉద్యోగం దొరికితే చెయ్యాలన్న ఉద్దేశ్యం బలంగా ఉంది గీతకు సంధ్య జీతంతో అతికష్టం మీద నెట్టుకొస్తున్న ఈ సంసారంలో సారమేలేదు ఒక్క సినిమా కెళ్ళాలన్నా కష్టమే సంధ్య జీవితం ఒక రకంగా స్థిరపడినట్లే! మధుకి ఉద్యోగం వచ్చిన వెంటనే పెళ్ళి చేసుకుంటాడు తన పెళ్ళి ప్రసక్తి ఇప్పట్లో లేదు కొద్దో గొప్పో డబ్బు సమకూర్చుకోవాలి ఉద్యోగం వస్తే చదువు ఆపవచ్చు! సుందరమ్మ ఇంట్లో లేదు ఆవిడకు రోజూ ఏదో కాలక్షేపం, కొత్తగా కుదుర్చుకున్న ట్యూషనుకు వెళ్ళింది సంధ్య అలసటగా మంచం మీద కూర్చున్న గీత పక్కనే ఉన్న కిటికీ తలుపు తెరిచింది ఆ ఇంటికున్న ఒకే ఒక చిన్న సౌఖ్యం, చక్కని పెరడు, తలుపు తీయగానే రెండు వైపులా పెద్ద పెద్ద అరుగలు వేసవికాలంలో ఆ అరుగుల మీదే పడుకుంటారు. పెరడు చిన్నదైనా వాళ్ళ మనసుకి అదో నందన వనంలా ఉంటుంది ఒకజాజి పందిరి – చిన్న మల్లె అంటు ప్రహరీ గోడ వెంబడే కనకాంబరాలు చిన్న తొట్లలో మరువం నాలుగు నందివర్ధనం చెట్లు– మధ్యగా తులసి కోట సంధ్యా తను అపురూపంగా పెంచుకున్న చిన్న ఉద్యానవనం తెరచిన కిటికీలోంచి పాయలు పాయలుగా వెన్నెల లోపలకు వచ్చింది అబ్బ! ఎంత వెన్నెల– అవును శరత్కాలం కదూ! ధౌత్యంతా ఆహ్లాదకరంగా ఉంది తెల్లని నందివర్ధనాలు మరిత తెల్లగా వెన్నెలలో మెరిసి పోతున్నాయి అలా చూస్తూ కూర్చుంటే యుగాలే గడిచి పోయేట్టుంది బయట సైకిల్ బెల్ మోగటంతో ఈ లోకంలోకి వచ్చిన గీత విసుగ్గా లేచి వెళ్ళింది పాలవాడు ఛట్– ఈ పాలవాడు కూడా ఇప్పుడే రావాలా! విసుగ్గా లేచి పోయింది లోపలకు రాబోతున్న ఆమె కళ్ళకు బంధం వేసినట్లే ఆగిపోయింది మూర్తి నడిచి వెళ్తున్నాడు అతను కూడా చూసాడేమో టక్కున ఆగిపోయాడు మూర్తి ముఖం మీద క్షణకాలం చిరునవ్వు తళుక్కున మెరిసింది అనుకోకుండా మూర్తి కనబడటంతో తబ్బిబ్బు పడినా వెంటనే తేరుకొని లోపలకు రాబోయింది గీత

'క్షమించండి– మీతో ఒక్క విషయం మాట్లాడాలి' అతనే దగ్గరకు వచ్చాడు గీత మాట్లాడలేదు చేతిలో పాలగిన్నె అట్లాగే ఉంది

'ఆ రోజు జరిగిన సంఘటనకు నిజంగా సిగ్గు పడుతున్నాను నాకు వేరే ఉద్దేశాలేవీ లేవు బస్సులో కూడా పొరపాటుగా జరిగిన విషయాలకు దయచేసి మీరు రంగులు వేయకండి ఆడ పిల్లల వెంటబడే జులాయివాడ్నిగాదు గీతగారూ! నాకు పెళ్ళయింది నేను వివాహితుడ్ని ఆ గౌరవం నా మీద ఉంచండి చాలు గిర్రుక్కున వెళ్ళి పోయాడు మూర్తి అనుకోని ఈ సంఘటనకు గీతకు తల తిరిగి పోయింది మూర్తి మీద కోపం వచ్చిన మాట వాస్తవమే! అయినా తన మనసులో ఎక్కడో ఎప్పుడో ఇతను ప్రవేశించాడు ఈ మధ్య ఎందుకో తరచుగా అతను గుర్తు వస్తున్నాడు అతనికి పెళ్ళయిందా! ఎందుకో చాలా విచారకరమైన వార్త విన్నట్లు మనసంతా దిగులుతో నిండిపోయింది లోపలకు వస్తూనే దిండులో ముఖం దాచుకుని వెక్కి వెక్కి ఏడ్చింది చాలా సేపటికి కొంత భారం తగ్గినట్లనిపించింది సంధ్య ఇంటికి వచ్చేసరికి ఎక్కడి వక్కడే ఉన్నాయి అన్నం కూడా వండలేదు సంధ్య మాట్లాడటానికి అవకాశం ఇవ్వకుండానే-

'అక్కా! నాకు ఎందుకో చాలా నీరసంగా ఉంది లేచి వంట చెయ్యలేక పోయాను!" అంది గోడవైపు తిరిగి మాట్లాడుతున్న గీతను ఒక్క క్షణం చూసి వంటింటి వైపు వెళ్ళింది సంధ్య ఆ రాత్రి ఎంతో బలవంతం మీద గీత అన్నం తిన్నాననిపించింది

*   *   *   *   *

. ఒక రకంగా అందరికీ కాలం మందగొడిగా సాగుతున్నట్టే ఉన్నది ఎవరి ఆలోచనలు వాళ్ళవిగా ఎవరి పనులు వాళ్ళు యాంత్రికంగా చేసుకుపోతున్నారు ఆ నాటి సంఘటనతో సంధ్య మనసులో లోతుగా దిగబడిన ముల్లు గుచ్చుతూనే ఉంది తరువాత ఎంత లేదన్నా మధుని పదిసార్లన్నా కలుసుకొని ఉంటుంది అతను ఏమీ జరగనట్లు హాయిగా నవ్వుతూనే ఉన్నాడు కాని సంధ్య మాత్రం ఇది వరకులా ఉండలేక పోతున్నది గీతకూడా రెండు నెలల డిపాజిట్ పేరుకొని పుస్తకాల అడుగున నోట్లను పడేసిందే కాని మళ్ళీ బ్యాంక్ వైపు వెళ్ళలేదు మధు కొత్తగా ఇంటర్వ్యూకెళ్ళిన ఉద్యోగ ఫలితం కోసం నిరీక్షిస్తున్నాడు నాలుగైదుసార్లు శ్రీకాంత్, మధు కలిసి గీతకు కనిపించారు వాళ్ళ యింటికి కూడా వచ్చారు సుందరమ్మ అతి ప్రేమను ఒలకబోస్తూ శ్రీకాంత్‌తో మాట్లాడుతుంది. ఫలితంగా ఆవిడకు కొత్త భాగవత ప్రతి, పురాణానికి వెళ్ళేప్పుడు చలిలో బాధ పడకుండా శాలువా శ్రీకాంత్ నుంచి ముట్టినయి ఆ రోజు ఇంట్లో సంధ్య చేసిన గొడవ ఇంతా అంతాకాదు తామరాకు మీద నీటి బొట్లల్లే తనకు సంబంధించినవి కానట్లు వినూరుకుంది సుందరమ్మ. మధు ఉద్యోగాన్వేషణలో పడిపోయి సంధ్య ముభావంగాని, ఆవిడ విసిరే వ్యంగ్యోక్తులు గాని పట్టించుకోవటంలేదు పూర్తిగా అందులో లీనమై పోయాడతను

కాలం మీద కాలం గడిచి పోతున్నది సుందరమ్మ ఆలోచనలకు రోజు రోజు ఎరువువేసి పెంచుకుంటున్నది సంధ్య, గీత ఎంత నిర్లిప్తంగా కాలంగడుపుతున్నా ఇట్లా ఏమార్పు లేకుండా జరుగుతున్న కాలంమీద



విసుగ్గా ఉంటున్నది ఏదో జరగాలి! వరద రాకూడదూ! ఉప్పెన రాకూడదూ! భూకంపం రాకూడదూ! నిజంగా ఉప్పెనలాగా ఒకరోజు హడావుడిగా వచ్చాడు మధు పక్కన శ్రీకాంత్ కూడా ఉన్నాడు దొరబాబులా ఉన్న శ్రీకాంత్ పక్కన మామూలు బట్టల్లో చామనచాయ రంగులో **అతి సాధారణంగా ఉన్న మధుని** చూసి చిరాకు పడ్డది సంధ్య ఏం మనిషి! తన పక్కన **అతగాడెందుకు? ఆ బట్టలూ అతనూ, షోకిల్లా!** ఎన్నిసార్లు చెప్పినా మధు కర్థంకాదు వీడొక్కడ్ని వేసుకొని వస్తాడు సిగ్గులేకపోతే సరి వీళ్ళిద్దరూ వచ్చేసరికి ఎండి కుళ్ళిపోయిన మిరపకాయల కుప్పలోంచి మంచికాయలు ఏరి తొడిమలు తీస్తున్నది సుందరమ్మ గీత గోడకానుకుని కాళ్ళుచాచుకుని కూర్చుని కాఫీ తాగుతున్నది సంధ్య బియ్యంలో రాళ్ళేరుతున్నది వీళ్ళరాక క్షణం అందర్నీ స్థంభింపజేసింది మధుకి ఉద్యోగం వచ్చింది వెంటనే వెళ్ళి జాయినవ్వాలి ముందు ట్రైనింగు తరువాత ఎక్కడ పోస్టింగ్ వస్తుందో

## నిన్న – నేడు

ఒక 'గీత' గీశాను
'పికాసో'ను మించిన
చిత్రకారిణి ననుకొన్నాను
ఒక 'కథ' వ్రాశాను
'మామ్'ను మించిన
కథకురాలి ననుకొన్నాను
ఒక 'నవల' కూర్చాను
'ఆస్కార్'ను మించిన
నవలా రచయిత్రి ననుకొన్నాను
నిన్న – పెద్దలుగా
నా కగుపించిన వాళ్ళంతా
నా వద్ద పాఠాలు నేర్చుకోవాలి నేడు
నిన్న – నేడుల మధ్య
నేనెంతో ఎత్తు కెదిగాను
అహం శిఖరాల నందు కొన్నాను

–జ్యోతి

తెలియదు పదినెలల ట్రైనింగు ముందు పూర్తవ్వాలి జీతం బాగానే ఉంది ట్రైనింగ్ పీరియడ్‌లో కూడా కొంత వస్తుంది ఉత్సాహంగా ఆశగా చెప్పుకు పోతున్నాడు మధు సంధ్య కళ్ళెత్తి మధువంక చూసింది ఆ చూపుల్లో ఎన్నో భావాలున్నాయి ఇంత తొందరగా వెళ్ళాలా! అన్నభావం మటుకు స్పష్టంగా కనబడుతున్నది చాలా కాలంగా ఎదురు చూస్తున్న విషయం వాళ్ళిద్దరూ కలసి కన్న స్వప్నం ఫలించటానికి తొలిమెట్టు ఎంతో ఆనందాన్నిచ్చే వార్త! ఈ రోజుకోసం తామెంత ఎదురు చూశారు శ్రీకాంత్ సంధ్య ముఖంలోకి చూస్తున్నాడు మధు అదేమీ పట్టనట్లు మాట్లాడుకు పోతున్నాడు ఈ రోజు రాత్రే బయలుదేరుతున్నాను –

సంధ్య మాట్లాడలేదు సుందరమ్మకేసి తిరిగి చెప్పాడు

సామాను అదీ సర్దుకోవాలి టికెట్ బుక్ చేసుకోవాలి నాగపూర్‌కి దొరుకుతుందో లేదో అంటున్నాడు మా వాడు మీరేమీ దిగులు పడకండి శ్రీకాంత్ మీకు అండగా ఉంటాడు నాలుగు రోజుల కొకసారి వస్తుంటాడు ఈ సంవత్సరం అయిపోయిం తర్వాతగాని పెళ్ళిమాట తలపెట్టలేను ఈ ఉద్యోగం వదులుకుంటే మళ్ళీ లేటు శ్రీకాంత్ కూడా బలవంతం చేస్తున్నాడు ఉద్యోగం మంచిది వదులుకుంటే దొరకదు పెళ్ళిదేముంది ఇవ్వాళ కాకపోతే రేపు సంధ్యెక్కడికి పోతుంది నేనెక్కడికి పోతాను – చాలా మామూలుగా ముఖంలో ఏ మార్పు లేకుండా అంటున్న మధును కళ్ళప్పగించి చూడసాగింది సంధ్య ఏం మనిషి! మళ్ళీ ఇంకోసారనుకుంది శ్రీకాంత్ మాత్రం సంధ్య ముఖంలో ప్రతి చిన్న మార్పూ గమనిస్తూనే ఉన్నాడు నిరుత్సాహము, అసహ్యము, కోపము రకరకాల భావాలు ఒక్కసారిగా మనసును పొగలా ఆక్రమించుకోగా సంధ్య లేచి పోయింది వెళ్తూ ఒకసారి శ్రీకాంత్ ముఖంలోకి తీవ్రంగా చూచి మరీ వెళ్ళింది మధు కవేమీ పట్టలేదు చెయ్యబోయే ఉద్యోగం నాగపూర్‌లోజీవితం సంవత్సరం తర్వాత కాస్త నిలదొక్కుకుని నాలుగు డబ్బులు వెనకేసుకుంటే చెల్లెలి పెళ్ళి, తరువాత తన పెళ్ళి – భవిష్యత్తు, బంగారు రెక్కల పక్షిలా హాయిగా గగన వీధిలో విహరిస్తున్నది మధు గుండెలనిండా నిండిన తృప్తి, ఆనందం! సంధ్య మనసంతా ఆవరించుకున్న నిస్పృహ! శ్రీకాంత్ మనసులో ఏదో-తెలియని శూన్యం! సాయంత్రం హోటల్లో పార్టీ యేర్పాటు చేశాడు శ్రీకాంత్ మధు, గీత, సంధ్య, తను – అంతే! గట్టిగా రావాలని చెప్పి మిత్రులిద్దరూ బయలుదేరారు శ్రీకాంత్ అందచందాలు, గుణగణాలు వర్ణిస్తూ సుందరమ్మ చాలా సేపు గడిపింది కూర్చున్నచోటునుంచి కదలకండా ఆవిడ వాగుతూనే ఉన్నది వంటయిపోయింది

*   *   *   *   *

హోటల్ మృగశిర దేదీప్యమానంగా వెలిగిపోతున్నది ఫామిలీ రూమ్‌లో శ్రీకాంత్, మదు ఎదురు చూస్తూ కూర్చున్నారు అప్పటికి దాదాపు గంట నుంచి ఎదురు చూస్తున్నారు వాళ్ళు మూడుసార్లు కాఫీ తాగారు అరగంట తర్వాత గీత, వెనకనే సంధ్య వచ్చారు సంధ్య ముఖం చూచిన మధు అప్రయత్నంగానే శ్రీకాంత్ వైపు చూచాడు శ్రీకాంత్ నిశితంగా సంధ్యను గమనించటం మదు చూస్తూనే ఉన్నాడు మొదటిసారిగా తెప్పరిల్లింది శ్రీకాంతే!

'రండి! చాలా చక్కగా టైమ్ మేంటైన్ చేశారే!' నవ్వుతూ స్వాగత వచనాలు పలికాడు

మధు కెదురుగా గీత, శ్రీకాంత్ ఎదురుగా సంధ్య కూర్చున్నారు సాదా గులాబీ రంగు వాయిల్ చీర, నల్లని బ్లౌజు సంధ్య అందాన్ని ఇనుమడింప జేస్తున్నాయి చీర రంగు శరీర కాంతితో పోటీ పడుతుంటే చీర మీద నల్లని చిన్న చుక్కలు సంధ్య కనురెప్పల్ని, జుట్టుని తమతో పోల్చి చూచు-కుంటున్నాయి తమ ఆలస్యానికి కారణాలు రకరకాలుగా చెప్పుకు పోతున్నది గీత సంధ్య పెదవి కదపకుండా నిర్లిప్తంగా కూర్చున్నది శ్రీకాంత్ రెండు మూడు రకాల స్వీట్లు హాట్లూ, వాటితో పాటు చల్లని డ్రింక్సు







తెప్పించాడు ఎంత బలవంతం చేసినా సంధ్య ఏ ఒక్కటీ ముట్టుకోలేదు వంట్లో బాగుండలేదనే నెపంతో నవ్వుతూనే తిరస్కరించింది మధు నిజమే ననుకున్నాడు కాని, శ్రీకాంత్‌కి మాత్రం తెలుసు తన డబ్బుతో తను చేసే ఏ ఒక్క పని సంధ్య స్వీకరించదని గీత మధు తృప్తిగా కడుపునిండా తిన్నారు ఆవురావురుమని తింటున్న గీతను ఆప్యాయంగా స్నేహితుడిస్తున్న స్నేహాన్ని మదురంగా స్వీకరిస్తున్న మదుని కళ్ళు విప్పార్చుకుని చూస్తూ కూర్చున్నది సంధ్య

'కనీసం మంచినీళ్ళయినా తీసుకోరా?' అప్పటికే మధు, గీత బయటకు నడిచారు వాళ్ళ వెనకాలే వెళ్తున్న సంధ్యను వెనుక నుంచి నెమ్మదిగా అడిగాడు శ్రీకాంత్ వెనుతిరిగి చూచిన సంధ్య క్షణం నిలబడింది శ్రీకాంత్ చూపుల్లో చదవ తగినవి, చదవలేనివి ఎక్కడో హృదయంలో సున్నితంగా గుచ్చుకుని చలింపచేసే భావాలెన్నో ఉన్నాయి త్వర త్వరగా గీతను మదును కలుసుకుంది సంధ్య

'సంధ్యా! అలా ఉన్నావేం'? సంధ్య పక్కనే నడుస్తున్న మధు అడిగాడు

ఎట్లా ఉంటే నీకేం! హాయిగా కడుపునిండా తిన్నావు మొహమాటమన్నా లేకుండా అన్ని ప్లేట్లూ వరసగా తింటుంటే నాకు నాకెంత కంపరంగా ఉందో నువ్వూహించలేవు– అసహనంగా అంది సంధ్య మధు తేలిగ్గా నవ్వేశాడు

'సంధ్యా! స్నేహానికి ప్రాణం ఇవ్వగలవాడు శ్రీకాంత్ నిష్కల్మషమైన అతని స్నేహాన్ని శంకించి, కించ పరచి నన్ను నేను వంచన చేసుకోలేను నాకోసం అతనెన్ని చేశాడు ఈ నాడు నా ఈ భవిష్యత్తుకు పునాది వేసిందెవరు? అతనితో గడిపిన ప్రతిక్షణమూ మదురమే! సరే, పోనియ్ ఆ విషయం వదిలేద్దాం కనీసం రెండు రోజులు కొకసారైనా ఉత్తరం రాస్తావా! నిన్ను వదిలి వెళ్ళాలంటే నిజంగా ఎంత బాధగా ఉందో!"

అమాయకమైన మదు ముఖంలోకి చూస్తున్న సంధ్య తాత్కాలికంగా తన కోపాన్ని మర్చి పోయింది నిజమే! అతనెంత దూరం వెళ్ళి పోతున్నాడు ఉద్యోగం దొరికిన సంతోషాన్ని అతనితో కలిసి తను పంచుకోలేదు పోనీ, తన మనసులో బాధనూ అతనితో చెప్పుకోలేదు మళ్ళీ సంవత్సరం వరకు మదు తనకు కనబడడు తను ప్రాణ సమంగా ప్రేమించిన చెలికాడు! కలిసి కష్టాలు చెప్పుకున్న స్నేహితులు జీవిత భాగస్వాములు కావాలని కలలు కన్న తాము ఈ నాడు ఎంత దూర దూరంగా తిరిగారు సంధ్య తన ప్రవర్తనకు సిగ్గు పడింది మధు చేతిని ఆప్యాయంగా పట్టుకుంది ముందు గీత, శ్రీకాంత్ నడుస్తున్నారు శ్రీకాంత్ ఏదో చెప్తున్నాడు గీత విరగబడి నవ్వుతున్నది జనం పల్చగా ఉన్న ఆ రోడ్డులో నుంచి వాళ్ళు ఆబిడ్స్ వైపు నడకసాగించారు ముందు శ్రీకాంత్, గీత– వెనకాల మధు చెయ్యి పట్టుకుని సంధ్య నడుస్తున్నారు నడుస్తున్న దల్లా గబుక్కున మధుని ఆపింది సంధ్య దోవలో ఒక స్వీట్ షాపు ముందు నుంచి పోతూ ఏదో స్ఫురించి ఆపి నాలుగు రకాల స్వీట్లు కొన్నది మధు వారిస్తున్నా వినలేదామె

మధూ, ఇవి తింటూ నడుద్దాం నీకు ఉద్యోగం దొరికినందుకు ఇది నా సంతోషం – ప్యాకెట్‌లోంచి తీసిచ్చింది సంధ్య 'సంధ్యా! ఒకమాటడగనా! అక్కడ ఏమీ తీసుకోకుండా ఇక్కడ ఇవికొని మనిద్దరం తింటుంటే శ్రీకాంత్ ఏమనుకుంటాడు ఆలోచించావా!

తాత్కాలికంగా మర్చిపోయిన కోపం సంధ్య ముఖంలో ఎఱ్ఱగా మెరిసింది

మదు! నా ఆనందాన్ని సంతోషాన్ని నీతో అనుభవించటానికి ఒకళ్ళేదో అనుకుంటారని పాడుచేసుకోలేను నన్ను ఈ కాసేపయినా నీతో కలిసి ఉండనివ్వవా!' అప్పటికే సంధ్య కళ్ళలో నీళ్ళు నిలిచినయి

'సంధ్యా –' మదు మాట్లాడలేక పోయాడు

వెనకాల వీళ్ళు వస్తున్నారో లేదోనని చూచిన శ్రీకాంత్ నడక ఆపి నిల్చున్నాడు వాళ్ళను కలుసుకోబోతుండగా అంది సంధ్య –' మధూ! ఇవి మనిద్దరమే తిందాం! ఇందులో ఇంకొకరు బాగం పంచుకోవటం నా కిష్టంలేదు' అప్పటికే రెండు స్వీట్లు తినేసింది సంధ్య

ఏమిటోయ్ – స్వీట్లా – అక్కడ కడుపునిండకపోతే ఇంకేమైనా తెప్పించుకునే వాళ్ళంగా!, మధు చేతిలోని ప్యాకెట్‌లోంచి స్వీట్ తీసుకుంటూ అన్నాడు శ్రీకాంత్

'అబ్బే, అదేం కాదు, దోవలో షాపు కనపడ్డది సరదాగా కొన్నాం అంతే – ప్యాకెట్ శ్రీకాంత్ చేతిలో పెడ్తూ అన్నాడు మధు

'సరి - సరి – కొట్లు మూసే టైము కూడా అయింది నువ్వా బట్టలు ఎప్పుడు సెలక్టు చేసుకుంటావో –' అంటూ ఎదురుగా ఉన్న పెద్ద రెడీమేడ్ షాపులోకి దారితీశాడు శ్రీకాంత్

లోపలికి వెళ్ళబోతూ అందులో మిగిలిన పొడిని నోట్లో పోసుకుని ప్యాకెట్ బయట పారేసి చేతులు దులుపుకుంటూ షాపులోకి వెళ్తున్న శ్రీకాంత్‌ని రెప్పవెయ్యటం మర్చిపోయి చూస్తూ నిలబడి పోయింది సంధ్య ఎంత-సేపయిందో తెలియదు

'సంధ్యాగారూ! రండి! మీ మధుకి కావలసిన బట్టలు సెలక్టు చేద్దురుగాని – ' చిలిపిగా అంటున్న శ్రీకాంత్ మాటలకు ఈ లోకంలోకి వచ్చిన సంధ్య దీర్ఘంగా నిట్టూరుస్తూ లోపలి కడుగుపెట్టింది ఆ రాత్రంతా శ్రీకాంత్ దయా ధర్మంగా ఖర్చుపెడ్తున్న డబ్బు, నిరభ్యంతరంగా స్వీకరిస్తున్న మధు ప్రవర్తన అర్థంగాక తలవగిలి పోతుండగా సుర్యోదయాన్ని చూచింది సంధ్య 'గోరంతల్ని కొండంతలు చేసుకోవటం మీ ఆడవాళ్ళనైజం ప్రతిదీ భూతద్దంతో చూచి భయపడటం మీకు అలవాటే – సిల్లీ – రియల్లీ సిల్లీ –' మధు వీడ్కోలు మాటలు డప్పు వాయించినట్టు వినబడుతున్నయి

**(ఇంకా ఉంది)**

# వ్యక్తిగతం



ఐక్యరాజ్యసమితిలో అమెరికా సంయుక్త రాష్ట్రాల రాయబారిగా ఉన్న న్యూయార్క్ మహిళ జేన్ కిర్క్ పాట్రిక్ అమెరికా రాజకీయాలల్లో, పరిపాలనా వ్యవస్థలో సెక్స్ కలాపాలు స్పష్టంగా ఉన్నాయని, నేటికీ కొనసాగుతునే ఉన్నాయని అంటున్నారు. విదేశీ వ్యవహారాలలో మగవారిదే పెత్తనంగా ఉంటున్నదని ఎందరో మహిళలకు అవకాశాలు లేకుండా చేస్తున్నారని ఈమె అభిప్రాయ పడింది. అయితే వైట్ హవుస్ అధికారులు ఇది ఆమె వ్యక్తిగతమైన అభిప్రాయమని, పూర్తిగా వాస్తవంకాదని, అయితే సెక్స్ సంబంధాలు మటుకు కొనసాగుతునే ఉండవచ్చుని చెబుతున్నారు. రాజకీయ శాస్త్రంలో డాక్టరేట్ పుచ్చుకొన్న కిర్క్ పాట్రిక్ కొంత సంయమనాన్ని ప్రదర్శిస్తే మంచిదని వారి అభిప్రాయం....



శ్రీమతి విక్టోరియా గిల్లిక్ ఒక బ్రిటిష్ గృహిణి. ఈమె పది మంది పిల్లలకు తల్లి కూడా! 16 సంవత్సరాలలోపు వయసుగల అమ్మాయిలు గర్భవతులు కావటం ఆరోగ్యానికి, సామాజిక వికాసానికి మంచిది కాదని ఈమె అభిప్రాయం ఈ మేరకు బ్రిటన్ లోని ప్రజారోగ్య శాఖకి,- సాంఘిక రక్షణ విభాగానికి విన్నపాలు కూడ పంపారు సెక్స్ సంబంధాలు ఉన్నప్పటికీ 16 సంవత్సరాలు నిండేవరకు గర్భవతులు కాకుండా డాక్టర్లు సలహాలు ఇవ్వాలని ఈమె కోరారు ఈ కోరిక సబబే అని కోర్టు తీర్మానించి ఈ విషయంలో సహకరించ వలసిందిగా ఆరోగ్య శాఖ వారికి ఆదేశాలు కూడా జారీ చేసింది తల్లిదండ్రులు కూడ పిల్లలకు ఈ అంశంలో సలహాలిస్తే మంచిదని గిల్లిక్ అంటున్నారు

# వారఫలం

**25-1-1985 శుక్రవారం మొదలు**
**31-1-1985 గురువారం వరకు**

★ **మేషం :** వ్యాపారం చేసే వారైనా ముద్రాపకులైనా పత్రికా లేఖన మందు, రంగస్థల చలన చిత్ర రంగస్థలమందు ప్రావీణ్యతగల వారికి అనుకూలవారం అవసరాలకు ధనలబ్ధి ఆశయాలు ఫలించగల సమయం స్త్రీలకు ఉద్యోగమందు ప్రగతి సర్వత్రా ఉత్సాహం స్వల్ప ప్రయాణానికి అవకాశమున్నది

★ **వృషభం** అవసరాలకు దనమందుతుంది అనుకొన్న రీతిగా కార్యానుకూలం, విద్యా విషయంగా పెంపు కొందరకు విదేశ ప్రయాణ ప్రయత్నాలు, రాజకీయంగా మేలు చేకూరటం, స్త్రీలకు సుఖశాంతులు, రాజకీయంగా అనుకూలం, వ్యవహార రీత్యా అత్యుత్తమ వారం, గ్రహించేది

★ **మిధునం :** నూతన మిత్రులను కలిసికోగలుగుట, నూతనాంశాలు గ్రహించటం, శుభ కార్యానుకూలత రాజకీయ రంగాన సుగమంగా సంచరించటానికి వీలు, దూర ప్రాంతాలకు కొందరు పయనించుటా జరుగుతుంది స్త్రీలకు వివిధ రంగాలలో దనలబ్ధి నూతనాంశాలు గ్రహించుటకు అవకాశమున్నది కొందరకు రచనా విధానాన మేలు కల్గుతుంది

★ **కర్కాటకం :** అనుకొనేదొకటి, అయ్యేదొకటి, అని గ్రహింప గల్గుతారు అదీగాక పోగొట్టుకొన్న వస్తువులను సమకూర్చికొనుటకు అవకాశముంటుంది 'కృషితో నాస్తి దుర్భిక్షమ్' అని తెలిసి యత్నించాలి దూర బంధువుల కలిసికో గలుగుతారు స్త్రీలకు అదాయ ముంటుంది గాని, అంతకంత వ్యయం, రాజకీయంగా మీకు మేలున్నది

★ **సింహం .** సభా గౌరవానికి కొందరు, రచనా విధానాన మేలు జరుగుట కొందరకు, విదీవిరామ మెరుగని కార్యాలోచనలు కొందరకు, పనుల అవసరం కొందరకు, రాజకీయ మిత్రులను కలిసికొనుట మరికొందరకు చెప్పదగిన అంశాలు స్త్రీలకు వృత్తి, ఉద్యోగాలందు, ధన సంపాదనమందు మీకు మేలున్నది

★ **కన్య :** గ్రహించండి అనుకోకుండా ఒక పనియందు మీకు అనుకూలత చేకూరుతుంది వ్యవహారం చక్కగా పరిష్కారం కానున్నది శుభ వార్తా శ్రవణం వృత్తియందనుకూలం, రాజ కీయ మిత్రులతో గోష్ఠి సంభవం స్త్రీలకు రాజకీయ వ్యవహారాలందు మేలుంటుంది, ప్రయాణ మూలకానందం చెప్పదగిన ముఖ్యాంశం

★ **తుల .** అవసరాలకు దనం చిక్కటం అనుకొన్న రీతిగా కార్యక్రమాలు సాగిపోవటం భగవత్కైంకర్యానికి ప్రాకులాడటం ఉత్తముల స్నేహం, రాజకీయాలందు చొరవకై ప్రాకులాట నిశ్చయం స్త్రీలకు దూర బందువుల రాక వారికై శ్రమించుట జరుగు తుంది

★ **వృశ్చికం :** గ్రహించండి అవసరాలకు ద్రవ్యం అందుతుంది అనుకోకుండా బంధు మిత్రుల రాక, వాహన సౌకర్యం సమకూడటం పదిమందిలో ప్రతిష్ఠ అబ్బటం సంభవం ఎవరో ఏమో మేలు చేస్తారనుకోవటం న్యాయంగాదు మీరే ప్రాకులాడాలి స్త్రీలకు ధన కనక, వస్తు, వాహన ఉద్యోగ సంపాదనావకాశాలుండ గలవు

★ **ధనుస్సు :** పొరుగూరికి పోవలసిన అగత్యం ఏర్పడుతుంది అయినవారి చెలిమికై ప్రాకులాడుతారు అప్రయత్న ధనాదాయం చేకూరుతుంది మిత్రులకు సాయ పడవలసిన అగత్యం ఏర్పడుతుంది, స్త్రీలకు శుభ కార్యాను కూలత మిత్రులచే ఏదో సహాయం అమరటం గమనించ గలుగుతారు

★ **మకరం :** అదే పనిగా ఒకానొక విషయంలో ప్రాకులాడవలసి వస్తుంది క్షణం తీరిక చిక్కక యిబ్బంది పడవలసిన అగత్య మేర్పడుతుంది రాజకీయంగా అనుకూలత సంభవం దూర ప్రాంతాలకు కొందరు అగత్యంగా ప్రయాణించవలసి వస్తుంది, విలాస వస్తువులు కొనుగోలు చేయ నున్నారు స్త్రీలకు కుటుంబానందం, ఉద్యోగ యత్నాలు సఫలీకృతం కావటం గమనిస్తారు

★ **కుంభం :** రాత్రింబగళ్ళు శ్రమించవలసి వస్తుంది వ్యవహార రీత్యా మేలైన సమయం, వృత్తియందు కొంత సుగుణం కనిపిస్తుంది, అమూల్య వస్తు సేకరణకు అవకాశం రాజకీయ మిత్రులను కలసి కోవటం కూడా జరుగుతుంది స్త్రీలకు కళా రంగాన సదవకాశాలు, ఆదాయం, కార్యానుకూలత చేకూరుతుంది

★ **మీనం :** నిశ్చయంగా ఒకానొక కుటుంబ వ్యవహారంలో మేలుంటుంది రాజకీయ వర్గాన్ని కలసి సంప్రతించుట జరుగుతుంది విద్యా విషయంలో కొంత మేలు కనిపిస్తుంది భూమిగాని, గృహంగాని కొనుగోలు చేయగలరు స్త్రీలకు రాజకీయ రంగాన సదవకాశం, దైవ కార్యాచరణమున కవకాశం సంభవం గ్రహించండి

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

# బహుమతి

శ్రీమతి లక్ష్మీగాయత్రి

వెలుగు నీడల మధ్య జుహూబీచ్ కోలాహలంగా వుంది. సముద్రపు హోరు కంటె జనం కబుర్ల జోరే ఎక్కువగా వున్నట్టు తోచింది విజయేంద్రకి. అతడు బొంబాయి ఎప్పుడు వచ్చినా, సాధారణంగా జుహూబీచ్‌కి వస్తూనే వుంటాడు. సముద్ర తరంగాలు ఎదురుగా వికృత రూపం దాలుస్తున్న నాగరికతని చూసి ఘోష పెడుతున్నట్టు అనిపిస్తూంటుంది అతడికి.

ఎప్పటిలాగే ఒంటరిగా కూర్చుని వున్నాడు విజయేంద్ర. బొంబాయిలో స్నేహితులంటూ ఎవరూ లేరు, పరిచయస్తులు తప్ప. నిరంతరం వ్యాపారంలో మునిగి తేలుతూ వుండే వాళ్ళకి బీచ్‌కి వచ్చి కులాసాగా కాలం గడిపేంత తీరిక వుండదు. కాని విజయేంద్ర మాత్రం వీలున్నప్పుడల్లా వస్తూనే వుంటాడు.

గాలి కాస్త ఎక్కువగానే వుంది. చీకటి పడబోతూంది. ఇసుకలో గీతలు గీస్తున్న విజయేంద్ర వేలికి గరగర మంటూ ఏదో తగలడంతో చేతిని ఇసుకలోకి పోనిచ్చి ఆ వస్తువుని బైటికి లాగాడు. అది ఒక కాగితం ముక్క. చాలాచిన్నది. పావుతావులో సగం వుంటుందేమో మట్టి గొట్టుకుని మురిగ్గావున్న ఆ కాగితం మీద తెలుగులో ఏదో వ్రాసి వుండడంతో కాస్త ఆశ్చర్య పడ్డాడు విజయేంద్ర. కాగితం అంత పాతది కాదు. దాన్ని జాగ్రత్తగా తుడిచి చదవసాగాడు.

అది ఒక ఉత్తరం. కానీ మొదటి నించీలేదు. బహుశా మొదటి భాగం ఇంకెటువైపో ఎగిరి పోయి వుంటుంది. మధ్యనించీ వున్న ఆ ఉత్తరం చివరి భాగం కూడాలేదు. మొదలూ చివరా ఎటో ఎగిరి పోయిన ఆ మధ్య భాగంయిలా సాగింది.

"ఈ మధ్య అక్కడికి వద్దామనుకోవటమే కాని, రావటం పడనేలేదు, కానీ అనుక్షణం నువ్వు నా గుండెల్లోనే మెదులుతూ ఉంటావంటే నమ్ముతావా నువ్వు? కరిగి పోతున్న కాలం నిన్ను పొందలేని లోటుని మరింతగా ఎత్తి చూపిస్తుంటే యీ వేదన భరించటం నాకు అసాధ్య మవుతూంది! ఏ బలహీన క్షణంలో నన్ను నేను మర్చిపోయి నీ దగ్గరకి వచ్చేస్తానో అనిపిస్తూంది. రాహుల్! అసలు నువ్వెప్పుడైనా నాగురించి యింత పిచ్చిగా ఆలోచిస్తావా? ఒకోసారి నాలో ఎంత స్వార్థం ప్రబలుతుందంటే నిన్ను నీకు కాస్త కూడా మిగల్చకుండా పూర్తిగా నా స్వంతం చేసుకోవాలనిపిస్తుంది....."

ఇలా సాగిన వుత్తరం అక్కడితో ఆగిపోయింది. అర్ధాకలితో లేచిపోవాల్సి వచ్చిన అన్నార్తుడిలా విజయేంద్ర మిగిలిన రెండు ముక్కల కోసం వెతికాడు. కానీ ఎక్కడా దొరకలేదు. మధుర స్వప్నం కరిగిపోయినట్టూ, అసంతృప్తితో ఆ ముక్కనే జేబులో పెట్టుకుని హోటల్ చేరుకున్నాడు.

ఇరవై నిమిషాల తరువాత ఐస్‌క్యూబ్స్ వేసిన విస్కీ నెమ్మదిగా గొంతులోకి దిగుతుంటే ఆ వుత్తరం చదవటం మరింత అద్భుతమ్మైన అనుభూతిగా తోచింది విజయేంద్రకి. పూర్తిగా లభించిన ప్రేమగాని క్షణం విడిపోకుండా వుండటం కాని పూర్తి మాధుర్యాన్ని చేకూర్చవు. కొద్దిపాటి విరహం, అందులో మధురవేదన ప్రేమకి మరింత డెప్తని చేకూరుస్తాయి.

కాలింగ్‌బెల్ మోగటంతో కాగితం జేబులో పెట్టుకుని విసుగ్గా తలుపు తీశాడు విజయేంద్ర. ఎదురుగా చిరునవ్వుతో ఖాదర్. అంతకుముందు రోజే ఖాదర్‌తో పరిచయమ్మైంది. ముప్పై ఐదేళ్ళ ఖాదర్ చాలా హుషారుగా వుంటాడు. అతడి మాటల్నీ, మాట్లాడే తీరునీ బట్టి అతణ్ణి బేవకూఫ్ అనుకుంటే అది



చాలా తప్పు చాలా యీజ్‌తో మాట్లాడే ఖాదర్ మాటల వెనుక అతడి సీరియస్‌నెస్‌నీ, అవసరంలో అతడు పంచి యిచ్చే ఆప్యాయతనీ గ్రహించగలిగే శక్తి విజయేంద్రకుంది అందుకే నవ్వుతూ ఆహ్వానించేడు

ఖాదర్‌కి తెలుగురాదు కానీ హిందీ ధారాళంగా మాట్లాడగల విజయేంద్రకి అతడితో లాంగ్వేజ్ ప్రోబ్లమ్ రాదు

ఖాదర్‌కి మరో గ్లాసు అందించేడు విజయేంద్ర తేలిగ్గా అందుకున్నాడు ఖాదర్ కబుర్ల మధ్య కాలం జారిపోతూంది అనుభవించే వయసులోనే అనుభవించాలి విజయ్‌జీ! వాచీ ముళ్ళెప్పుడూ వెనక్కి తిరగవు మనం బలవంతంగా తిప్పలేం తిప్పితే వాచీ పాడైపోతుంది!

ఖాదర్ మాటలు కొంచెం బోరు కొడుతున్నాయి విజయేంద్రకి ఎ సి చల్లదనంలో విస్కీ వెచ్చదనం, ఆ అనుభూతుల మధ్య ప్రేమలేఖ అందిస్తున్న చల్లదనం, నులివెచ్చని ఒంటరితనపు నీడన అందమైన భావాల్ని కలిగిస్తుంటే

అన్య మనస్కంగా ఏవేవో ఆలోచనల లోయల్లోకి జారిపోయాడు విజయేంద్ర

ఖాదర్ నవ్వుతూ అంటున్నాడు -"నాకో స్నేహితుడున్నాడు మీ తెలుగువాడే జీవితాన్ని ఎంత హాయిగా అనుభవిస్తాడని? నిజంగా తుమ్మేదే ఈ విశాల భారతంలో పూలకేం కరువు?

విజయేంద్ర నవ్వి వూరుకున్నాడు అతడి ముఖావాన్ని గమనించి గ్లాసు టీపాయ్‌మీద పెట్టి లేచి నిలబడ్డాడు ఖాదర్ వెళ్ళొస్తాను విజయ్‌జీ! థేంక్స్ ఫర్ ది ఆఫర్ హేపీ నైట్!

* * *

వెళ్ళిన పని అనుకున్న దానికంటే త్వరగా అయిపోవటంతో బొంబేనించి త్వరగానే వచ్చేశాడు విజయేంద్ర




తలుపు తీస్తూనే భర్తని చూసి ఆశ్చర్యపోయింది విమల

చాలా త్వరగా వచ్చేశారే అంది లోపలికి దారి తీస్తూ

ఊఁ నిన్ను చూడాలని తొందర పుట్టి

ఏమిటి, చాలా హుషారుగా వున్నట్టున్నారు ఇది మరీ ఆశ్చర్యం!"

నవ్వేశాడు విజయేంద్ర

ఆ రోజు రాత్రి నిశ్శబ్దంలో విమల తల్లోని విరజాజుల్ని మృదువుగా తాకుతూ అన్నాడు విజయేంద్ర ఈసారి అనుకోకుండా త్వరగా వచ్చేయటంవల్ల నీకేం కొని తీసుకురాలేదు విమలా! కానీ, ఈసారి ఒక వెరైటీ బహుమతి తీసుకొచ్చాను!

'ఏమిటది? కుతూహలంగా అడిగింది విమల

తలగడ కింద నించి కాగితం తీసి విమల కిచ్చాడు విజయేంద్ర మురికిగా వున్న ఆ కాగితాన్ని ఆశ్చర్యంగా తీసుకుంది విమల

జుహూ బీచ్‌లో దొరికిందిది చదివిన మరుక్షణం ఏవేవో లోకాల్లో తేలిపోయాను కానీ అసలైన విషయం కొంచెం ఆలస్యంగా తట్టింది-ఇంత అందమైన ప్రేమ లేఖని ఆ ప్రేమికుడు ఎందుకు చింపేశాడా అని?!

కాగితం చదివి నిరాసక్తంగా మడిచేస్తూ అంది విమల, ఆ అమ్మాయెవరో రాసింది. అతను చింపి పారేశాడు. మధ్యలో మీరా కాగితం ముక్కని పూజించటమేమిటి?

అలా అనకు, విమలా! ఆ ఉత్తరం వ్రాసిన అమ్మాయెవరో చాలా భావుకత్వం గల మనిషై వుండాలి తను వ్రాసిన వుత్తరం అతను చింపేశాడని తెలిస్తే ఆ అమ్మాయి ఎలా తట్టుకుంటుందో నేను వూహించలేక పోతున్నాను! అసలు అతను వుత్తరం ఎందుకు చింపేశాడంటావ్?

అలాంటివన్నీ మీలా ఆలోచిస్తూ బుర్ర పాడు చేసుకునే అలవాటు లేదు నాకు! నిద్ర వస్తోంది, పడుకుంటాను! చేతిలోని కాగితాన్ని వుండగా చుడుతూ అంది విమల

ఆఁ, ఆఁ, ఆ ఉత్తరాన్ని అలా నలపకు ఇలా ఇచ్చెయ్! విమల చేతిలోంచి ఉత్తరం తీసుకున్నాడు విజయేంద్ర విమల అటు తిరిగింది

* * *

కొన్నాళ్ళు గడిచాయి

బార్‌లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ డ్రింక్స్ తీసుకుంటున్నారు విజయేంద్ర, ఖాదర్ "వచ్చిన పని మూడొంతులు అయిపోయింది. నేను బహుశ రేపు తిరిగి బొంబే వెళ్ళిపోవచ్చు విజయ్‌జీ! అన్నాడు ఖాదర్

ఎలా వుంది మా ఆంధ్రా? నచ్చిందా మీకు?'

ఇండియాలో ఏ మూల కెళ్ళినా నాకంతా ఇండియాలాగే కన్పిస్తుంది విజయ్‌జీ! అంచే

నచ్చటం నచ్చక పోవటం అన్న ప్రశ్నే లేదు'

విజయేంద్ర చిరునవ్వు నవ్వాడు

ఖాదర్ కూడా చిలిపిగా నవ్వుతూ, కానీ ఆంధ్రాలో ఒక వ్యక్తిని చూడాలని కోరిక నాకు బహుశా తీరదేమో' అన్నాడు

ఎవరా వ్యక్తి?

ఎవరంటే ఖాదర్ గ్లాసు టేబిల్‌మీద పెట్టి సిగరెట్ వెలిగిస్తూ, బొంబేలో మీ హోటల్‌కి వచ్చినప్పుడు చెప్పాను మీకు గుర్తుందో లేదో నాకో స్నేహితుడున్నాడని, జీవితాన్ని అనుభవించటం వాడికి తెలిసినంతగా మరెవరికీ తెలియదని వాడు చాలా అందంగా వుంటాడు ఒ ్ ర మగవాళ్ళలో అంతటి అందం అరుదుగా వుంటుందేమో వాణ్ణి చూసినప్పుడల్లా ఆస్కార్‌వైల్డ్ డొరియన్ గ్రే- గుర్తొస్తారు నాకు డొరియన్ గ్రే అందం, హెన్రీ వాటన్ తత్వం కలిసిన వాడు వీడు

వాణ్ణి చూసిన ఏ అమ్మాయి చలించకుండా ఉండలేదేమో చలించిన ఏ అమ్మాయినీ వీడు విడిచి పెట్టను కూడా లేదు కొంతమంది అమ్మాయిలు వాడికి వుత్తరాలు కూడా వ్రాస్తుంటారు చాలావరకూ ఆ వుత్తరాలన్నీ నాన్సెన్సికల్ అనుకోండి కానీ ఖాదర్ క్షణం ఆగి, ఆంధ్రా నించి మాత్రం ఒకమ్మాయి వ్రాస్తుంటుంది ఉత్తరాలు చాలా బావుంటాయి వాడు కూడా అప్పుడప్పుడు చాలా సిన్సియర్‌గా రియాక్ట్ అవుతుంటాడు కానీ ఈమధ్య ఎంచేతో అంత వెర్రిగా వుత్తరాలు రాసే ఆ అమ్మాయి వుత్తరాలు వ్రాయటం తగ్గించింది అంతేకాదు విమలకి ఏనాడో పెళ్ళి పోయిందని తెలిసింది ఖాదర్ క్షణం ఆగి నవ్వుతూ, ఆ అమ్మాయిని, విమలని చూడాలని అన్నాడు

ఆ నవ్వులో కనిపిస్తున్న తేలికభావం, వింత

# బహుమతి

వస్తువుని చూడాలన్న కుతూహలం విజయేంద్ర క్షణంలో తేరుకుంటూ, మీ స్నేహితుడి పేరేమిటన్నారు? అన్నాడు

రాహుల్

*   *   *

'రాత్రి చాలా నిశ్శబ్దంగా వుంది

ప్రక్కనే వున్న భర్త నిశ్శబ్దాన్ని ఎలా అర్థం చేసుకోవాలో తెలీక విమల తికమక పడుతుంది పెళ్ళైన ఈ మూడేళ్ళలో అతడెప్పుడూ మౌనంగా లేడు ఇలాంటి సందర్భాల్లో ముఖ్యంగా

ఈలోగా అతడే కదిలేడు ఏమిటలా చూస్తున్నావ్? అన్నాడు నవ్వుతూ

విమల తేలిగ్గా వూపిరి పీల్చుకుంటూ, ఇంతసేపూ మాట్లాడకుండా పడుకున్నది కాక నన్నంటున్నారా? అంది నవ్వుతూ, కవ్విస్తున్నట్టూ

విజయేంద్ర మామూలుగా, ఇవేళ సాయంత్రం నాకో విషయం తెలిసింది దాన్ని గురించి ఆలోచిస్తున్నాను' అన్నాడు

విమల దాన్ని అంత సీరియస్‌గా తీసుకోకుండా ఏమిటది? అంది

అతడు డైరెక్ట్‌గా రంగంలోకి దిగుతూ ఇదే వూరినుంచి విమల అనే ఒకమ్మాయి బొంబేలో రాహుల్ అనే ఒక అందమైన అబ్బాయికి వుత్తరాలు రాస్తున్నట్టు తెలిసింది ఆ విమల ఎవరా అని ఆలోచిస్తున్నాను' అన్నాడు

ఏ భావమూ ధ్వనించని కంఠంతో అతడు చెప్పిన విషయంలోని తీవ్రతని అర్థం చేసుకోవటానికి ఆమెకి కొన్ని క్షణాలు పట్టింది

అర్థమైన తరువాత మాట్లాడటానికి నోరు సహకరించలేదు చలన రహితంగా వున్న ఆమెని తాకుతూ ఏమిటలా అయిపోయేవ్? అన్నాడు విజయేంద్ర

## పైసా!

రాయలేలిన
రాముని
రాజ్యమైనా...
నిజానికి
ఇది
రాకెట్ యుగమైనా...
పాకెట్‌లో
పైసా లేనిదే
మనిషికి లేదు
మార్కెట్‌లో
మంచి-మర్యాద!

—ఎస్. మొగులయ్య సాగర్

విమల ఒక్కసారిగా చలనం వచ్చినట్టు కదులుతూ ఏవండీ అంది ఇంకేం మాట్లాడలేనట్టు కాటుక దిద్దిన కళ్ళలో నీళ్ళు నెమ్మదిగా చెంపల మీదికి జారుతున్నాయి

విజయేంద్ర నవ్వుతూ, నువ్వే ఆ విమలవైతే నేనేమీ అనుకోను నేను ఒథెల్లోని నువ్వు డెస్డిమోనావి కద కొంచెం మారిందనుకుంటాను అంతే' చెప్పు నీకు నన్ను వదిలేసి వెళ్ళిపోవాలనుందా? అన్నాడు

ఒక్కసారిగా గట్టు తెగింది విమల చేతుల్లో ముఖం దాచుకుని ఏడుస్తూ నేను తప్పే చేశాను చాలా తప్పు చేశాను నన్నిలా శిక్షించవలసిందే' కానీ ఒక్క పని మాత్రం నేను చెయ్యలేదండీ-రాహుల్‌ని నేను ప్రేమించలేదు మిమ్మల్నే నా ప్రాణానికి ప్రాణంగా ప్రేమిస్తున్నానని మీరు బొంబే వెళ్ళొచ్చాక బాగా తెలిసింది రాహుల్ మీద భ్రమని తొలగించుకోగలను కానీ మీ మీది ప్రేమని చంపుకోలేనండీ చంపుకోలేను' అంది

విజయేంద్ర ఆమెను దగ్గరగా తీసుకుంటూ, పిచ్చి విమ్మీ ఆఫ్టాల్ వుయార్ హ్యూమన్ బీయింగ్స్ వూరుకో' అన్నాడు

విమల ఏడుస్తూ తల్లి రెక్కల మాటున ఒదిగిన పక్షిపిల్లలా ఒదిగి పోయింది

కానీ, విమ్మీ' భార్య ఎవరికో రాసిన ప్రేమలేఖని భర్త ఆ భార్యకే బహుమతిగా తెచ్చి యివ్వటం చిత్రం కదూ? ఎంత మామూలుగా అనాలనుకున్నా అతడి గొంతు వణికింది

నల్లగా, స్ఫోటకం మచ్చలతో గుంటలు పడ్డ అతడి చెంపల మీదికి ఒక్క కన్నీటి చుక్క జారింది

అతడు ఒథెల్లో-ఆమె డెస్డిమోనా ఐనా కద సుఖాంతమైంది ☐






## ఆర్ – సాగర్

నా వయస్సు 18 సం లు ఇంతకు ముందు బియ్యం తినేదాన్ని అప్పుడూ వైట్ డిస్చార్జి అవుతూ ఉండేది ఇప్పుడు తినక పోయినా బాగా డిస్చార్జి అవుతున్నది బియ్యం తినటానికీ దీనికి సంబంధం ఉందా?

★ బియ్యం తినటానికీ వైట్ డిశ్చార్జికీ సంబంధం లేదు యుక్త వయస్సు వచ్చిన కొత్తలో డిశ్చార్జి రావటం కొంతవరకు సహజమే! మరీ అధికంగా ఉంటే లేడీ డాక్టర్లకి చూపించి డిశ్చార్జిని మైక్రోస్కోప్‌లో పరీక్షింప చేయవలసి ఉంటుంది అప్పుడు జరిగిన రోగ నిర్ణయం ప్రకారం చికిత్స చేయవలసి ఉంటుంది

## బి. ఎస్ – పెదకాకాని

మా అమ్మాయికి 7 సం లు అప్పుడప్పుడూ ముక్కునుంచి రక్తం కారుతుంది ఏమైనా ప్రమాదమా?

★ ముక్కునుంచి రక్తం కారటానికి చాలా కారణాలు ఉన్నాయి ఈ కారణాలను ఆంధ్రపత్రిక దినపత్రికలో అక్టోబరు నెలలో (సోమవారాలు) వివరించటం జరిగింది చిన్న పిల్లలలో దీనివల్ల ప్రమాదమేమీ లేదు ఇ ఎన్ టి వైద్యులకి చూపించి ఏమైనా లోపాలున్నాయేమో చూపించుకొంటే మంచిది

కొకైన్ సొల్యూషన్‌తో తడిపిన దూదిని ముక్కులో దూర్చటం ద్వారా రక్తస్రావాన్ని ఆపవచ్చును

## ఎస్. వి. వి – కర్నూలు

నా వయస్సు 25 సం లు నేను గర్భిణీగా ఉన్నప్పుడు పొత్తి కడుపుపై గీరటంవల్ల వాతలు పడ్డట్లు చర్మము కమిలి ముడుతలు పడ్డట్లు అసహ్యంగా కనబడుతున్నది దీనిని ఏదైనా ట్రీట్‌మెంటు ఉన్నదా?

★ గర్భిణీలుగా ఉన్నప్పుడు దురదవల్ల పొట్ట బాగాన్ని గీరటానికి ముడతలు ఏర్పడటానికీ, తెల్లని చారలు ఏర్పడటానికీ సంబంధం లేదు దీనికి చికిత్స అనవసరం

## జి. ఎస్. – భీమవరం

**నాకు చాలా కాలం నుండి వూరికే వికారముగానూ, వాంతి వచ్చేట్లు వుంటోంది చాలా నీరసంగా వుంటుంది ఎప్పుడూ అసహనంగా వుంటుంది చీటికి, మాటికి ఉద్వేగం వస్తున్నది. దీనికి మీ సలహా ఏమిటి?**

**★ కడుపు భాగాన్ని పరీక్షింప చేసుకొని ఏమీ లేదని ముందుగా నిర్ణయింప జేసుకోవటం అవసరం.**

**మీరు సైకియాట్రిస్టుల సలహా కూడా పొందటం అవసరం**

**వికారం తగ్గటానికి ఎమిడాక్సిన్ వంటి మందులు బాగా పని చేస్తాయి** 



(గత సంచిక తరువాయి)

కాలేజి నుండి బైటికి వచ్చి కొద్ది దూరం నడిచాక ఏమండీ అన్న పిలుపు వినిపించి వెనక్కి తిరిగి చూసింది అనిత దగ్గర్లో మనుషు లెవరూ లేరు అక్కడినుండి వెళ్ళబోతుంటే ప్రక్కనే కారు వచ్చి ఆగింది

నేనే పిలిచాను కారులో నుండి చూస్తూ అన్నాడు విజయ్ అనిత వాళ్ళింటికి వెళ్ళి వచ్చాక ఆమెను చూడడం అదే మొదలు అతడికి అప్పటికి అతడు వాళ్ళింటికి వెళ్ళి పది రోజు లయింది

ఏమిటింత ఆలస్యంగా వెళుతున్నారు? అడిగాడు

కాలేజీలో మీటింగ్ వుందింతవరకు' అని మీ రిటువైపు వచ్చారేమిటి? అడిగింది అనిత

పనిమీద స్నేహితుడింటికి వెళ్ళి వస్తున్నాను. మీరు కనిపించారు రండి మిమ్మల్ని మీ ఇంటి దగ్గర దింపుతాను అంటూ అతడు కారు డోర్ తెరవబోతుంటే డోర్‌మీద చెయ్యి వేసి మీరు వెళ్ళండి నేను బస్సులో వెళతాను అంది అనిత

ఏం, నా కారెక్కకూడదనుకున్నారా?

అదేం లేదండి

మరింకేం? రండి నా కారు అరిగిపోదు పెట్రోలు ఖర్చు అనుకుంటే డబ్బు లివ్వండి నవ్వుతూ డోర్ తీశాడు విజయ్

అనిత ఎక్కి కూర్చోగానే 'ముందుగా మా ఇంటికి తీసుకెళతాను ఏమంటారు? అన్నాడు

మరోసారెప్పుడైనా వస్తాను లెండి అనిత వద్దన్నట్లుగా అంది

మరోసారి అడిగినా మీరు చెప్పే మాట ఇదే ఈ రోజే రండి అంటూ ఆమె జవాబు కోసం చూడకుండా కారును తన ఇంటివేపు పోనిచ్చాడు విజయ్

విజయ్ ఇల్లు ఆ వీధిలోకి వెళ్ళగానే చూపరుల నిట్టే ఆకర్షించే భవనం రంగులతో అట్టహాసంగా కనిపిస్తుంది ఇంటి ముందు రక రకాల పూల మొక్కలు ఇంట్లో ఖరీదైన కార్పెట్స్ ఫర్నిచర్ సామాను అడుగడుగునా లక్ష్మి తాండవిస్తోందనిపిస్తుంది

ఆ ఇంట్లో విజయ్‌ను చూస్తుంటే శ్రీనిలయానికి అతడో ప్రత్యేక అలంకరణ అనిపించింది అనితకు

కన్నెపిల్లలు కలలుగనే పురుషమూర్తి రూపం విజయ్‌ది

డబ్బులో పుట్టి డబ్బులో పెరిగిన అతడిలో లేశమైనా అహం కనిపించదు

**జరిగిన కథ-2 :** అనితకు ఆ రోజు శుభప్రదమైన రోజు. గత స్మృతులు ఆమెను నిలువ నీయడంలేదు. భర్త విజయ్‌కు దూరమైన అనితకు అతని జ్ఞాపకాలు వెంటాడుతున్నాయి. విజయ్ కోసం ఎదురు చూస్తున్న అనితకు రమేష్ రాక నిరాశ కలిగించింది. 'ప్రముఖ రచయిత్రి అనితాదేవి అసలు రూపం' అంటూ ఎవరో పేపర్లో వేయిస్తే ఆ పని విజయ్ [illegible] అతడిని నిలదీసి అడుగుతుంది అనిత. విజయ్‌ను తనకు మొదట పరిచయమైన అనిత గుర్తుకు వస్తుంది. అనిత ఆహ్వానంపై ఆమె ఇంటికి వెళ్ళిన విజయ్‌కు ఆమెకు పదహారవ ఏటనే వివాహ మయిందని, ఆమె భర్త పెళ్ళయిన రెండు నెలలకే చనిపోయాడని ఆమె తండ్రి ప్రసాద్‌రావు చెప్పాడు.

అదే అతడి వ్యక్తిత్వానికి వన్నెతెచ్చింది.

విజయ్ తల్లిదండ్రులు మూడు నాలుగేళ్ళ క్రిందటే పోయారు.

"బంధవు లున్నారు కాని వాళ్ళకు నామీద కన్నా నా డబ్బుమీదే ప్రేమ ఎక్కువ. అందుకే నేను వాళ్ళను దగ్గరికి చేరనివ్వలేదు...." విజయ్ తన గురించి చెబుతూ అన్నాడు.

"బంధువులను చేరనివ్వలేదు సరే, బంధాన్ని వేసుకోవచ్చుగా" అంది అనిత.

"నేనూ అదే ఆలోచిస్తున్నాను. ఆ బంధం వేసుకుంటే విడిపోయేది కాదుగా. జాగ్రత్తగా ఆలోచించాలి."

అనితకు విజయ్ ఇంటికి వెళ్ళి వచ్చాక అతడితో అనుబంధం పెరిగినట్లనిపించింది ఆ తర్వాత నాలుగు రోజులకు అతడు అదే పనిగా ఇంటికి రావడంతో అతడు తమతో స్నేహాన్ని పెంచుకోవాలనుకుంటున్నాడని గ్రహించింది ఆ రోజు ప్రసాదరావును వాళ్ళింటికి రమ్మని మరీ మరీ చెప్పి వెళ్ళాడు

ఏమిటి ఇతడు మనకు అనుకోకుండా చేరువౌతున్నాడు? అతడు వెళ్ళాక తండ్రితో ఆశ్చర్యంగా అంది అనిత

కొందరు వ్యక్తులు అంతేనమ్మా చూడగానే పరిచయమై సన్నిహితమౌతారు మరికొందరు ఎంత ప్రయత్నిచినా దగ్గర కారు అన్నాడు ప్రసాదరావు

*　　*　　*　　*　　*

అనిత స్నేహితులతో కలిసి కాలేజి వదలగానే షాపింగ్‌కు వెళ్ళి ఇంటికి వస్తుండగా విజయ్ కనిపించాడు

వారిద్దరు అప్పుడప్పుడు రోడ్డుమీద కలుసుకోడం జరుగుతూనే వుంది అప్పుడతడు ఇంటికి తీసుకెళ్ళకుండా మానడు

ఆ రోజు ఆమెతో ఆమె స్నేహితులుంటే తన ద్రోవన తను వెళ్ళేవాడే వాళ్ళు వాళ్ళ ఇళ్ళకు వెళ్ళిపోయారు

అతడు ఆమెను చూడగానే పలకరించి కారెక్కమన్నాడు అనిత కాదనలేదు కాదన్నా అతడు ఒప్పుకోడని తెలుసు

మీరు కనిపించినప్పుడల్లా నేను మీ ఇంటికి రావడం అవుతోంది అంది అనిత ఇంట్లోకి వస్తూ

కాదు మీరు కనిపించినపుడు నేను పిలుచుకు రావడం జరుగుతోంది ఆమె పొరపాటును సరిచేస్తున్నట్లుగా అన్నాడు విజయ్

మీతో పరిచయం అయ్యాక కొత్త ప్రపంచం చూస్తున్నట్లుగా వుంది మీతో మాట్లాడడం అంటే రొటీన్ నుండి బైట పడ్డట్లే ఇంతవరకు ఎవరు మాట్లాడినా, నా బిజినెస్ గురించి నేను చెయ్యబోయే పనుల గురించి కాకపోతే పార్టీల గురించి అఫ్‌కోర్స్, నేను పుట్టి పెరిగిన వాతావరణం అదే ననుకోండి అయినా నా కది ఇష్టం లేదు నా స్థితికి తగ్గట్టుగా మాట్లాడాలన్న ప్రయత్నమే కాని ఆత్మీయత కనిపించదు వారి మాటల్లో పెదవులు తప్ప మనసు నవ్వలేని మాటలు ఆర్భాటమే తప్ప అభిమానంలేని మర్యాదలు మీ మాటలు అలా కాదు మనిషిగా లోకాన్ని చూడమంటాయి ఆలోచనను పెంచుతాయి మీ వ్రాతలు లాగే మాటలూ అమృత ధారలు అందుకే మీ సాన్నిధ్యాన్ని అభిలషిస్తాను వీలైనప్పుడల్లా మీతో గడపాలని ప్రయత్నిస్తాను

కాని అది మీ భవిష్యత్తులో విష బిందువు చిలికిస్తే

ఎలా?

స్త్రీ పురుషుల స్నేహాన్ని స్నేహంగానే అనుకోదు మన సమాజం

మనలో తప్పు లేనప్పుడు మనం ఎవరికీ బయపడనక్కర్లేదు నే నెవరి మాటలు లెక్క పెట్టను మీకేమైనా అభ్యంతరం వుంటే చెప్పండి అన్నాడు విజయ్

అభ్యంతరం లేదు కాని ఆలోచించాల్సిన విషయం అనుకుంటున్నాను నేను లెక్చరర్ని నా ప్రవర్తన విద్యార్థులమీద ప్రభావం చూపిస్తుంది తప్పు



చెయ్యకున్నా చేశామన్న అనుమానం గూడా కలిగించగూడదు

ఆల్‌రైట్ మీ అభిప్రాయం చెప్పారు విజయ్ ముఖంలో రంగులు మారడం చూసి మిమ్మల్ని బాదపెట్టానేమో అంది అనిత

"లేదు మీరన్నది నిజమే మీరు రేపటి పౌరులకు ఆదర్శం కావాలే కాని అధఃపాతాళానికి పొయ్యేలా చెయ్యగూడదు

కృతజ్ఞతగా చూసింది అనిత

మీరు అభిమానంకోసం ఆత్మీయత కోసం అర్రులు చాచక్కర్లేదు మీకు నచ్చిన అమ్మాయిని చూసి పెండ్లి చేసుకోండి తన మనిషిగా మిమ్మల్ని అభిమానిస్తుందామె

'మీరిదివరకు గూడా చెప్పారా మాట మెల్లగా నవ్వి మీకు తొందరలో నే ఆ విషయం గురించి చెబుతాను అన్నాడు విజయ్

# పసిడిబొమ్మలు

'అతడేదో సంబంధం చూసి వుంటాడు' అనుకుంది కాని అతడు తననే చేసుకోవాలనుకున్నాడని తెలుసుకోలేదు అనిత

*　　　*　　　*　　　*　　　*

విజయ్ నిద్ర లేచి అలవాటుగా కాలింగ్ బెల్ నొక్కగానే నాయర్ కాఫీ తీసుకొచ్చాడు

కాఫీ తాగి ముఖం కడుక్కొనే ప్రయత్నంలో వుండగా ఫోన్ మ్రోగింది

విజయ్ వెళ్ళి ఫోన్ ఎత్తాడు హలో అనితను మాట్లాడుతున్నానండి

అనితా ఆందోళనగా అన్నాడు

బయపడకండి నవ్వింది అనిత ఈరోజు ఆదివారంగదా మీ రెక్కడికైనా ప్రోగ్రామ్ వేసుకున్నారేమోనని ఫోన్ చేస్తున్నాను

ఏమిటి విశేషం?

మీతో కొంచెం పని వుంది మీ ఇంటికి వస్తాను మీరెక్కడికైనా వెళతున్నారా?

నేనిప్పుడే నిద్ర లేచాను ఇంకో గంట వరకు ఎక్కడికీ వెళ్ళను

ఇప్పుడు నిద్ర లేచారా? ఆశ్చర్యంగా అంది అనిత ఎనిమిది గంటలు దాటిందప్పుడు

ఆదివారం కదండీ ఎప్పుడు లేస్తే ఏమిటని ఇప్పుడు లేచాను

మంచి పని చేశారు నవ్విన ఆమె నవ్వు అతడ్ని పులకింపచేసింది

ఆమెకు తెలియకుండానే ఆమె తనకు దగ్గరయింది అదే ఆమెనలా చనువుగా మాట్లాడేట్లు చేసింది

నేనో అర గంటలో వస్తాను అంది అనిత

అనితా మెల్లగా అన్నాడు మీరు వస్తాననడం ఆశ్చర్యంగా వుంది అతడి గొంతులో అల్లరితనం

ఎందుకు?

మీరిక నాతో మాట్లాడరనే అనుకున్నాను

విజయ్ బాధగా అంది

మీమీద' నాకు కోపం లేదు ద్వేషం లేదు స్నేహితుడిగా మిమ్మల్ని అబిమానిస్తాను కాని ఆ అభిమానం అవమానానికి దారి తీసేదిగా వుండగూడదని నా వుద్దేశ్యం

అరె ఇంతలోనే అంత బాద పడుతున్నారు మీరేమంటారోనని అలా అన్నాను కాని మీ మనసు నాకు తెలియదా క్షణమాగి ఇంతకు మీ రెక్కడి నుండి ఫోన్ చేస్తున్నారు? అడిగాడు

మా ఇంటి ప్రక్కనున్న ఇంజనీరుగారింట్లో నుండి ఇప్పుడు మీ ఇంటికి వస్తున్నానుగా. ఫోన్ పెట్టేస్తాను."

"ఒ. కె." ఫోన్ పెట్టేసి తొందర తొందరగా పనులు ముగించుకున్నాడు విజయ్

అనిత వస్తోందంటే మహా సంతోషంగా వుందతడికి

నాయర్‌కు విందు బోజనం చెయ్యమని చెప్పాడు

స్నానం చేసి తెల్లటి పైజమా లాల్చీ దరించాడు అతడ్ని చూస్తే ఆ రోజేదో విశేషం వుందనిపిస్తుంది

మామూలుగా అయితే అతడా సమయంలో గుడికి వెళతాడు ఆదివారం అతడు తప్పకుండా చేసే పని అది టిపిన్ గూడా గుడినుండి వచ్చాకే తినడం

నా కోసమే చూస్తున్నారా? అనిత రాగానే హాల్లో గుమ్మం దగ్గర వున్న విజయ్‌ను చూసి అంది

అర గంటలో వస్తానన్నారు గంట టైం తీసుకున్నారు ఇండియన్ ఫంక్చుయాలిటీనా? గడియారం వంక చూసి అన్నాడు

కాదు మీరు అప్పుడే నిద్ర లేచానన్నారు మీ పనులు ముగించుకొని వుంటారో లేదోనని ఆలస్యం చేశాను

పావుగంటలో నే నా పనులన్నీ అయిపోయాయి

మీరిప్పుడెక్కడికైనా వెళ్ళాలా? అంది అనిత లోపలికి వస్తూ

ఆదివారం గుడికి వెళ్ళే అలవాటు వుంది అక్కడికి వెళ్ళాకే మరెక్కడికైనా వెళ్ళడం '

అయితే పదండి వెళదాం' ఆగి అంది అనిత

మీలో చాలా మార్పు కనిపిస్తోందీరోజు

మార్పేముంది?

లోకం గురించి ఆలోచించక పోవడం

'మీతో వస్తానన్నానని అలా అంటున్నారా? అతడి వైపు చూసింది

అతడు పలకలేదు

నేనో ముఖ్యమైన పనిమీద వచ్చాను

అందుకని లోకం మనల్ని తప్పు పట్టదంటారు

విజయ్. మీ కెలా చెప్పాలో తెలియడం లేదు

నేనీ రోజు మీతో ఆ విషయమే మాట్లాడాలనుకున్నాను మీరే వచ్చారు

ఏ విషయం గురించి మాట్లాడతారు? అర్థం కాని దానిలా చూసింది

మన బంధం అదే మన స్నేహం గురించి

ఏం మాట్లాడతారు? అచ్చెరువుగా చూసింది

చాలా మాట్లాడాలి

మాట్లాడండి అంది అనిత

లేదండి నేను సెంటిమెంటల్ ఫూల్‌ని ఆదివారం గుడికి వెళ్ళొచ్చాక కాని ఎక్కడికీ వెళ్ళను ముఖ్యమైన విషయాలు మాట్లాడను

బాగుంది నవ్వింది అనిత

మీరేదో పనిమీద వచ్చానన్నారు

గుడికి వెళుతూ మాట్లాడుకుందాము మీరు అక్కడికి వెళ్ళనిదే ఎక్కడికీ వెళ్ళనన్నారుగా అంది అనిత వెలుపలికి వస్తూ

అయితే నన్ను ఎక్కడికో తీసుకెళ్ళేందుకు వచ్చారన్నమాట

ఎక్కడికో కాదు మీ స్నేహితుల దగ్గరికే అని కారెక్కాక నేను నాలుగు రోజుల క్రిందట చక్రపురం వెళ్ళాను చెప్పడం మొదలు పెట్టింది అనిత

*　　　*　　　*　　　*　　　*

అనిత కాలేజి విద్యార్థులను కొందర్ని తీసుకొని సేవా కార్యక్రమాలు నిర్వహించేందుకోసం చక్రపురం వెళ్ళింది

చక్రపురం ఆమెకు అపరిచితమైన ఊరుకాదు అమ్మమ్మ తాతల ఊరు చిన్నప్పుడు తరుచుగా వెళుతుండేది తల్లి చనిపోయిన కొద్ది రోజులకే అమ్మమ్మ, తాత గూడా చనిపోవడంవల్ల ఆ ఊరితో సంబంచం తెగిపోయింది



# అందుకు కావలసిందల్లా, నిశ్చింతగా ఉండే మనసు, నియమితమైన ఆహారం!

అవును, పాపకు స్తన్యపానం చేయించడానికి యోగ్యంగా అవడానికోసం కావల్సింది సూటిగా చెప్పాలంటే అది. వీలైనంత వరకు ప్రశాంతమైన మనస్సుతో ఉండండి. మరి మీరు తీసుకునే ఆహారంలో ఎటువంటి పదార్థాలుండాలంటే, దాంతో మీ శరీరంలో, పాపకోసం ఎక్కువగా పాలు పడేలా ఉండాలి.

**చిఫి-చింతా రెండు ఒక్కటే**

చింత అన్నది మీకే కాదు, మీ పాపకి కూడా హానికరం కావచ్చు. చింతించడం వలన మీలో ఉదాసీనత, ఆవేదన, అస్వస్థతగా ఉండనిపించడం—అంతేకాదు మీలోని పాలు ఎండిపోవచ్చు

మీకే గనక ఆరోగ్య విషయంలో ఏదైనా సమస్య గనక వుంటే, దిగులుపడి చలికిలబడి పోవద్దు కొంచెం ధైర్యంగా మెలగండి మీ డాక్టరు దగ్గరికి వెళ్ళి మీ సమస్య ఏమిటో చెప్పండి ఆయన మీ సమస్యని తప్పకుండా అర్థం చేసుకుంటారు ఎందువల్లనంటే ఆయన మీ డాక్టరు గనక—ఆయనపైన పూర్తిగా నమ్మకాన్ని ఉంచవచ్చును.

**పుష్టికరమైన ఆహారాన్ని తీసుకోవడం మొదలెట్టండి**

పుష్టికరమైన ఆహారాన్ని గూర్చి తెలుసుకోవడానికి గ్రంథాలేవీ చదవనూ అక్కర్లేదు కేలరీ చార్టులు చూడనూ అక్కర్లేదు మీ పాపయొక్క వృద్ధి వికాసాల కోసం ఎక్కువగా ప్రోటీన్లు కావాలనుకుందాం. ప్రోటీన్లు శరీర నిర్మాణం చేసే ద్రవ్యం, అవి పాలు, కోడిగ్రుడ్లు, మాంసం వీటిలో వుంటాయి. మరైతే మీరు ప్రోటీన్లు సమృద్ధిగా వున్న పదార్థాలను తినాలి మీకు అటువంటి పదార్థాలలో ఎంత ఎక్కువలో ప్రోటీన్లు లభిస్తే, మీ పాపకు మీ పాలలోంచి అంత ఎక్కువగా ప్రోటీన్లు లభ్యమవుతాయి మరి ఒక్క విషయం గుర్తుంచుకోండి మీ ఆహారంలో కార్బోహైడ్రేట్లు అవసరమైన దాని కన్న ఎక్కువగా ఉండకూడదు. ఎందుకంటే అందువల్ల మీ పాల యొక్క ప్రమాణంపై దాని గుణాలపైనా దుష్ప్రభావం పడవచ్చు. ఆ రకమైన జాగ్రత్త, అటువంటి తిన్నదైన, సూటియైన ఉపాయాలు మీ పాపకు సరియైన ప్రకారంగా స్తన్యపానం చేయించడానికి సహాయకరంగా ఉంటాయి.

అయితే దైవవశాత్తు మీ ఆరోగ్యం విషయంలో పెద్ద సమస్య గనక వస్తే, అటువంటి పరిస్థితిలో చాలా బాగా ఆలోచించి, మీ పాపకు ఎటువంటి ఆహారం యివ్వాలంటే మరి తల్లిపాల తర్వాత అన్నిటికన్న ఉత్తమంగా ఎంచబడుతూన్న దాన్ని

**స్ప్రే డ్రయిడ్ అమూల్ స్ప్రే**

అమూల్‌స్ప్రే. పుష్టినిచ్చే దృష్టితో చూస్తే మహత్తరంగా సంతులితమైన ఆహారం ఎందుకంటే దీన్లో చాలా ఎక్కువైన తీరులో ప్రోటీన్లు, దాంతోబాటే, తేలికగా అరగగలిగే కార్బోహైడ్రేట్లు, సరియైన సంతులిత రూపంలో ఆత్యావశ్యమైన విటమిన్లూ, ఖనిజ పదార్థాలు ఉన్నాయి ఇది అంతకు ముందే మరగబెట్టిన నీటిలో టక్కున కరిగిపోతుంది మొదటిగానే పేస్టులా తయారు చేయవలసిన అవసరం ఉండదు

**పొదుపు**

అమూల్‌స్ప్రే డబ్బాలలో దొరికే శిశుఆహారాలన్నిటికన్న పొదుపైనది. ఎందుకంటే యిది ఆధునికమైన పాల సంఘం యొక్క ఉత్పాదన— "శ్వేత విప్లవం" తీసుకురావడంలో అందరికన్న ముందడుగు వేసారు

**జాగ్రత్త పడటం**

పాప ఆహారానికి ఉపయోగించే అన్ని వస్తువుల్నీ, సీసాని, ఎప్పుడూ ఆరోగ్యరీత్యా బాగా శుభ్రంగా కడిగి నీటిలో మరగబెట్టాలి పాప ఆహారాన్ని తయారు చేయడానికి కూడా మరిగిన నీటినే వాడండి. పాప సరియైన పోషణకోసం, డబ్బాపైన యివ్వబడిన అమూల్‌స్ప్రే మోతాదుల ప్రకారమే ఉచితంగా పాప ఆహారాన్ని తయారు చెయ్యండి

**ఉచితం! అమూల్ బేబీ పుస్తకంలో**

ఉపయోగకరమైన విషయాలు యీ అధ్యాయాల్లో ఉన్నాయి అవి గర్భధారణ, ప్రసవానికి ముందర జాగ్రత్త, ప్రసవము, తల్లిపాలు, ఇతర ఆహారములు, మిశ్రమ ఆహారమును అలవాటు చేయుట, పిల్లవాని దినచర్య, పిల్లవాని అభివృద్ధి, జబ్బులను అరికట్టుట, ప్రథమ చికిత్స, సాధారణ రోగములు, జబ్బుతోనున్న పిల్లవాని సంరక్షణ, జ్ఞాపకముంచుకోవలసిన విషయములు ఈ పుస్తకం తెలుగు, ఇంగ్లీషు, హిందీ, తమిళం, మలయాళం, మరాఠీ, గుజరాతీ, బెంగాలీ భాషల్లో దొరుకుతుంది దానికోసం పోస్టు బాక్స్ 10124, బొంబాయి 400 001 అడ్రసుకు మీ పేరూ, పూర్తి అడ్రసు యిస్తూ రూ 1 25 స్టాంపుల్ని జతపర్చండి




# అమూల్‌స్ప్రే

తల్లిపాల తరవాతనే ఇది

అమ్మకం చేయించువారు
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్, పోస్టు బాక్స్ 10, ఆనంద్ 388 001, గుజరాత్



ASP/AS TEL7/83

## పసిడిబొమ్మలు

మళ్ళీ వుద్యోగం అప్పగించిన బాధ్యత అక్కడికి వెళ్ళేట్లు చేసింది

విజయ్ నాకీ ప్రయాణం ఎన్నో కొత్త విషయాలు చెప్పింది పల్లెటూర్లలో ఎంత అమాయకంగా అజ్ఞానంగా వున్నారో వినడం కాకుండా స్వయంగా చూసి తెలుసుకున్నాను బుద్ధి తెలిశాక అటువైపు పోవడం వల్లేమో ఆమెకు పల్లె ప్రజల గురించేం తెలియదు

ఆ ఊర్లో వాళ్ళ మాటలకు, ప్రశ్నలకు కొన్నిచోట్ల కొయ్యబారి'పోయింది

చదువు, పరిశుభ్రత, కుటుంబ పరిమితి మీద వాళ్ళ అభిప్రాయాలు వింటుంటే 'వీళ్ళే లోకంలో వున్నారు?' అనిపించింది

చదివి చేసేదేముంది? ఇంట్లో ఊళ్ళట్టుకు తిరగడమేగా అందరు తిరిగితే బువ్వెట్లా వస్తాది తమలాంటి నిరక్షరాస్యులు అవసరం అన్నట్లుగా మాట్లాడారు కొందరు వాళ్ళు పట్నాలలో వుండే వాళ్ళే పెద్ద చదువులు చదవాలనుకుంటున్నారు

సుబ్బరం సుబ్బరం అంటే మా పనులైనట్లే అది అసాధ్యమన్నట్లుగా మాట్లాడారు మరికొందరు

ఇక కొందరు పురుషులు పిల్లలెందరుంటేనేం? చేతనైన ప్రభుత్వం అయితే అందరికీ కూడు గుడ్డ నీడ వుండేలా చెయ్యాలి తమకున్న రాజకీయ జ్ఞానాన్నంతా మాటలలో ఇమిడ్చి మీసం తిప్పారు

కొందరిళ్ళలో భయంకర దృశ్యాలు చూసింది

జ్వరం వచ్చి స్పృహ గోల్పోయిన పిల్లవాడికి దయ్యం పట్టిందంటూ భూత వైద్యుణ్ని పిలిపించి డాం ఢూంల మంత్రాలతో యంత్రాలు వేయిస్తున్నారు మాసిన అతడి కాషాయ వస్త్రాలు మెళ్ళో రుద్రాక్షమాలలు జడలు కట్టిన ముఖాన పెద్ద బొట్టు ఆ భూత వైద్యుణ్ని చూస్తుంటే భయమనిపించింది అనితకు

ఇంకొకచోట ఇంకా ఘోరమైన దృశ్యం

పది నెలల పిల్లాడు చూస్తుండగానే కాళ్ళు చేతులు పట్టుకుపోయి కండ్లు తేలేశాడట తల్లి ఘొల్లు మనగానే చుట్టు ప్రక్కల వాళ్ళు హడావిడిగా చేరి వాడి నుదుట కాల్చాలన్నారు అదే వేదవాక్కుగా భావించి తాగుతున్న చుట్ట తీసి వాడి నుదుట పెట్టారొకరు

"ఏమిటీ వైద్యం?" చూడలేకపోయింది అనిత

'డాక్టర్ దగ్గరికి తీసుకెళ్ళగూడదూ? అంటే 'ఆయనేం చేస్తాడు? ఇట్లాంటియన్నీ రంగునీళ్ళతో తగ్గుతాయా? కాసేపట్లో వాడు లేస్తాడు సూడు అన్నారక్కడి వాళ్ళు

ఆ పిల్లాడ్ని గాలిలోకి ఎగరేసి పట్టుకుంటున్నారు

తల్లి ఏడుపు

'ఆ దృశ్యం చూస్తున్నంత సేపు నేనెంత భయపడ్డానో! ఆ పిల్లాడు పడిపోతాడేమో ననిపించింది కాని అక్కడున్న వాళ్ళందరు అది మామూలే అన్నట్లు చూశారు రెండు నిమిషాల తర్వాత వాడు కెవ్వుమన్నాడు నాగుండె బరువు దిగినట్లయింది అనిత తను చూసిన వాటిని తలుచుకుంటూ చెబుతోంది

ఆ ఊర్లో సంవత్సరం క్రిందటే ప్రభుత్వ ఆసుపత్రి వెలిసింది అందులో వున్నది ఒకే ఒక డాక్టరు అతడికి పల్లెటూళ్ళంటే పడదు. దగ్గరలో వున్న భాగ్యనగరంలోనే ఆతడెక్కువ కాలం గడుపుతాడు

ఎప్పుడో వున్నా మత్తులో వుండి పేషెంట్ల మాటే వినడు ఏవో మందులు మాత్రలు ఇచ్చి పంపిస్తాడు దానితో వాళ్ళకు డాక్టర్లంటేనే నమ్మకం పోయింది ఆ నమ్మకం వాళ్ళలో మళ్ళీ నెలకొనేలా చెయ్యాలి ఆ డాక్టరు బాధ్యతారహిత ప్రవర్తన వాళ్ళను మరీ మూర్ఖుల్ని చేసింది వాళ్ళు ఆ కరిన వైద్యాలతో ప్రాణాల్నే పోగొట్టుకోవచ్చు నేను ఆ డాక్టరుతో మాట్లాడాలనుకొని హాస్పిటల్‌కు వెళ్ళాను కాని అతడు లేడు వున్నా భోగప్రియుడైన అతడు నామాట విని ఆ ఊర్లో వాళ్ళను వుద్ధరిస్తాడని



## జలుబూ, పడిశెంతో పాపకి కంటికి కునుకులేదు

# విక్స్ వేపోరబ్‌తో యిక ఆ రాత్రే హాయిగా నిద్ర పట్టింది

## (అప్పుడే మరి తల్లి మమత కనిపించేది)

ఈ జలుబుతో వచ్చిన తిప్పలేమిటంటే, తన దాకా వస్తేనేగాని తెలియదు మరి. అవడానికి మామూలు జలుబే, కాని దాంతో రాత్రంతా నిద్రకి నోచుకోరు. యిక ముక్కు దిబ్బెడ వెయ్యడం, కారడం. ఖళ్ళు-ఖళ్ళుమని దగ్గు, ఒళ్ళంతా నెప్పులూను. పడిశెం పది రోగాల పెట్టు! పసిపాప ఎలా భరించగలదు గనక! అటువంటప్పుడేగదా తల్లి ఆపేక్ష, చల్లని చేతుల చమత్కారం కనిపించేది- పాప ముక్కుకి, గుండెలకి, గొంతుకి, వీపుకి ఆ ఆపేక్షతో విక్స్ వేపోరబ్ రాసినప్పుడు. ఆ.... వీపుమీద విక్స్ వేపోరబ్ రాయడం మర్చిపోకండేం? అలా చెయ్యకపోతే, మీరు పడ్డ శ్రమంతా అపూర్తంగానే ఉండిపోతుందిక. మమతతో నిండిన మాలీసుతో తన క్రియని ప్రారంభిస్తుందిక. దీనిలోని ఔషధీయుక్తమైన ఆవిరితో ముక్కుదిబ్బెడ పోతుంది. మరి దాంతోనే శరీరంపైన దీని ప్రభావంతో ఒంటి నెప్పినుంచి ఉపశమనం కలుగుతుంది.

ఈ రకంగా మమతతో నిండిన ఉపచారంతో పాప హాయిగా నిద్రపోతుంది. యిక ప్రొద్దున్నే కళ్ళు తెరవగానే మునపటిలాగా కులాసాగా వుంటుంది.




## విక్స్ వేపోరబ్

**ఇస్తుంది హాయిగా**
**ఊపిరి పీల్చుకునేలాంటి ఉపశమనం**
**ఇక కులాసాగా ఉండగలిగే అనుభవం.**

RHL/VR-6 TEL R

## పసిడిబొమ్మలు

నేననుకోను ఊరి పరిస్థితి వివరించి అంది

మీరైతే వాళ్లకు సహాయ పడగలరని మీ దగ్గరికి వచ్చాను

నేను సహాయ పడడమా! వింతగా చూశాడు నేను డాక్టర్ని కాదు '

మీరు డాక్టరు కాదు కాని డాక్టర్లు మీ చేతిలో వున్నారు మీ నర్సింగ్ హోమ్ సారీ విజయ్ నర్సింగ్ హోమ్ డాక్టర్లు మీ స్నేహితులు డాక్టర్లు డబ్బేకాదు ప్రజల క్షేమం గూడా కోరాలి అది వారి వృత్తి ధర్మం వాళ్లను గ్రామాలలో అప్పుడప్పుడు క్యాంపులు వేసుకోమని చెప్పండి ముందుగా చక్రపురం వెళ్లాలని గూడా చెప్పండి ఈ విషయం వాళ్లతో మాట్లాడాలనే వచ్చాను నేను అంది అనిత

"తప్పకుండా చెబుతాను వాళ్లకు ఇలాంటి మనుషులంటే ఇష్టం ఒప్పుకుంటారు అన్నాడు విజయ్

విజయ్ ఆ ఊళ్లో నేనింకో విశేషం చూశాను ఒక యింట్లో ఒక యువతి మమ్మల్ని చూడగానే వచ్చి నాకాళ్లు పట్టుకుంది ఆ హఠాత్సంఘటనకు నేను అప్రతిభురాలినయ్యాను 'నన్ను ఇక్కడినుండి తీసుకెళ్లి పుణ్యం కట్టు-కోండి అని ఆ అమ్మాయి ఏడుస్తోంటే" ఏమయిందమ్మా? అంటూ ఆమె భుజాలు పట్టి లేవదీస్తున్నప్పుడే ఆమె తల్లి వచ్చింది

ఇది మిమ్మల్ని గూడా పట్టుకుందే ఆమె ఆ అమ్మాయిని లోపలికి తీసుకెళ్లబోయింది కాని ఆ అమ్మాయి చెయ్యి విదిలించి కొట్టింది

ఏమిటిది? ఎందుకిలా చేస్తున్నావు? ఆ అమ్మాయిని అడిగితే ఆమె తల్లి ఆ అమ్మాయికి దయ్యం పట్టిందని కొత్తవాళ్లు కనిపిస్తే ఇలాగే ఇంటినుండి తీసుకెళ్లమని గోలపెడుతుందని చెప్పింది కాని ఆ అమ్మాయి వెంటనే అందుకొని దయ్యంలేదు గియ్యంలేదు వీళ్లు దయ్యమంటూ మాట్లాడే మాటలు భరించలేక ఇలా చేస్తున్నాను అంటూ ఆ అమ్మాయి ఆవేశంగా మాట్లాడింది

ఆ అమ్మాయి పేరు లలిత ఆమె గోపాల్ అనే అబ్బాయిని ప్రేమించింది అతడు వాళ్ల బంధువే కాని పొలం తగాదాలు వచ్చి రెండేళ్ళుగా కుటుంబాల మధ్య మాటలు లేవట లలిత, గోపాల్ పెద్దవాళ్ల కోపాలను లెక్క చెయ్యకుండా గుళ్లోనో చెరువుకట్ట దగ్గరో కలుసుకుంటుంటే వాళ్లట




ఆ విషయం తెలిసి తల్లిదండ్రులు మండిపడ్డారు

విరోధులైన వారింటికి తన కూతుర్నివ్వడమా ' తండ్రి ససేమిరా అతడికిచ్చి పెండ్లి చెయ్యనన్నాడు

తల్లి తన కూతురలా కోరదని ఎదురింట్లో చనిపోయిన వాళ్లమ్మాయి లక్ష్మి తన కూతురికి దయ్యమై పట్టి అలా మాట్లాడిస్తోందని అనుకుందట

లక్ష్మికి చదువుమీద వున్న అభిరుచి చూసి గోపాల్ ఆమెకు చదువు చెబుతుండేవాడు కాని ఆ అమ్మాయి గురించి అతడికే ఆలోచనా లేదు వాళ్లది గురు శిష్యుల సంబంధం అలా అనడం అన్యాయం అంది లలిత

లక్ష్మి అకస్మాత్తుగా కలరా వచ్చి మరణించిందట

దయ్యమైనా కాకున్నా కూతుర్ని గోపాల్‌కు ఇవ్వడమంటే ఆత్మగౌరవం చంపుకున్నట్లే ననుకున్నారు తల్లిదండ్రులు ఆరోజునుండి లలితను గడపదాట నివ్వలేదు తల్లిదండ్రుల పట్టుదలను నిస్సహాయురాలైన లలిత ఎదిరించలేక పోయింది వాళ్ల ఇష్టంతో రాజీ పడాలనుకున్నది తను పుట్టినప్పుడే నిశ్చయమైన మేనమామ కొడుకును చేసుకుంది కాని మనసు ఎదురు తిరిగింది దానితో భర్త నీడను గూడా భరించలేకపోయింది ఫలితం పుట్టిల్లు చేరింది

కూతురి గురించి ఎవరూ చెడుగా చెప్పుకో గూడదని ఆ తల్లిదండ్రులు దాన్ని దయ్యం ఏడిపిస్తోందని చెబుతున్నారే కాని లోలోపల ఆమె దుఃఖానికి తామే కారణం అని బాదపడుతున్నారు

వాళ్లకు లలిత మాట్లాడే మాటలు దయ్యమన్న అనుమానాన్ని ఏనాడో తొలగించాయి అందుకే లలిత చెప్పింది విన్నాక పంతాలకు పట్టింపులకు పోయి కన్న బిడ్డ జీవితం బలిచేస్తారా? అనగానే ఆ తల్లి తలవంచుకుంది

దయ్యం పట్టిందంటూ వచ్చిన వాళ్లందరూ నన్ను వింతగా, భయంగా చూస్తుంటే నాకు నిజంగా దయ్యం పడుతుందేమో ననిపిస్తుంది అందుకే ఇంటినుండి ఎటైనా పారిపోవాలనుకున్నాను లలిత కన్నీళ్లతో చెప్పింది

'కట్టుకథలతో ఆమెకు నరకం చూపించడం కన్నా విషం ఇచ్చి చంపడం మేలు' నేను కోపంగా అంటే ఇప్పుడింకేం చెయ్యమమ్మా?' దిగులుగా చూసిందా తల్లి చుట్టు ప్రక్కల వాళ్లను అప్పటికే మా స్టూడెంట్స్ అక్కడినుండి పంపించెయ్యడంవల్ల ఆమె ఆ మాట అనగలిగిందేమో!

'గోపాల్ కిచ్చి పెండ్లి చెయ్యండి అంటే "మళ్లీ పెండ్లా! అదిరిపడింది

మీ అమ్మాయి కంటే మీకు పంతాలుపట్టింపులు, సాంప్రదాయాలే ముఖ్యమనుకుంటే నేనేం చెప్పలేను "

'లేదమ్మా ఇప్పటికే దాన్నిలా చూడలేకపోతున్నాము గోపాల్ గూడా దాన్నింకా కోరుతున్నట్లు మొన్న నాకు పొలం దగ్గర కనిపించి చెప్పాడు అంటూ నాకు దగ్గరగా వచ్చి 'రేపే గుళ్లో పెండ్లి చేస్తాము కాని ఒక మాటమ్మా అది నువ్వు చేస్తున్నట్లే చెప్పాలి మేము చేస్తున్నామంటే ఊళ్లో వాళ్లు మమ్మల్ని బ్రతుక నివ్వరు అంది రహస్యంగా చెబుతున్నట్లుగా

నేను సంతోషంగా ఒప్పుకున్నాను

వాళ్ల కిష్టమైనా లోకం ఏమటుందోనని భయం వారి అమాయ-కత్వానికి జాలేసింది

ఆ అమ్మాయి పెండ్లికోసం మేము మరో రోజు ఆగాల్సి వచ్చింది గోపాల్‌తో వెళుతున్నప్పుడు ఆ అమ్మాయిని చూడాలి ఆ కండ్లలో ఎంత వెలుగో ఆ అమ్మాయి కండ్లలో వెలుగేమో కాని అనితకు ఆ అమ్మాయి జీవితం మార్చగలిగానని ఆనందంగా వుంది అది ఆమె మాటల్లో, ముఖంలో గూడా ద్యోతకమౌతోంది

ఆ అమ్మాయి జీవితాంతం మిమ్మల్ని తలుచుకుంటుంది అన్నాడు విజయ్

**(ఇంకా ఉంది)**

## కె. హెచ్. ఎన్–గొల్లప్రోలు

తూర్పు పడమరలకి తేడా ఏమిటి?

★ వెలుగు–చీకటులకి ఉన్నదే!

## డి. డి. పి.– దులియజాన్

నేను ఒక పిల్లను మరువ లేకుండా ఉన్నాను ఈ పరిస్థితులలో ఏమి చేయాలో అర్థం కావడం లేదు

★ పనీ పాటాలేదా ఏం? వాటిపై దృష్టి మరలిస్తే సరి

## సి. హెచ్. ఎన్.–నిడదవోలు

అక్కయ్యా, మనం ఎవరితో మాట్లాడినా ఏం చేసినా నిజాలు లేవు అన్నీ అబద్ధాలే ఎక్కువ అయిపోతున్నాయి నిజం మాట్లాడే మనుషుల్లేరు అవినీతి ఎక్కువైపోయింది నీతి తక్కువైంది

★ అంతా కుళ్ళే చూసే ప్రయత్నం చేస్తే యిలాగే కన్పిస్తుంది పెంటకుప్పమీద గడ్డి పువ్వుని కూడా చూడకల్గాలి

## వి. ఎస్. ఎస్ ఆర్.–కొదురుపాక

ఆడవాళ్ళను నమ్మవద్దు మరి దీనికి పరిష్కారం?

★ తూర్పు తిరిగి దండం పెట్టడం–

## ఎమ్. ఎమ్. ఎస్.–కొత్తపేట

ఆడవాళ్ళకి సమాన హక్కులు కావాలంటున్నారు ఇప్పుడే భర్త యింట్లో లేనప్పుడు పరాయి మగవాడితో కాలక్షేపం చేస్తున్నారు కదా–అలాగే జరిగితే అమెరికాలాగా ఇండియా తయారవుతుంది

★ మీలాంటి అనుమాన ప్రాణులు–అసలు సంఘానికి పట్టిన చీడ పురుగులు వ్యభిచరించడానికి- హక్కులు ప్రసాదించ నక్కరలేదన్న చిన్న సత్యం ముందు గ్రహించండి

## ఎన్. టి.–విశాఖ

మహరాజని మనవి చేస్తే మరి రెండు తన్నమన్నట్టు–అలా వున్నవి మన కోర్టులు

★ కోర్టు విషయాలు నేను లాయరుగారికే వదిలేస్తాను నాకైనేను న్యాయా న్యాయ వివరణ చేస్తూ కూర్చోను

## ఎస్. వి ఆర్.–గుడివాడ

నేడు చిత్ర రంగంలో విచ్చుల విడిగా నటిస్తున్న ఒక హీరోయిన్ అంటే నాకు ప్రేమ

★ ఆంధ్రదేశంలో ఏదో టైములో ఎవరో ఒకహీరోయిన్‌తో ప్రేమలో పడని యువకులు చాలా తక్కువ మంది వుంటారు అంచేత మీ ప్రత్యేకత అంతా–'విచ్చులవిడి'గా నటించేస్తున్న నటితోనే అనుకోవాలి అది మీ అభిరుచికి చిహ్నం మాత్రమే గాని మరేం కాదు

## సి. హెచ్. జి.–టిట్లాఘర్

నేను కద వ్రాయడం ప్రారంభించి సగంలో




ఆపేశాను అది అచ్చవుతుందో లేదో డౌట్‌గొచ్చి ఆపేశాను ఒకవేళ రాస్తే అచ్చవుతుంది అంటారా?

★ నీళ్ళలోకి దూకితేగాని యీత రాదు రాసి కద పంపిస్తే గాని–అచ్చయేది లేనిది తెలియదు తెగించండి!

## ఎన్. ఎమ్.–తాడేపల్లిగూడెం

మీ నవల ఆంధ్ర పత్రికలో సీరియల్‌గా రావాలని కోరికగా వుంది

★ రాస్తా! రాస్తా!!

## బి ఆర్ –నిడదవోలు

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను ఆమె నన్ను ప్రేమించింది కాని యిప్పుడు మాట్లాడ్డంలేదు

★ పలకరిస్తే చాలు ప్రేమించిందనుకుంటే ఎలా?!

## ఎం. జి. ఆర్.– దిలియజాన్

బజారులో కన్పించే బొమ్మకు వెలకడ్తారు అదే గుడిలో బొమ్మకి హారతి పడతారెందుకు?

★ స్థల ప్రభావం

## బి. వి. ఆర్. కొత్తపట్నం

ఆడదాని నోట్లో రహస్యం దాగదు అంటారు నిజమేనా?

★ అతిశయోక్తి అక్కడికి మగవాళ్ళంతా రహస్యం పైకి చెప్పనట్టు!

## ఎస్. కె. పి హిందుపురం

అక్కగారూ, నాకు చదువు సంధ్యలు లేవు జీవించడమెలాగా అని బాధ పడుతున్నాను

★ జీవించడం – ఎలాగేనా జీవించవచ్చు చదువు సంధ్యలుంటే – అదే కాస్త మెరుగ్గా అనిపిస్తుంది అంతే నిరాశకి స్వస్తి పలకాలి ముందు అది జీవితాన్ని మరీ భారం చేస్తుంది

## బి. ఆర్ ఎల్ రాయచోటి

వరకట్న దురాచారంలో స్త్రీల పాత్ర వున్నదా?

★ ఉంటుంది – ఆమె కూడా కుటుంబంలో భాగ స్వామి కద

## జి ఎస్ రామచూరు

మీ ప్రశ్నావళి తప్ప నేను మీ యితర రచనలు ఏమి చదవలేదు మొన్నీ మధ్య మీరు రచించిన దిన దిన గండం నాటిక మా అందరికీ నచ్చింది

★ థాంక్యూ

## మీనా - చంద్రగిరి

అక్కగారు నాకు 25 ఏళ్ళు నా కంటే పదేళ్ళు చిన్నవాడి చదువు బాధ్యతలు నేను చూస్తున్నాను తమ్ముడు లేని నాకు వాడు తమ్ముడు కాని సమాజం నీచ భావంతో చూడడం, చెవులు కొరుక్కోవడం బాధ కల్గిస్తూంది

★ మీ స్వంత కొడుకుతో నడుస్తూన్నా – ఏదైనా అనుకోదల్చిన వాళ్ళు – అనుకుంటారు వారిని మనం కాదనలేం మీ మనస్సులో లేని కల్మషం – మిమ్మల్ని బాధ పెట్టకూడదు

□



# మనస్తత్వం

గొల్లపూడి రాజ్యలక్ష్మి

సాయంత్రం అయిదు గంటలైంది.

ఒక్కొక్కరే కలాలు ముడిచి – ఫైళ్ళు మూసి – బయటకు నిష్క్రమించే హడావుడిలో పడ్డారు. మరో పావుగంటలో – ఆ హాల్లో రామానుజం ఒక్కడే మిగిలాడు. రామానుజానికి టైముతోగానీ, బాహ్య జగత్తుతోగానీ పనిలేదు. ఫైలు తెరిచాడంటే పూర్తిగా పనిలో మునిగిపోతాడు. అంతగా ఆఫీసు పనిలో తాదాత్మ్యం చెందే రామానుజాన్ని చూస్తే ఆఫీసులో మిగతా వాళ్ళకి ఆశ్చర్యం కలుగదు.

రామానుజం ఆ ఆఫీసులో చేరిన కొత్తల్లో మాత్రం. అతనూ తమలాంటి 'సరద లపక్షి' అనుకొని – పార్టీలకు, పిక్నిక్కులకు పిలవటం, ఆఫీసు పని కంటే– కబుర్లకీ ఎక్కువ కాలాన్ని వినియోగిస్తూ – అతన్ని తమ కబుర్లలోకి ఆహ్వానించటం చేశారు. ఒక్క చిరునవ్వుతో – 'అవును' 'కాదు' అనే పొడి మాటలతోనూ – తన ప్రత్యేకతను చూపించి వాళ్ల సాన్నిహిత్యం కంటే – ఆఫీసు పనిమీద తనకు మక్కువ ఎక్కువన్న విషయం వాళ్ళు తెలుసు-కొనేలా చేశాడు రామానుజం.

భార్యా – పిల్లలు వున్న రామానుజం – ఆఫీసు టయిము అవగానే ఇంటికి పోవాలని ఏమాత్రం ఉత్సాహం చూపక పోవటం పట్ల – 'అతనితోటి ఉద్యోగస్థులలో రకరకాల అభిప్రాయాలున్నాయి. 'పని' అంటే రామానుజానికి అమిత ప్రాణమనీ, పని చెయటంలో వున్న ఆనందం, ఉత్సాహం మరే విషయంలోనూ అతనికి లభించదనీ కొందరంటే – 'ఇదంతా ప్రమోషన్‌కోసం చేసే స్టంటు!' అని కొందరు వ్యాఖ్యానించుకున్నారు. 'ఇంటిలోని పోరు ఇంతింత కాదయా!' అన్నట్లు భార్య నోరుగలది కావటంవల్ల 'ఇల్లుకంటే ఆఫీసు పదిలమని' ఇక్కడే కాలక్షేపం చేస్తాడని మరి కొందరు అభిప్రాయ-పడ్డారు. ఈ మాటలన్నీ రామానుజం చెవిని పడక-పోలేదు. అయితే అందులో కొన్ని నిజాలు కూడా వుండటంవల్ల అతనంతగా బాధపడలేదు.



రామానుజానికి 'పని అంటే ప్రాణ'మనేమాట నిజమే! 'పెండింగ్' అన్నమాట అతని డిక్షనరీలోనే లేదు. పైగా తన కొలీగ్స్ పని కూడా నెత్తినేసుకుని చేస్తాడు. అతనట్లా పని చేయటంలో ఏదో రిలీఫ్‌ని పొందుతాడు. అందుకే కొందరు 'గానుగెద్దు' అన్నా అదేదో ప్రశంసలాగే అన్పిస్తుందతనికి.

అయితే – రెండో వర్గంవాళ్ళు అభిప్రాయపడ్డట్టు 'ప్రమోషన్' పొందాలనో అతను ఎప్పుడూ ఆశ పెట్టుకుని పని చేయలేదు. తనకంటే సీనియర్స్ వున్నారనీ.... తనకంత సులభంగా రాదని తెలుసు.

ఇంకా మరి కొందరనుకున్నట్లు 'ఇంటిలోని పోరు' మాత్రం నూటికి నూరు పాళ్ళూ నిజం.

రామానుజం భార్య కాంతమ్మ నోరుగలదే మరి!

రామానుజం పెళ్ళయిన కొత్తల్లో – అందరిలాగే అయిదుకాగానే ఫైళ్ళు మూసి – హుషారుగా ఇంటికి పరిగెత్తుకుని వెళ్ళేవాడు. ఇంట్లో కాంతమ్మ ధోరణి చూశాక ఉత్సాహమంతా నీరుకారి పోయేది.

మధ్య తరగతి కుటుంబంలో – ఆరుగురు ఆడ-పిల్లల్లో ఒక్కగా పుట్టిన కాంతం పెళ్ళి గురించీ – మొగుడ్ని గురించీ చాలానే కలలు కన్నది.

ఇంపాలా కారు కాకపోయినా – కనీసం స్కూటరన్నా వున్న మొగుడు దొరకాలనీ – రోజా పట్టుచీరలు కట్టకపోయినా – కనీసం వంద రూపాయలకు తక్కువగాని చీరలు కట్టుకోవా-లనీ....ఏడు వారాల నగలూ లేకపోయినా – ముచ్చటగా మూడు పేటల గొలుసయినా వేసుకోవా-లనీ ఎన్నెన్నో కోరికలు! రెండు గదుల కొంపా, కనీసం సైకిలన్నా లేని రామానుజం, వంద రూపాయిల్లో మూడు చీరెలొస్తాయోమో అని తాపత్రయపడే అతని మనస్తత్వం, అతని గుమాస్తా ఉద్యోగంతో – జీవితావసరాలకు కూడా సరిపడని స్థితి ఆమెను నేలమీదకు లాక్కువచ్చాయి. అసంతృప్తి – ఎవరి మీదో తెలీని కసీ, ఆమెను పూర్తిగా వశం చేసుకుని – వివక్షణా జ్ఞానాన్ని పూర్తిగా హరించి వేశాయి. రామానుజాన్ని మాటలతో సాధిస్తూ మానసిక తృప్తి పొందటానికి ప్రయత్నిస్తూంటుంది కాంతం.

ఆ పోరు పడలేక ఇంట్లో వుండే కాలన్ని తగ్గించేసి– ఆఫీసులోనే ఎక్కువగా గడపసాగాడు రామానుజం. బాగా పొద్దు పోయాక ఇంటికొచ్చి– మళ్లీ ఉదయాన్నే ఇల్లు వదులుత్తాడు.

## 2

రాత్రి ఎనిమిది గంటలకు ఫైళ్ళు మూసి బయటకొచ్చాడు రామానుజం. తాపీగా నడుచుకుంటూ ఇల్లుల్ను చేరేసరికి తొమ్మిది అవుతోంది. పెద్ద పిల్లలిద్దరూ పుస్తకాలతో కుస్తీ పడుతున్నారు.

తండ్రిని చూస్తూనే రెండో వాడు పెద్దగా– "నాన్నా! నరసత్తయ్యా వచ్చింది.!" అని అరిచాడు. అట్లా పెద్దగా అరవటంతో వాడికి వాళ్లమ్మ పోలికే రావటం రామానుజానికి కాస్త కష్టంగానే అన్పిస్తుంది.

వాడి గొంతువిని వంట గదిలో వున్న కాంతమ్మ, "అదిగో... వచ్చాడమ్మా మీ అన్న. నే చెప్పలేదూ? అందరికీ అయిదు గంటలకే అయిపోయే ఆఫీసు ఇతగాడికి తొమ్మిదవుతేనే కానీ కాదని...! అంతా నా ఖర్మలే! అంటోంది.

రామానుజం బట్టలు మార్చుకుని– పెరట్లోకి కాళ్ళు కడుక్కుని వంటింట్లోకొచ్చాడు.

కాంతమ్మ కుంపట్లో అప్పడాలు కాలుస్తోంది. లక్షింనరుసు వదినగారికి కాస్త దూరంలో పీట మీద కూర్చుని వుంది.

"ఎప్పుడొచ్చావే నరసూ?" అని చెల్లెల్ని పలకరించాడు.

సాయంత్రం నాలుగ్గంటల బండికి!"

"పిల్లలూ వాళ్ళూ బావున్నారా?"

"ఆఁ... ఏం బావుండటమో! పెద్దదానికి మొన్ననే పొన్నవచ్చి తగ్గింది. చంటాడికి బంక విరోచనాలయి బక్క చిక్కి పోయాడు. సరే! మీ బావ సంగతి తెలిసిందేగా! ఆ సిగరెట్లు మానరు. రాత్రిళ్ళు ఒకటే దగ్గటం!"

లక్షింనరుసు వచ్చినప్పుడల్లా రామానుజం కుశల ప్రశ్నలు వేయటం– ఆవిడ ప్రపంచంలోని కష్టాలన్నీ తనకే దాపురించినట్లు వాపోవటం– దానితో అన్నగారు ద్రవించిపోయి– నాల్గు రోజులు విశ్రాంతిగా వుండిపొమ్మనడం మామూలుగా జరిగిపోయే విషయాలు.

"ఊఁ. నీ వంట్లో ఎట్లావుంది?" అనడిగాడు భయపడుతూనే.

"నా వంటి సంగతే అడిగావ్? నీరసం, గుండెదడ ఎక్కువైనయ్. కాళ్ల పీకుడు, నడుంనొప్పి నములుతూనే వుంది! కొత్తగా ఈ కళ్లజబ్బొకటి పట్టుకుంది!

కంటి జబ్బా?"

"వూఁ. ఒకటే కళ్లంట నీళ్ళు. ఎర్రబడిపోయి– మనుషులు, వస్తువులు ఏవీ కనిపించవు. ఏమిటో...

నా ఖర్మలే అన్నయ్యా! ఆయన సంపాదించి పోస్తున్నా సుఖపడే గీత వుండొద్దూ? వదిన సుఖమంతా డబ్బులోనే వుందంటుంది గానీ– అంతా భ్రమ. ఆరోగ్యమే మహాభాగ్యం అని వూరికే అన్నారా? మా కొంపకి 'లక్షింనరుసు నిలయం' అని పెట్టాంగానీ– 'అనారోగ్య నిలయం' అనిపెడ్తే సరిగ్గా సరిపోతుంది."

"నువ్వేన్నయినా చెప్పు లక్ష్మి! దరిద్రాన్ని మించిన దరిద్రం మరొకటిలేదు. ఒకటుంటే మరొకటి లేక నేనెంత బాధ పడుతున్నానో నీకేం తెలుసు?"

"నీకేం తక్కువ వదినా! ముత్యాల్లాంటి" మనసులో 'దుక్కల్లాంటి' అనుకుంటూ "పిల్లలు, గంగిగోవులాంటి అన్నయ్య... మరీ చోద్యంగా మాట్లాకు.!"

"నా అదుష్టాన్ని గురించి నువ్వే పొగడాలి! నా ఖర్మకాలి ఈ సంబంధం చేశాడు మా నాన్న! ఒక్క అచ్చటా... ముచ్చటా? ఏం చూసుకుని విర్రవీగాలో చెప్పు! పని మనిషిని పెట్టుకుందామన్నా గతిలేదు. అధ్వాన్నమైన చాకిరీతో ఛస్తున్నాను. పాలు, అద్దె, కిరాణా అందరికీ బకాయీలు. తెల్లారి లేచిన దగ్గర్నించ ఎవరికో ఒకరికి సర్ది చెప్పటం! మీ అన్నయ్యకేం బాధలేదు. తెల్లారి ఎనిమిది గంటలకే ఇల్లు వదిలి పోతారు. మధ్య నా ప్రాణం పోతోంది. ఇదిగో నరసూ చూస్తుండు. ఈయనతో ఇట్లా కాపురం చేయలేక

ఎప్పుడో కిర్సనాయిలు పోసుకుని అంటించేసుకుంటాను. ఖాయంగా..." అన్నది కాంతమ్మ రామానుజంవైపు కోరగా చూస్తూ.

ఛ అవేంమ్మాటలొ దినా!"

"అంతే నరసూ! నా బాధ నీకు తెలీదు. గొర్రెతోక బెత్తెడన్నట్టు ఎనాళ్లీ సంసారం? నేనా పని చేస్తేగానీ మీ అన్నయ్యకు బుద్ధిరాదు. పెళ్లాం బిడ్డలంటే ఇంత అలక్ష్యమైన మనిషి పెళ్లెందుకమ్మా చేసుకోటం?" కాంతమ్మ విజృంభించసాగింది.

రామానుజం అక్కడ్నించికదలి ముందు గదిలో-కెళ్లి పాలుకుర్చీ వేసుకున్నాడు.

"అదిగో... చూశావా? ఎంత నిర్లక్ష్యమో! ఎన్నైనా వాక్కోనీ... అన్నట్టు ఇదీ వరస. ఎందుకమ్మా ఈ పాడు బతుకు? ఎవరికీ కాక పోయాక..." ముక్కు చీదసాగింది కాంతమ్మ.

రామానుజానికి జోలపాట పాడినప్పుడు పసివాడు నిద్రపోయినట్టు- కళ్ల మీదకు నిద్రకూరుకు రాసాగింది.

ఆ విధంగా ఓ అరగంట సాధింపులతో- కళ్లొత్తులతో- ఆడబిడ్డ ఓదార్పులతో గడిచాక- మొగుడ్ని లేపి భోజనం పెట్టింది కాంతమ్మ.

## 3

ఆ మరునాడు ప్రొద్దున ఆఫీసుకెళ్లే ప్రయత్నంలో వున్న రామానుజం దగ్గరకు లక్షింనరుసు వచ్చి నిలబడి ఏదో చెప్పటానికి తటపటాయిస్తోంది.

ఏవిఁటన్నట్టు చూశాడు.

"మరీ... మధ్యాహ్నం నేను వూరికి వెళ్తున్నా నన్నయ్యా!" అని ఆగింది.

'అప్పుడే... వెళ్లిపోతుందా? ఈ సారిఎక్కువ రోజులు వుండదల్చుకోలేదా? ఎందుకొచ్చిందో? ఏదైనా పని పెట్టుకుందా తనతో?' ఆలోచిస్తున్నాడు.

## మనస్తత్వం

మొదటి నుంచీ ముభావంగా వుండే మనస్తత్వం అన్నయ్యది. నాలుగు ప్రశ్నలకి కలిపి ఒకటే జవాబిస్తాడు. అందుకే ఏం మాట్లాడాలన్నా ఏదో బెరుగ్గా- భయంగా వుంటుంది. అబ్బ! వదినకెంత ధైర్యం!.. ఎన్నేసి మాటలంటుంది!... కట్టుకున్న మొగుడన్న లక్ష్యంలేదు కదా?" అనుకుంటోంది లక్ష్మీనరుసు.

"ఊఁ... కళ్ళు బాలేదన్నావ్‌గా. డాక్టర్‌కి చూపించుకో! అశ్రద్ధ చేయకు అన్నాడు ముందుకు కదులుతూ రామానుజం.

"అన్నయ్యా మరి."

ఆగాడు.

వంట గదిలోంచి ముందు గది గుమ్మంలో కొచ్చి నిలబడి వీళ్ల సంభాషణ వింటోంది కాంతమ్మ. 'డబ్బుగానీ అడగదు కదా!' అన్న అనుమానం కల్గింది రామానుజానికి. కాస్తో కూస్తో కలిగిన కుటుంబమే అయినా వచ్చినప్పుడల్లా తిరుగు ప్రయాణానికి ఛార్జీలు అన్నగారి దగ్గర పుచ్చుకుపోవటం లక్షింనర్సుకు అలవాటే.

జేబు తడుముకున్నాడు రామానుజం. అయిదు రూపాయలు మాత్రం మిగిలి వున్నాయి. అసలే నెలాఖరు రోజులు. కాంతం కాఫీ పొడి అయిపోయిందన్నది. ఓ పావుకిలో తీసుకు రావాలి....

రెండో కొడుకు గోపాలం వున్నట్టుండి ఓ గావుకేక పెట్టాడు.

"నాన్నోయ్!"

ఝడుసుకుని- 'ఏవిఁట్రా' అన్నట్టు చూశాడు.

"నాకో రూపాయి కావాలి! డబల్‌రూళ్ల పుస్తకం కొనుక్కోవాలి!"

"జీతాలు రానీయ్!" అన్నాడు.

"ఇవాళే కావాలి!"

"నా దగ్గరలేవు. అమ్మనడుగు." పొరపాట్న నోరుజారాడు.

కాంతంకు ఒళ్ళు మండింది. "అమ్మనడగాలిట. అమ్మని! అక్కడికి వందలు- వందలు గడించి నా చేతుల్లో పోస్తున్నట్టు! ఆ మాటనటానికి సిగ్గుండాలి!" అన్నది ఛీదరింపుగా.

రామానుజం ఆ మాటల్ని విననట్లే చెల్లెలి ముఖంలోకి చూశాడు. 'ఏమిటో విషయం త్వరగా చెప్పు!' అన్నట్టు.

గోపాలం "నాన్నా! రూపాయి..." అన్నాడు వదిలిపెట్టకుండా

'తప్పదు. రూపాయి ఇస్తేగానీ వదలడు శని వెధవ. ఈ పిల్లలక్కూడా అన్నీ తల్లిలా పీడించుకుతినే బుద్ధులే!" అని లోలోన విసుక్కుంటూ జేబులో చెయ్యిపెట్టాడు.

"ఒరేయ్ గోపీ! రూపాయి నేనిస్తాన్లే. నాన్నకాఫీసు టయిం అయింది. వెళ్లనీ అన్నది లక్షింనరుసు.

అది ఆమె స్వభావానికే విరుద్ధమైన మాట. ఎన్నడూ తన పిల్లలచేతిలో పైసా పెట్టి ఎరుగదు. పోనీ వచ్చేటప్పుడైనా ఓ పండైనా తెచ్చి ఇవ్వటం అలవాటులేదు. వున్నట్టుండి ఇంత ఉదారత ఏమిటా అని ఆశ్చర్యం వేసింది రామానుజానికి. ఏదో బలీయమైన పనే తనతో వుండి వుంటుంది అనుకున్నాడు. కాంతం అక్కడున్నంత సేపూ లక్షింనరుసు నోరు విప్పదని అర్థమై నాలుగడుగులు ముందుకు వేసి రోడ్డు మీద కొచ్చాడు. తండ్రిని వెన్నంటి నడవబోతున్న గోపాలాన్ని కసిరింది లక్షింనరుసు- తను చెప్పబోయే విషయానికి అడుగడుగునా విఘ్నం కలగటం చూసి.

"రూపాయి నేనిస్తా నన్నాగదా! నాన్నని విసిగిస్తావేం?" అని.

"వాడేం చేశాడమ్మా పసి వెధవ. నువ్వేగా ఏదో మాట్లాడాలని మీ అన్నని నిలేశావు. నన్ను చూసి కాబోలు అన్నా చెల్లెళ్ల రహస్యాలు ఆగిపోయాయి. అన్నది విసురుగా.

"నీకు తెలీని రహస్యాలేమున్నాయి వదినా! మధ్యాహ్నం వూరికెళ్తున్నానని చెప్తున్నాను." అన్నది ముఖం మాడ్చుకుని.

"ఎందుకమ్మా ఆ బుకాయింపు? ఆ మాత్రం నేను గ్రహించలేని దాన్నికాదు. మీ అన్నయ్యతో ఏ పనీ బడకుండా- వూరికే ఆపేక్షతో చూసి పోదామని వచ్చావా?" అన్నది నిలదీస్తూ.

లక్ష్మింనర్సు ముఖం పాలిపోయింది.

రామానుజం వెళ్లాలా.. వద్దా.. అన్నట్టు ఇరకాటంలో పడ్డాడు.

గోపాలం "నాన్నా..." అంటూ నసపెడుతున్నాడు.

"బావుందొ దినా! అయితే మా అన్నయ్య మీద నాకు ఆపేక్ష లేదంటావ్! అయితే ఎందుకొచ్చానంటావ్ ఇప్పుడు? తినటానికి నాకేం గతిలేక వచ్చాననంటావా?"




అన్నది ముఖాన గంటు పెట్టుకుని లక్ష్మింనర్సు.

"అంతమాట నే నెందుకంటాను తల్లీ! ఏం రాచకార్యమో... చెప్తేనేగా తెలిసేది?" అని మొగుడుకేసి తిరిగి "ఇదిగో.. నిన్నే! వచ్చేప్పుడు కూరలు పట్టుకురా! నాలుగు రోజుల్నుంచి పచ్చడి మెతుకులతో ఛస్తున్నాం!" అన్నది. "ఆఁ... అన్నట్టు కాఫీ పొడి సంగతి మర్చిపోకు!" అన్నది పెద్దగా.

'నెలాఖరు...' నసిగాడు.

"అయితే? ఎన్నాళ్ళిలా మాడి చావమంటావు? రాత్రి తొమ్మిది దాకా ఆఫీసులో బండచాకిరీ చేసే బదులు– ఇంకో చోట పద్దులు రాస్తే... నాలుగు డబ్బులైనా వస్తాయి. సంపాయించే బుర్ర వుండాలిగానీ..."

"ఇదిగో కాంతం... ఇది వీధి. వూరికే అరవకు!" అన్నాడు కాస్త చిరాకుగా." ఈ చిరాకులకేం తక్కువలేదు. సంబడం! రారా గోపీ... ఈ వెధవ సంసారానికి తోడు మీ పుస్తకాల గోలొకటి! వెధవ సంతా మీరూను...." అంటూ కొడుకుని అక్కడ్నించి బరబరా లాక్కుపోబోయింది కాంతమ్మ.

రామానుజం తన జేబులోని అయిదు రూపాయిల్లో ఒకటి చేతిలో పెట్టి– రోడ్డు మీద కొచ్చాడు. అన్నగారితో పాటు తను కూడా అడుగులువేస్తూ– మెల్లని స్వరంతో అన్నది లక్ష్మింనర్సు.

"వారం నుంచి రేణు కన్పించటం లేదన్నయ్యా! అది మీ ఇంటికేమన్నా వచ్చిందేమో అని... ఆశతో వచ్చాను!"

రామానుజం ఆగి ఆశ్చర్యంగా– కాస్త కంగారుగా చూశాడు.

"రేణు కన్పించటంలేదా? ఏం జరిగిం దసలు?" అన్నాడు ఆదుర్దాగా.

"ష్. మెల్లిగా. వదినిక్కడే వుంది. విన్నదంటే... నా కొంప బజార్న పెడుతుంది. నీతో ఈ ముక్క చెప్పాలనే రాత్రినించీ ప్రయత్నం! ఏమిటో నా ఖర్మ! నా బాధ పగవాళ్ళకు కూడా వొద్దు. ఈడొచ్చిన పిల్ల ఇట్లా... ఎంత అప్రదిష్ట! దానికేదైనా జరిగితే నేను నూతిలో పడటంతప్ప మరో దారిలేదు!" గొంతు రుద్ధమైపోయింది. ముక్కు చీదుకుంది.

రామానుజం చెల్లెలివంక సానుభూతిగా చూశాడు.

"దిగులుపడకు. ఎక్కడో వుండే వుంటుంది. దాని స్నేహితుల ఇళ్ళు వెతికారా?"

"అంతా చూశాం. నా ఖర్మ ఇదంతా! టెన్త్ కాగానే కాలేజీలో చేరుతానంది. మీ బావ వొప్పుకోక 'పెళ్ళి' అన్నారు. అది దానికిష్టంలేదు. జరిగిందింతే! ఈ మాత్రానికే ఇట్లా చేయాలా? చెప్పు!"

"దానికి బాయ్ ఫ్రెండ్స్ ఎవరైనా...?"

"ఛ.. అట్లాంటి బుద్ధులు మా ఇంటావంటాలేవు. రేణు గుణమేమిటో నీకు తెలీదూ?"

"మరికనేం? ఎందుకు కంగారు? ఈపాటికి ఇల్లు చేరేవుంటుందేమో! పోనీ... నేను శలవుపెట్టి నీక్కూడా రానా?" అనడిగాడు.

"వద్దులే! కన్నందుకు మాకు తప్పదు. నీకూడా ఎందుకొచ్చిన బాధ!"

"సర్లే ఇంటికెళ్ళాక అదొచ్చిందీ– లేనిదీ ఉత్తరం రాయి. అవసరమైతే వస్తాను. సరేనా? నేనింక వెళ్ళాలి." మరోసారి వాచీ వైపు చూసుకుని బస్ స్టాప్ వైపు పరుగు తీశాడు ఆదుర్దాగా.

తిరిగొస్తున్న లక్ష్మింనర్సుని చూసి– కాంతమ్మ అక్కసుగా మూతి విరుచుకుంది.

"ఆ బుద్ధులు ఎక్కడికి పోతాయి? అన్నకు తగ్గ చెల్లెలే! మనసులో ఏముంటుందో.. ఒక్క విషయం తనతో ఆంతర్యంగా చెప్పరు! ఎంతయినా తను పరాయిదే! పాడు సంత! తను నోరు పారెసుకోవడం మాత్రం కన్పిస్తుంది!" అనుకుంది రుసరుసగా.

## 4

రాత్రి రామానుజం వచ్చేసరికి కాంతమ్మ తలకు గుడ్డ కట్టుకుని పడుకునివుంది. మౌనంగా స్నానంచేసి వచ్చి తనేవడ్డించుకుని తినసాగాడు రామానుజం.

అంతా చూస్తూనే వుంది కాంతమ్మ. ఒళ్ళు మండుకొచ్చి లేచింది.

"నేను చచ్చిన్నాడు కూడా నువ్విట్లాగే స్నానం-
చేసి- హాయిగా తింటావు కాబోలు! 'ఎందుకలా
పడుకున్నావు?' అనైనా అడగనివాడికి నీ కసలు
పెళ్ళెందుకయ్యా? ఏం కొంపలో పడేశావురా తండ్రీ!
నేనీ కాపురం చేయలేనురా దేవుడా!" కాంతమ్మ
అరవటం మొదలెట్టింది.

అప్పటిదాకా చదువుతున్న పిల్లలు పుస్తకాలు
మూసి ఈ భాగోతం తిలకిస్తూ కూర్చున్నారు.

"ఛ అవేం మాటలు?" అన్నాడు నోట్లోని ముద్ద
మింగుతూ.

"లేకపోతే ఏవిఁటి? తిన్నానో – వున్నానో నీ కక్కర్లేక
పోయాక..."

"ఊఁ... అన్నం తిన్నావా?" అడిగాడు. మొక్కు-
బడిగా.

"ఆహా... ఏం ప్రేమ!... అన్నట్టు కాఫీ పొడి
తెచ్చావా?"

"లక్ష్మినర్సు వెళ్ళిందా?" మాట మార్చాడు.

"వెళ్ళింది. అవునూ... ఎందుకొచ్చిందిట? వీధిలో
కంటావచ్చి ఏవిఁటి చెప్పింది?" అనడిగింది కుతూ-
హలంగా

"ఏంలేదు."

"ఏం లేదూ? ఎందుకా అబద్ధాలు? పెళ్ళాంతో
కూడా చెప్పగూడని రహస్యమా."

"ఏంలేదు అన్నాగా!"

"చెప్పవన్నమాట! ఎంతమొండి మనిషి! నేనింక ఈ
కొంపలో ఒక్క క్షణం వుండను! ఈ పిల్లలతో ఎట్లా
వేగుతావో నీ ఇష్టం! నే పోతున్నా!

"ఎక్కడికి?"

"ఏట్లోకి! నీకూ – నీ పిల్లలకూ చాకిరీ చేసే పని
మనిషిని కాను నేను. అతీ – గతీ లేనట్టు ఈ కొంపలో
పడి వుండాల్సిన ఖర్మ నాకేమిటి? పోతా మా ఇంటికి!"

"ఇదేగా నీ ఇల్లు!" అన్నాడు, చెయ్యి కడుక్కుని
లేచి.

"ఇది నా ఇల్లా? .... అవునూ.... కాఫీ పొడి
తెచ్చావా? అంటే మాట్లాడవేం?

"రేపు తెస్తాను. ఇవాళ టైం దొరకలేదు!"

"నేను పోయాకగానీ నీకు టైము దొరకదు! ఎందు-
కొచ్చిన పాడు జన్మ....ఛి, ఛీ.!"

"వూరుకో కాంతం! అసలే నీకు తలనొప్పిలా వుంది!
కాస్త ఎంగిలి పడు." అన్నాడు ముందు గదిలో
కెళ్తూ.

"నీ ఆపేక్ష మండినట్లే వుందిలే! ఇదిగో!.... దీపావళి
వస్తోందికదా.... పిల్లలకి ఈ సారైనా బట్టలు
తీసేదుందా?"

"మరో నెలాగుతే సంక్రాంతి వస్తోందిగా!" దీనికి
ఇద్దాంలే!.... నీకు చీరె కూడా...., సరేనా?"

"ఇదుగో.... ముందే చెప్తున్నా! నాకు మాత్రం
పట్టుచీర తీసుకోవాల్సిందే! పెళ్ళయి పదిహేనేళ్ళు
గాటినా.... నా గోడు నాకేగానీ...."

"చూద్దాం లే!" అన్నాడు నీరసంగా.

**మనస్తత్వం**

"ఏవిటంట చూసేది? ఈసారి పట్టుచీరె కొనక-
పోతే.... ఈ దరిద్రపు కొంపలో ఒక్క క్షణం కూడా
వుండను. అయినా.... నా ముఖానికి అంత దురుష్టం
కూడానా? దానికైనా పెట్టిపుట్టాలి. మగాడికి
సంపాదించే యావ..... పెళ్ళాం బిడ్డల్ని సుఖపెట్టా-
లన్న యావ స్వతహాగా వుండాలిగానీ.... ఎంతపోరితే
మాత్రం ఏం లాభం? గానుగెద్దులా పడి ఆఫీసులో
చాకిరీచేసి, రావడం, తినడం, తొంగోటం! నెలకొచ్చే
ఆ రొందలూ ఎట్లా సర్దాలో తెలిక నేను తలబద్దలు
చేసుకుంటున్నాగానీ నీకు చీమ కుట్టినట్టయినా
వుండదు. ఈ చాలీచాలని జీతంతో ఎప్పటికి బ్రతుకు
తెల్లవారేను? ఎదుగూ – బొదుగూలేని ఈ దరిద్రపు
ఉద్యోగం....అన్నట్టు... బోనసేదో వస్తుం-
దన్నారుగా?" కాంతమ్మ వాక్ప్రవాహం ఆపి
రామానుజం వైపు చూసింది. అప్పటికే మంచం
మీద పడుకుని గుర్రెట్టి నిద్రపోతున్నాడు
కాంతమ్మకు మళ్ళీ ఒళ్ళు మండింది. చేతిలోని
పులుసు గిన్నె తీసుకెళ్ళి అతని నెత్తినే దిమ్మరించి
రావాలన్నంత కోపం వచ్చింది. బలవంతాన అన్నం
ముద్దలతో పాటు కోపాన్ని దిగమింగింది.

## 5

"అయ్‌గారు పిలుస్తున్నారు సార్!" ప్యూన్ అప్పన్న
చెప్పాడు.

"ఆఁ. వస్తున్నా!" అంటూ హడావిడిగా లేచి
లోపలికెళ్ళాడు.

"ఆ ఫైలు పూర్తయిందా?"

"ఆ పనే చేస్తున్నాను సార్! ఇంకో పది నిము-
షాల్లో తెచ్చిస్తాను!" అన్నాడు వినయంగా.

"కూర్చో. నిలబడే వున్నావేం?" అన్నాడాయన
కళ్ళజోడులోంచి నిశితంగా చూస్తూ.

"ఫర్వాలేదులెండి!" అన్నాడు ఇబ్బందిగా. "అరె....
కూర్చోమంటుంటే ఎందుకామొహమాటం...."

కూర్చున్నాడు.

"నీకెంతమంది పిల్లలయ్యా రామానుజం?"

"నాకాండి....ఇద్దరు మగ....ఇద్దరు ఆడ."

"వెరసి నలుగురన్నమాట! భేష్. బాగుందోయ్.
ఇదిగో... అప్పన్నా! రెండు కాఫీలు పట్రా!" అని
కేకేశాడు.

రామానుజానికి ఆయన వైఖరి కొత్తగానూ –
వింతగానూ తోచింది. 'ఏవిఁటి ఆకాల ఆప్యాయత?
తనకి పెళ్ళిడొచ్చిన మగపిల్లలు గట్రా లేరే! తనతో
ఈయనకి ముఖ్యమైన పనులేముంటాయబ్బా!' అన్న
ఆలోచనలో పడ్డాడు.

అప్పన్న కాఫీలు తెచ్చాక రామానుజానికొకటిచ్చి –
తనొకటి తీసుకున్నాడు. మొహమాట పడుతూనే
కప్పు తీసుకున్నాడు.

"ఊఁ....మిస్టర్ రామానుజం! నీకో గుడ్
న్యూసోయ్!" అన్నాడు పళ్ళన్నీ బైటపెట్టి నవ్వుతూ.

"అయ్యా.... తమదయ!" అన్నాడు తబ్బిబ్బు-
పడుతూ. ఏవిఁటా వార్త అన్నట్టు చూశాడు.

"మన కంపెనీకి ఈ మధ్య చాలా లాభాలు
వస్తున్నాయి. చాలాచోట్లనుంచి ఆర్డర్స్ వస్తు-
న్నాయి. అందుకే కొత్తగా మరో బ్రాంచి పెట్టాలని
మన మెనేజ్‌మెంట్ నిశ్చయించుకుంది. అందుకు
సమర్థుడైన వ్యక్తిని మన ఆఫీసులోంచి ఎన్నికచేసి
– ఆ బ్రాంచికి మేనేజర్‌గా ఎపాయింట్ చేయాల్సి
వుంటుంది." ఆగాడాయన.

రామానుజం శ్రద్ధగా వింటున్నాడు.

"నేను.... అందుకు నిన్ను సమర్థుడిగా రికమండ్
చేశాను. పనిమీద నీకున్న శ్రద్ధ నన్నెంతగానో
ఆకర్షించింది. ఏ కంపెనీ అయినా నిజాయితీగా పని
చేయగల స్టాఫ్ వున్నప్పుడే వృద్ధిలోకి వస్తుంది. నీ
ఆధ్వర్యంలో పెట్టబోయే బ్రాంచి విజయవంత-
మవుతుందని ఆశిస్తున్నాను! ఇవాళో – రేపో నీకు
ఆర్డర్సు వస్తాయి."

అది కలో – నిజమో అర్థంకాలేదు రామానుజానికి.

'తనకేమిటి.... బ్రాంచి మేనేజరుగా ప్రమోష-
నేమిటి? ఇది కలే అయివుండాలి!' అనుకున్నాడు.

"కంగ్రాట్యులేషన్ అందుకోండి!" అన్నాడాయన
రామానుజం అవస్థ చూసి నవ్వుతూ.

"థాంక్యూ.... థాంక్యూ సార్!" అన్నాడు తేరుకుని.

క్షణాల్లో ఈ వార్త ఆఫీసంతా పాకింది. స్టాఫంతా
వచ్చి అభినందించిపోతున్నారు. చేతిలో పైసా
లేకున్నా – అడ్వాన్సుగా అందరికీ కాఫీలు
పోయించక తప్పలేదు రామానుజానికి.

మనసులో అంతులేని ఆనందం.... ఏదో తెలిని
బెంగ పోటీపడినయ్. నిశ్చలమైన తటాకంలో రాయి
విసిరినట్టుంది అతని పరిస్థితి

'బ్రాంచి మేనేజర్ అంటే సామాన్యమా? ఎంత
హోదా.... ఎంత పలుకుబడి? పైగా జీతంలో పెరుగు-
దల! తను ఎప్పుడైనా అనుకున్నాడా? ఈ స్థాయిలోనే
ఇట్లాగే ఎప్పుడో రిటైరయిపోతాననుకున్నాడు. ఈ
జీవితానికింతే! అని ఎప్పుడో రాజీపడిపోయాడు.
ఇప్పుడింత నమ్మకంతో తనపై ఈ బాధ్యత అప్ప-
గిస్తున్నారు! తను నిర్వహించగలడా?' ఆలోచన-
లతో సతమతమైపోతున్నాడు రామానుజం.

రోజులా రాత్రి ఎనిమిది గంటలదాకా ఆఫీసు పనిలో
లీనం కాలేకపోయాడు. అందరితో పాటు అయిదు
గంటలకే ఫైలుమూసి బైటకు నడుస్తున్న రామాను-
జాన్ని చాలా కళ్ళు ఆశ్చర్యంతో చూశాయి.

## 6

"అమ్మా! నాన్నొచ్చాడేవ్!" అంటూ గోపీ పెద్ద-
పెట్టున వేసిన కేక విని – దొడ్లో పక్కింటావిడతో
గోడ దగ్గర నిలబడి మాట్లాడుతున్న కాంతమ్మ –
"ఎవరూ? మీ నాన్నే?" అన్నది అపనమ్మకంగా.
రామానుజం కాళ్ళు కడుక్కోటానికి పెరట్లోకి

# మళ్ళీ మళ్ళీ తిరిగి చూస్తారు జనం
# సూపర్ రిన్ తో తళతళలాడే
# ఆ తెల్లదనం




**సూపర్ రిన్ తో తళతళలాడే తెలుపు**

మరే ఇతర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు.

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS RIN

ANHDRA PATRIKA 17X23 CM

రావటం చూసి ఆశ్చర్యంతో కొయ్యబారిపోయింది.

"ఏవిఁటి ఈ వేళప్పుడు వచ్చావు? వంటో బాగో-లేదా?" అనడిగింది.

"బాగానే వుంది." అన్నాడు.

"మరి?"

"ఏవీలేదు...మనసు బాగోలేదు!" ముఖం తుడుచుకుంటూ. అన్నాడు.

"ఏం జరిగిందేమిటి?"

"ముందు నా ముఖాన కాఫీ నీళ్ళుంటే పొయ్యి!" అన్నాడు కాస్త విసుగ్గా – కాంతమ్మ మరింత తెల్ల-బోయింది

"ఏం జరిగిందీయనకు? కొంపదీసి గాలిగాని సోక-లేదుకదా!' అనుకుని – "కాఫీపొడి అయిపోయిందని నెత్తి – నోరూ కొట్టుకుని చెప్పినా తెస్తే గా? కాఫీ పొయ్యాలిట! కాఫీ! సిగ్గెట్టా లేదనీ...." మొదలు పెట్టింది సాధింపు.

"ఆఁ... అన్నట్టు నాచేతి సంచిలో – కాఫీపొడి, పూలువున్నాయి చూడు!" అన్నాడు గుర్తు కొచ్చి.

"ఏవిఁటీ? పూలే! ఈవేళ సూర్యుడు ఏ దిక్కున పొడిచాడబ్బా! అన్నది ముఖం విప్పారగా.

అయిదు నిమిషాల్లో కాఫీ తయారు చేసు-కొచ్చింది.

కాఫీ గ్లాసు అందుకుని తాగుతూ – "ఈవేళ ఓ విశేషం జరిగింది." అన్నాడు కాంతమ్మ ముఖంలోకి చూస్తూ.

"ఏవిఁటో అది? బోనసుగానీ ఇచ్చారేమిటి?" అన్నది ఆశగా.

"కాదు....నాకు ఉద్యోగంలో మార్పు వచ్చింది!"

నిట్టూర్చింది. "సంబడం. ఇంతేనా? ఇంకా ఏమో అనుకున్నాను. అద్సరే.... మీ చెల్లెలు ఉత్తరం రాసింది. ఆ గూట్లో వుంది చూడు!" అంటూ అక్కడ్నించి పోబోయింది.

"ఏం రాసింది?" అన్నాడు కార్డుతీసి చూస్తూ.

"ఎదురుగానే వుందిగా. చదవరాదూ?"

"నే చెప్పేది పూర్తిగా వినకుండా వెళ్తావేం?"

"ఏం వినాలి సొద?"

"నీకు శుభ వార్తేలే! నాకు ప్రమోషన్ వచ్చింది!" అన్నాడు నవ్వుతూ.

కాంతమ్మ ముఖంలో విసుగు మాయమై –సంభ్రమం చోటుచేసుకుంది. "ప్రమోషనా? నీకా? నిజంగానా? నన్నుడికించాలనా?"

"నిజంగానే. బ్రాంచి మేనేజర్‌గా...చాలా హోదా పెరుగుతుంది!"

"అచ్సరే....డబ్బు! ఎంత పెరుగుతుందేమిటి జీతం?" అన్నది ముఖం వెలిగిపోగా.

"దాదాపు వెయ్యి రూపాయల దాకా పెరగొచ్చు." అని చెల్లెలు రాసిన ఉత్తరం చదవుకోసాగాడు.

కాంతమ్మకి ఆనందంతో కాళ్ళూ– చేతులూ ఆడటంలేదు. ఇంతగొప్ప వార్త నమ్మ శక్యం కావటంలేదు ఒక్కసారిగా తాను ఎంతో ఎత్తుకు ఎదిగినట్టు ఉక్కిరి బిక్కిరైంది. గభగబా పేరట్లో-కెళ్ళి ప్రక్కింటావిడను కేకేసి చెప్పింది సంబరంగా. పిల్లలకి చెప్పింది. అయినా తృప్తిగాలేదు. మళ్ళీ మొగుడి దగ్గరకొచ్చి కూర్చుంది.

"ఇదిగో కాంతం! మొన్ననడిగావే లక్షీంనర్సు ఎందుకొచ్చిందీ? అని. ఎందుకొచ్చిందీ అంటే..."

"ఎందుకో అందుకు. అవునూ... ప్రమోషన్ అన్నారుగదా... ఆఫీసరంత హోదా.. వుంటుందా?".

"వుండొచ్చు. అద్సరే... రేణు ఏం చేసిందో తెలుసా?"

"ఏదో చేసిందిలెస్తూ. హోదాగా ఉండాలంటే ఈ కొంపలో ఎట్లా కుదురుతుంది? మరో మంచి ఇల్లు చూసుకోవద్దూ?"

"ఇల్లా ఆసలీ పూరులోంచే మకాం మార్చాలి. అయినా ఈ కాలం పిల్లల కింత సినిమా మోజులేమిటో చూడు. దాని ఈడుకి అది ఏకంగా హీరోయిన్ కావాలని...."

"దాని గొడవకేంగానీ– ఏ వూరు వెళ్ళాలి మనం?"

"విజయవాడ. పాపం లక్షీంనర్సు ఎంత దిగులు పడిందో... ఆ రోజున ఈ ముక్క చెప్పాలనే.."

"ముందు నువ్వా పాతబట్టలు పారేసి– కొత్తవి కుట్టించుకో. హోదాగా వుండొద్దూ? నాలుగు కర్చీలు– ఓ టేబిలు తీసుకోవాలి. ఇంకా చాలా సామాను తీసుకోవాలి మనం."

"చూద్దాం. రేణు తిరిగొచ్చాక మా బావ ఏమన్నాడో రాసింది చూశావా? ఆయనకంత కోపం రావటం సహజమేగానీ– అల్లరిపడితే ఎవరికి నష్టం? ఎట్లాగయినా ఆయనకు ఆలోచన తక్కువ. అర్భకుడు."

"వాళ్ల తిప్పలు వాళ్లవి... మన సంగతి నేను చెప్పేది. ఇదుగో ముందే చెప్తున్నా– నాకు నల్లపూసల గొలుసు చేయించాలి. ఎనాళ్లనుంచో మోజు. ఇక తప్పదు.!"

"చూద్దాం రేణుకి పెళ్లవటం కష్టం కదూ... నలుగురి దృష్టిలో ఇట్లా బైట పడింది. ఎవరు చేసుకుంటారు దాన్ని.?"

"మేనమామవిగా. నువ్వుగాని చేసుకోవాలను కావటంలేదుకదా? జామునుంచీ చూస్తున్నాను. వాళ్ల గురించి తప్ప మన సంగతి పట్టించుకోరేం? ఏం మనిషివయ్యా? సంతోషం కూడా అనుభవించటం చేతగాని వాడికి రేపు మేనేజర్‌గా ఎట్లా పని చేస్తావంట?"

కాంతమ్మకు కోపం వచ్చింది.

రామానుజం మౌనంగా పడకుర్చీలో మేను-వాల్చాడు.

కాంతమ్మ ఏదో అంటూనే వుంది.

నెమ్మదిగా కళ్ళు నిద్రతో బరువెక్కి మూసుకు పోసాగాయి.

ప్రమోషన్ ఆర్డర్ చేతికొచ్చింది. కొంత ఎడ్వాన్స్‌గా డబ్బిచ్చారు.

ఆఫీసులో పార్టీ అది ముగిశాక ఇంటికొచ్చాడు రామానుజం.

స్నానంచేసి ముస్తాబయి అతనికోసం ఎదురు చూస్తున్నట్టు వుంది కాంతమ్మ.

"ఎవరింట్లో పేరంటం?" అనడిగాడు.

"పేరంటమూలేదు– బుగ్గీలేదు!".

"సినిమాకా? టైం దాటి పోలేదూ?"

"పోదురూ!.. బడాయి" కోపం, సిగ్గు అభినయించింది.

"సెకండ్ షోకా? ప్రక్కింటావిడతో నేనా?"

"కాదని చెప్తుంటే మీక్కాదూ? పూరికేనే. అయినా... నేనింకా గుమాస్తా పెళ్ళాన్నా ఏమిటి? చింకి బట్టలు కట్టుకునే రోజులు పోయాయి. నా అదృష్టం తిరిగింది!" అన్నది నవ్వుతూ ప్రసన్నంగా.

రామానుజంకి మతిపోయినంత పనయింది.

తను మరో ఇంటికి పొరబడి రాలేదుకదా? అను-కున్నాడు.

ఇది తన ఇల్లే. ఇదుగో పిల్లలు. అవును.. కొత్తగా కాంతం 'మీరు' అంటూ ఈమన్నన ఏమిటి? వేషం, భాష అంతా మారి పోయిందే!

"ఇదిగో ఈ ఉప్మా తిని– కాఫీ తాగండి. కాసేపు అట్లా పడకుర్చీలో కూర్చుని రెస్టు తీసుకోండి! ఈలోగా వేన్నీళ్ళు బాత్ రూంలో పెడతాను!

కాంతమ్మ మర్యాదలకి రామానుజం బుర్ర మొద్దు-బారిపోయింది.

ఉప్మా తిని కాఫీ తాగాడు. రోజూ రాత్రిళ్ళు చన్నీళ్ళు స్నానం చేస్తాడు. ఆ అలవాటుకి భిన్నంగా ఈ రోజు వేన్నీళ్ళు స్నానంచేసి రాగానే చలువచేసి వున్న లుంగీ – బనీను తీసి వుంచింది సిద్ధంగా

'తన దశ తిరిగింది!' అనుకున్నాడు కాస్త గర్వంగా. 'అవును. తను ఇంకా గుమాస్తా రామానుజం కాదుగా! మేనేజర్ రామానుజరావు. అనుకున్నాడు. ఆ అనుకోవడంలో ఎంతో తృప్తి– ఆనందం.

'రోజూ చూసే ఇల్లయినా ఈ రోజు ఎంత మార్పు! ఇక నుంచీ ఇంటా– బయటా గౌరవం, వంక-దణ్ణాలు... నిజంగా పదవిలోనే వుంది కదా పర-మార్థం. 'నిధి చాలా సుఖమా?– రాముని సన్నిధి చాలా సుఖమా?' అని ఆ పిచ్చి త్యాగరాజు మీమాంసలో పడ్డాడు గానీ– మరో మానవుడైతే అమాంతం ఆ నిధిని కావలించుకోడూ?... ఆ నిధి లేకనేగా– ఇంట్లో చులకన– బయట లోకువ... కుక్కకంటే హీనంగా బ్రతకటం...' రామానుజం ఆలోచిస్తూనే వున్నాడు.

చిన్నవాళ్ళిద్దరూ దేనికో కొట్లాడుకుంటే గబగబా కాంతమ్మ వెళ్ళి "ఏంటా వెధవగోల? నోర్మూసుకోండి! అవతల నాన్నగారు రెస్టు తీసుకుంటున్నారు." అని మందలిస్తోంది.

రామానుజం నవ్వుకున్నాడు. సుమతీశతకకారుని పద్యం గుర్తొచ్చింది

'గడన గల మగని జూచిన– అడు గడుగుకు మడుగులొత్తు...

ఆహా! ఎంత అనుభవశాలి ఆ మహానుభావుడు...."

రాత్రి భోజనంలో కొసరి కొసరి తినిపించింది. మంచం వాల్చి పక్క వేసింది. తన పని ముగించుకువచ్చి– మొగుడి కాళ్ళు పట్టసాగింది.

"అబ్బె... నాకేం నొప్పిలేవు. వదులు కాంతం!" అంటూ మొహమాటపడి పోయాడు రామానుజం.

"చాల్లెస్తురూ. పొద్దుననగా వెళ్ళి– ఆ పాడు ఆఫీసు నుంచి నడిచొచ్చి... నీకు తెలీదూ?అయినా. . ఇంకా ఎన్నాళ్ళులే. ఓ స్కూటరు కొనుక్కుంటే..."

రామానుజం కాంతమ్మ ప్రేమలో ఉక్కిరి బిక్కిరైనాడు. ఆ రాత్రి నిద్ర రాలేదు దగ్గరకు.

## 8

కొత్త వూళ్ళో– కొత్త ఇంట్లో– కొత్త పదవిలో రామానుజం క్రమ క్రమంగా స్థిర పడసాగాడు. రామానుజానికి ఆఫీసువాళ్ళే స్కూటరు– ఫర్నిచరూ ఇచ్చారు. ఇంటికి ఫోనొచ్చింది. అతని క్రింద ఆరుగురు గుమాస్తాలు ఇద్దరు టైపిస్టులు... ఎక్కడ చూసినా మర్యాదా– మన్ననా.. డబ్బుకు సంబంధించిన చికాకులన్నీ తొలగి పోయినయ్.

క్రొత్తగా తెరచిన బ్రాంచీ కావటంవల్ల పని వొత్తిడి ఎక్కువగానే వుంటోంది. ఆఫీసు పనితో అలిసి ఇదివరకు లాగానే రాత్రి తొమ్మిది గంటలకే ఇంటికి వస్తున్నాడు. అయినా కాంతమ్మ ఏమీ అనటంలేదు. పైగా అలసిపోయాడని సపర్యలు చేస్తోంది కూడా. అంతా బాగానే వుంది. అన్నీ వున్నాయి. అయినా రామానుజానికి మనశ్శాంతి వుండటంలేదు. అసహనం, చిరాకు పెరిగిపోయాయి విపరీతంగా. రాత్రిళ్ళు అస్సలు నిద్రపట్టటంలేదు.

ఆర్నెల్ల క్రిందటి రామానుజానికి ఇప్పటి రామానుజానికీ పోలికేలేదు. చిక్కిపోయి బక్కగా తయారైనాడు. జుట్టంతా రాలిపోయి పిడతలా తయారైంది తల.

కాంతమ్మ అతనికి రోజూ హార్లిక్స్– విటమిన్ టాబ్లెట్లు, టానిక్కులూ, పళ్ళు బలవంతంగా తినిపిస్తోంది. డాక్టర్ దగ్గర కెళితే– బలహీనత తప్ప ఏం రోగం లేదన్నాడు.

కాంతమ్మకి లక్షింనర్సు గుర్తుకొచ్చింది. 'ఖర్మ, ఇది వీళ్ళకి వంశ పారంపర్య జబ్బుకాదు గదా! డబ్బు చూడగానే ఇట్లా పీనుగుల్లా తయారవటం ఏమిటి?' అనుకున్నది– దిగులుగా.

మరింత శ్రద్ధగా అతనికిష్టమైన కూరలు చేసి పెడ్తోంది. టైం ప్రకారం అన్నీ సమకూరుస్తోంది. అయినా ప్రయోజనం కన్పించటంలేదు. రోజ రోజుకీ మరింత దిగజారి పోతున్నాడు. ఇది వరకులా ఆఫీసు పని మీద కూడా శ్రద్ధ చూపలేక పోతున్నాడు. మనసంతా ఏదో వెలితి. దిగులు... అమూల్యమైనదేదో పోగొట్టుకున్నట్లు శూన్యత. ఎందుకిట్లా? రామానుజం ఎంత ఆలోచించుకున్నా తెలీటంలేదు. చిరాకు- విసుగు ఎక్కువై ఆఫీసులో స్టాఫ్ మీద– ఇంట్లో భార్య మీద కూడా మండి పడ్తున్నాడు.

కాంతమ్మ – భర్త పరిస్థితి అర్థం చేసుకున్న దానిలా ఓర్పుగా భరిస్తోంది అన్నీ. ముక్కోటి దేవతలకూ ముడుపులు కట్టింది. పేరు పేరునా మొక్కింది. తన మొగుడికి వెనుకటి ఆరోగ్యం ఇవ్వమని.

* * *

ఆ రోజు ఆఫీసు నుంచి వస్తూనే ఎంతో చిరాకుగా వున్నాడు రామానుజం. ఇంట్లోకి రాగానే టేప్ రికార్డర్‌ని ఇష్టం వచ్చినట్లు నొక్కుతున్న చంటిదాని మీద పడింది దృష్టి.

"ఇది కాస్త నాశనం చేస్తావుటే పాడు ముండా!" అంటూ దాన్ని గబగబా నాలుగంటించాడు.

ఓ ప్రక్కగా కూర్చుని ఇంగ్లీష్ మేగజైన్‌లోంచి బొమ్మల్ని కత్తిరిస్తున్న రెండో వాడ్ని చూసి "నీకు బుద్ధి లేదుట్రా పుండాకోర్. ఇట్లా చింపి తగలేస్తావా? ఇది కొంపకాదు నరకం" అన్నాడు పళ్ళు కొరుకుతూ– రెండు తగల్నిచ్చి.

ఇద్దరూ యుగళగీతం మొదలెట్టారు.

ఈ హడావుడికి కాంతమ్మ పరిగెత్తుకొచ్చింది.

"ఏం చేశారండీ వాళ్ళు... ఎందుకట్లా అరచి హైరాన పడ్తారు?" అన్నది నచ్చ చెప్ప బోతున్నట్లుగా.

"నీ పిండాకూడు. ఏం చేస్తున్నావు కొంపలో? వీళ్ళిద్దరూ వస్తువుల్ని తగలేస్తుంటే చూడనక్కర్లా?"

"పోనిద్దురూ. చిన్న పిల్లలు. అలిసినట్లున్నారు. హాయిగా స్నానంచేసిరండి! వేడిగా దోసెలువేసి ఇస్తాను." అన్నది ఆప్యాయతతో.

### ప్రకృతి–వికృతి

ఎదిగే చెట్టు
చెరువలోని
మొక్కకు
గొడుగును
ఎదగనివ్వడు
ఇది ప్రకృతి
పెరిగే మనిషి
అక్కున ఉన్న
మనిషికి
టోపీ వేసి
ఎదగనివ్వడు
ఇది వికృతి

— సి. ఎ. సర్వేశ్వర శర్మ

"నీ ముఖం తగలేసిరి. తిండి కోసం ఎవడేడ్చి చస్తున్నారు.? నువ్వే తిను అన్నీ. అన్నాడు మండి పడుతూ.

కాంతమ్మ కొళ్ళు మండింది. అయినా సహనంగా– "నేనూ తింటాను. మీరు కూడా తినండి. పోనీ ఇద్దరం సరదాగా తిందామా?" అన్నది.

"నీ సరదా మండినట్లే వుంది! నన్నట్టే విసిగించకు. అవతలికి ఫో.

"ఏమయింది మీకు? ఎందుకింత చిరాకు? వంట్లో ఎట్లా వుంది?

"ఏదో అయింది. పిచ్చెత్తినట్లుగా వుంది. నాకేమయిందో నాకే తెలీటంలేదు. ఆఫీసులో పనికూడా తగలెట్టేశాను. నిన్ను చూసినప్పుడు నాలుగు తన్నాలనిపిస్తుంది. నీ మాటలు వింటుంటే పీక పిసుగుదామనిపిస్తుంది. ఈ కొంప ఒక నరకం. మీరంతా రాక్షసులు అన్పిస్తుంది. రాత్రిళ్ళు నిద్రపట్టిచావదు. ఏదో అయింది నాకు. పెద్దగా అరవాలనుకున్నాడు. గొంతు పెగలలేదు.

"మాట్లాడరేం? మిమ్మల్నే!"

"నోర్మూసుకుని లోపలికి ఫో– వెధవ సొద." అన్నాడు. ఛీదరింపుగా.

"పోతాన్లెండి... ముందు మీరు కోటువిప్పండి!"- అంటూ అతని దగ్గరగా వెళ్ళి కోటు విప్ప బోయింది. అవసరం లేదన్నట్లుగా ఒక్కసారిగా విదిలించుకున్నాడు. ఆమడ దూరానకెళ్ళి పడింది. ఆ విసురుకు కాంతమ్మ అప్పటిదాకా ఆమెలో వున్న సహనం ఎగిరిపోయింది.

"ప్రమోషన్ వచ్చినప్పటి నుంచి చూస్తున్నాను. నన్ను పురుక్కంటే హీనంగా చూస్తునావ్! ఏమిటయ్యా నీ గొప్ప? బోడి ప్రమోషనూ నువ్వూను. నీ పెత్తనం ఆఫీసులో చూపించు. నా దగ్గరకాదు. పోనీలే అని చూస్తున్నకొద్దీ నీ పిచ్చి ముదిరిపోతుంది. ఇంకా బోడి కోపం చాలించి నోర్మూసుకూర్చో. నీ మొహానికి మర్యాద.. మన్నన ఇవ్వటం నాదే బుద్ధి తక్కువ..." అన్నది మండిపడుతూ.

రామానుజంలో హటాత్తుగా ఏదో రిలీఫ్ కలుగ సాగింది.

"చాల్లే... వెధవ్వాగుడూ నువ్వూనూ!" అన్నాడు ఉత్సాహంగా.

"నాది వెధవ్వాగుడా? అమ్మో... అమ్మో... ఎన్నేసి మాటలు పడుతున్నాను. ఎంత లోకువై పోయాను! నీకీ పాడు రోగమేమిటయ్యా? లక్షణంగా కాపురం చేసే పెళ్ళాన్ని పట్టుకుని...."

కాంతమ్మలోని వెనుకటి కాంతమ్మలేచి కళ్ళెర్ర చేసింది.

రామానుజంలోని అశాంతి, వెలితికి కారణం తెలిసింది. అతని మనసు దూది పింజలా తేలికై– కళ్ళు అరమూతలు పడసాగినయ్. ఆ తర్వాత మరో పది నిముషాలకు– చాలాకాలం తర్వాత సుఖనిద్ర పోయాడు. □



# సినిమా



న్యాయం మీరే చెప్పాలి' జయసుధ

## "మాయా మోహిని"లో మాయోపాయం

ఆ చిన్న ఇంట్లోకి కన్నెపిల్ల (సిల్క్ స్మిత) ప్రవేశించింది ఓ మూల దగ్గుతూ ఓ అమ్మాయి, పక్కన తల్లి (పి ఆర్ వరలక్ష్మి)ని చూసి, "ఏంటది?" అంది.

తల్లి తల ఎత్తి దీనంగా "ఆ అమ్మాయి వంక ఒకసారి చూసి, "క్షయ వ్యాధమ్మా." అంది.

ఓహో! డబ్బులేక ఈ పిల్ల జబ్బు నయం చేయించలేదా? ఏమండీ, మీరు నా శీలం కాపాడి-ందుకు నా నగలన్నీ ఇచ్చేస్తాను అవన్నీ అమ్మేసి, ఆ అమ్మాయికి వైద్యం చేయించండి ఏం?"

"హు! అయిన దానివీ కాదు, అప్పు రాలివీ కాదు. రాయి ఆడపిల్లవి నువ్విచ్చే నగలు తీసుకోడం ర్మం కాదమ్మా!"

కన్నెపిల్ల క్రీగంట చూసింది " అదా నీ అను-మానం? ఒప్పుకుంటే అయినదాన్నే అవుతాను " తల్లి ప్రశ్నార్థకంగా చూసేసరికి "మీ అబ్బాయిని, అతని పౌరుషాన్ని చూశాక మీ ఇంటి కోడల్ని అవుదామని ఉంది," అంది

"చూడమ్మా! నువ్వెవ్వరో ఏమిటో తెలియకుండా

"జగన్నాథపురం షావుకారు గురవయ్య శెట్టిగారి కూతుర్ని ఇష్టంలేని పెళ్ళి చేస్తుంటే, పారిపోయి వచ్చేశాను మాకు చాలా ఆస్తి ఉంది మరి, మా ఇద్దరికీ పెళ్ళి చేస్తావా?"

అంతవరకు ఆ మాటలు వింటున్న ధర్మన్న (సుధాకర్) "పిచ్చి పిచ్చి వేషాలు వేయకు!" అన్నాడు కన్నె పిల్ల వంక తీక్షణంగా చూస్తూ

గత్యంతరంలేక కన్నెపిల్ల వెనుతిరిగింది "అందాలకే అందాన్ని – నన్నేకాదన్నాడే? పిచ్చి పెళ్ళి చేసుకుని ఈ ఇంట్లో చిచ్చుపెట్టి నా పని సాధించుకుందామనుకున్నాను ఇప్పుడేం చెయ్యాలి? అనుకుంటూ నిష్క్రమించింది

కె సత్యనారాయణ సమర్పణలో కె వి వి సత్యనారాయణ నిర్మించిన రాఘవేంద్ర ఆర్ట్ మూవీస్ మాయామోహిని చిత్రానికి కొమ్మినేని కథ స్క్రీన్ ప్లే సమకూర్చి దర్శకత్వం నెరిపారు జనవరి చివరి వారంలో విడుదలవుతుంది

## శ్రీ సాయి ఇంటర్నేషనల్ "ఎన్‌కౌంటర్"

నేటి యువత ఎదుర్కొంటున్న సమస్యలు భావ సంఘర్షణలు వగైరా కథాంశంతో పై చిత్రం షూటింగ్ డిసెంబర్ 27 నుంచి హైదరాబాద్‌లో జరుగుతుందని మోహన్ కూడా తెలిపారు ఈయన గతంలో మా భూమి పార్ హిందీ చిత్రానికి గౌతమ్ ఘోష్‌వద్ద అసోసియేట్ డైరెక్టర్‌గా పని చేశారు ఈయన కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో మల్లికార్జునరావు నిర్మించే పై చిత్రంలో రూప సాయిచంద్ నాయికా నాయకులు దిలీప్ బెనర్జీ ఛాయ టి వైకుంఠం శిల్పం నిర్వహిస్తున్నారు



# శేషాలు

-జి. వి. జి.

## కొంగర జగ్గారావు సమర్పించే "బ్లాక్ మెయిల్"

"కర్నాటక రాష్ట్రంలో అమోఘ విజయాన్ని సాధించిన సస్పెన్స్ థ్రిల్లర్. భయంకరమైన శంకర-నాగ్ కరాటీ ఫైట్స్, జయమాల, రూపా చక్రవర్తి శృంగార సన్నివేశాలు, గిలిగింతలు పెట్టే హాస్యం పుష్కలంగా ఉన్నాయి," అన్నారు ప్రముఖ కేరెక్టర్ ఆక్టర్ కొంగర జగ్గారావు. ఈయన సమర్పణలో చలసాని కిశోర్ నిర్మించిన అరుణోదయా సినీ ఎంటర్ ప్రైసెస్ "బ్లాక్ మెయిల్" చిత్రానికి భూసారపు మాటలు, రాజశ్రీ పాటలు, ఎం. రంగారావు సంగీతం. చలసాని కరుణ నిర్వహణతో భార్గవ దర్శకుడు.

## "వస్తాద్"లో సవాల్

ప్రతాప్ (భానుచందర్)ను చూడగానే కిశోర్ (గిరిబాబు) హుషారుగా నవ్వుతూ, "కమిన్, హీరో? ఇప్పుడే మన అమర్‌జీతో ఓ అద్భుతమైన డీల్ మాట్లాడాను. ఈ డీల్‌ను మనం సరిగ్గా డీల్ చేస్తే. దీని ఫలితం ఫణిభూషణరావు గుండెల్లో సూటిగా గుచ్చుకుంటుంది. దాంతో వాడిబ్రతుకు బ్రద్దలవు-తుంది," అన్నాడు.

తులసి, చంద్రమోహన్. శ్రీకట్న లీలలు


తులసి, చంద్రమోహన్. "శ్రీకట్న లీలలు"

తెలుగు సంస్కృతి, సాంప్రదాయాలని సమగ్రంగా ప్రతిబింబింపచేసే నవవనితా పక్షపత్రిక కలువబాల! (ఫొటో:- రవిచందర్)

ప్రతాప్ తక్షణంగా చూశాడు. "నేను రాను.... ఇప్పుడే కాదు; ఇంకెప్పుడూ నీతో రాను. మనిద్దరం ఈ రోజే విడిపోతున్నాం."

"ఓ... లక్షలు చేతిలో పడేసరికి ఒంటరిగా వ్యాపారం చేద్దామనుకుంటున్నావా వెళ్ళిపోతున్నావ్?"

ప్రతాప్ సూట్‌కేసు తెరిచాడు. అందులోంచి కొన్ని నోట్ల కట్టలు కిశోర్ పైకి విసురుతూ, "ఇదిగో నీ డబ్బు! నువ్వే తీసుకో.. పగ తీర్చుకోవాలనుకుని నేను నీతో చేతులు కలిపాను. నన్ను నమ్మించి వాడుకుని, నా పగతో నువ్వు వ్యాపారం చేస్తున్నావ్... నా పగ తీర్చుకోవడం కోసం ఒంటరిగా వెళ్ళిపోతున్నాను," అన్నాడు.

"ఆగు నన్ను కాదని బయటకు వెళ్తే బతకలేవు... ఒక్కసారి గుర్తు తెచ్చుకో. ఈ కిశోర్ అడ్డు పడకుండా ఉంటే, ఆ నాడే ఫణిభూషణరావు నిన్ను పట్టుకు. కాల్చినట్టు కాల్చి పారేసేవాడు. నిన్ను రక్షించి, నీకు ఆశ్రయమిచ్చి, నీ పగ తీరేలా చేస్తున్న నన్ను- నా స్నేహాన్నే అవమానిస్తావా? నా అండ నీకు లేదని తెలిసిన మరుక్షణం ఫణిభూషణరావు నిన్ను బ్రతకనివ్వడు.

"చూడు కిశోర్! బ్రతుకు భయంతో నీతో చేతులు కలపడం కన్నా పగతీర్చుకోవడంలో నా ప్రాణాలు పోయినా ఫర్వాలేదు... గుడ్‌బై!" అంటూ ప్రతాప్ విసురుగా వెళ్ళిపోయాడు.

కిశోర్ గుడ్లప్పగించి చూస్తుండి పోయాడు.

ఎం. శ్యామ్‌ప్రసాదరెడ్డి, పి. జనార్ధనరెడ్డి నిర్మించే ఎం. ఎస్. ఆర్ట్ మూవీస్ "వస్తాద్" చిత్రానికి ఎన్. రామచంద్రరావు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్య-తలు వహించారు.



సుహాసిని శోభన్‌బాబు  కొంగుముడి"లో



దొంగల్లో దొర లో సుమన్, విజయశాంతి

# సినిమా

## కోదండరామిరెడ్డి, సుమన్‌లతో "మత్తు  మత్తు... మత్తు"

ఈ జగత్తంతా ఏదో మత్తులో మునిగి తేలుతూంటుంది కొందరికి పదవి మత్తు మరి కొందరిక ఆదికారం మత్తు కొందరికి రాకీయాలు కొందరికి మదువు ఇంకొందరికి మగువ – ఇలా నిత్య-జీవితంలో ఈ మత్తు నిర్వహించే పాత్రను కేంద్రంగా తీసుకుని కద అల్లాను ఈ చిత్ర నిర్మాత వంక రామకృష్ణకు పంపిణీదారుడుగా చిత్ర పరిశ్రమతో పదహేనేళ్ళుగా పరోక్షంగా సంబంధం ఉంది కోదండరామిరెడ్డి దర్శకత్వంలో సుమన్ నటించే మొదటి చిత్రమిది జయసుధ ఒక ప్రత్యేక పాత్రలో మా మ్యూజికల్ డైరెక్టర్ చక్రవర్తి ఒక విశిష్టమైన పాత్రలో కనిపిస్తారు అన్నారు సత్యమూర్తి ఈయన కద మాటలు రాసిన ఎస్ ఎం ఆర్ట్ క్రియేషన్స్ మత్తు మత్తు మత్తు చిత్రం షూటింగ్ డిసెంబర్ 10 న మొదలైంది ఫిబ్రవరికి పూర్తవుతుంది భానుప్రియ అన్నపూర్ణ శ్రీ లక్ష్మి సిల్క్‌స్మిత జయమాలిని వగైరా తక్కిన తారాగణం లోకేసింగ్ ఛాయ భాస్కరరాజా శిల్పం తార నృత్యాలు వెంకటరత్నం కూర్పు బారతీ కల్యాణ్ సహకార దర్శకత్వం మోహన్‌గాంధి నిర్వహణతో ఎస్ వి మోహన్‌రెడ్డి బండార బాస్కర రాజా సహ నిర్మాతలు

ఇది రెండో సారి మునిగిపోవటం- మొదటి-సారి సినిమా తీసి మునిగిపోయాడు!



## కోడి రామకృష్ణ దర్శకత్వంలో ఎస్. గోపాలరెడ్డి చిత్రం

డిసెంబర్ 18 నుంచి 24 వరకు మద్రాసులో ఫస్ట్ షెడ్యూల్ జరిపాం రాజమండ్రి పరిసరాలలో మలి షెడ్యూల్ జనవరి 10 నుంచి 31 వరకు జరుగుతుంది అన్నారు కోడి రామకృష్ణ ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో ఎస్ గోపాల్‌రెడ్డి నిర్మించే భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్ 5వ చిత్రంలో అర్జున్ పూర్ణిమ జై విజయ శుభలేఖ సుదాకర్ శంకర్ రావులు ముఖ్య తారాగణం గణేష్ పాత్రో సి నారాయణరెడ్డి కె వి మహదేవన్ ప్రసాద్‌బాబు కె రామలింగేశ్వరరావు కె సత్యం శివ సుబ్రహ్మణ్యం రావుశ్రీ మజ్జి కృష్ణప్రసాద్ శివాల ప్రభాకరరావు తెర వెనుక కృషి చేస్తున్నారు

బాలకృష్ణ స్మిత ఆత్మబలం



నరేష్ – అరుణ అసాధ్యుడు లో





చిరంజీవి, నూతన్‌ప్రసాద్ పులి



చిత్ర, నరేష్. శ్రీవారి శోభనం

## కొన్ని చిత్రాల పేర్లు,

జయసుధ నాయికగా వేజెళ్ల సత్యనారాయణ కథ స్క్రీన్ ప్లే దర్శకత్వంలో నైజాం ప్రాంతంలో ప్రముఖ పంపిణీదారుడు బి మరిడేశ్వరరావు నిర్మించే చిత్రం 'ఆడ పిల్లలే నయం

గిరిధర్ దర్శకత్వంలో గిరిబాబు సమర్పణలో మంతెన దేవేంద్రరాజు నిర్మించే రాశీ ఆర్ట్ మూవీస చిత్రం అగ్ని పిడుగు

ఎస్ రామచంద్రరావు దర్శకత్వంలో లంక వెంకటేశ్వర్లు నిర్మించే శ్రీ లక్ష్మి శ్రీనివాసా మూవీ క్రియేషన్స్ చిత్రం యముడు

రామాయణ దర్శకత్వంలో అప్పులూరి కొండలరావు నిర్మించే రాశి ఎంటర్ ప్రైసెస్ చిత్రం దయ్యాల మేడ'

## నటుడు నారాయణరావు చిత్రాలు

చరిత్రలోన వెలిగాయమ్మ ఎన్నో దీపాలు–ఝాన్సి రుద్రమ్మ ఇందిర గాంధీలు అన్న ఆత్రేయ టైటిల్ సాంగ్‌కు అర్థవంతమైన అర్థాన్ని చెప్పే చిత్రం తనూ తన సంసారంగా ఉన్న ఓ గృహిణి–నాటి రుద్రమగా మారి చిత్ర విచిత్రంగా ద్రోహులను హతమార్చిన ఓ



"ఇల్లాల్లా! ప్రియురాల్లా!"
అనూరాధ, మురళీమోహన్

వినూత్న కథాచిత్రం ఆత్మ రక్షణ కోసమైనా ఇంటికో రుద్రమ్మ తయారవ్వాలని ప్రబోధించే ఒక డైనమిక్ రోల్‌ను సుజాత అద్వితీయంగా పోషించింది అన్నారు దమయంతీ ఆర్ట్ ప్రొడక్షన్స్ అధినేత నారాయణరావు సుజాతకు భర్తగా పోలీస్ ఆఫీసర్‌గా రంగనాధ్ ఒక గంభీరమైన పాత్రను పోషించారు భానుచందర్ జితేంద్ర ప్రసాద్ సుమలత గిరిబాబు పద్మనాభం రాజీవ్ హేమ-సుందర్ అనూరాధ జయమాలిని దేవి తక్కిన నటవర్గం శోభా చంద్రశేఖర్ కథకు మైలవరపు గోపి సంభాషణలకర్త జి వి రాఘవులు సంగీతం కేశవన్ ఛాయ విజయకుమార్ శిల్పం తరణీరావు సహకార దర్శకత్వం గౌతంరాజు కూర్పు నాగంత్ల సహాయ దర్శకత్వంతో రవికుమార్ నిర్వహణ బాధ్య-తలు వహించే ఈ చిత్రం షూటింగ్ పూర్తయింది స్క్రీన్‌ప్లే దర్శకత్వం ఎస్ ఎ చంద్రశేఖర్

1985 అక్టోబరులో భానుచందర్ హీరోగా బాలు మహేంద్ర దర్శకత్వంలో సుమన్‌తో ఎస్ ఎ చంద్రశేఖర్ దర్శకత్వంలో 1986లో చిరంజీవితో ఒక చిత్రం ఇవికాక ఒక లము బడ్జెట్ చిత్రాన్ని కూడా ప్లాన్ చేసినట్లు నారాయణరావు చెప్పారు

'సంసారం ఓ సంగీతం'లో స్వప్న, శరత్‌బాబు



తిరుగుబాటు"లో సిల్క్‌స్మిత, జగ్గయ్య



The first raindrop on my tongue.
To see a rainbow on the dew.
Flowers sway to a breezy song.
Today is mine. Today is new.



tit bits
MOUTH FRESHENER

Marketed by the National Products, Bangalore.

*Kiss-cool breath. Any place. Anytime.*

Dattaram–VMC 1B/84

## ఎన్. రామచంద్రరావు దర్శకత్వంలో "యముడు"గా భానుచందర్

"ఒక విశిష్టమైన అంశాన్ని తీసుకుని పగ, ప్రతీకారం, యాక్షన్‌లకు ప్రాముఖ్యం ఇస్తూ, ఒక ప్రత్యేకమైన ట్రీట్‌మెంట్‌తో ఈ చిత్రాన్ని అధిక వ్యయ ప్రయాసలకోర్చి రూపొందిస్తున్నాం. ప్రతి పాత్రకూ ఎంతో ప్రాధాన్యత ఉంది. ఒక నిజాయితీపరుడు కుటుంబానికి కొందరు దుర్మార్గులు అన్యాయం చేయడంతో–తన కటుంబానికి, దేశానికే ద్రోహం తలపెట్టిన దుష్ట శక్తులను నాశనం చెయ్యడానికి దుర్మార్గుల పాలిటి 'యముడు'గా నిలుస్తాడు ఆ కమెండో. ఈ పాత్రను భానుచందర్ ఎంతో శ్రద్ధగా శ్రమించి నటిస్తున్నాడు– చిత్రంలో ప్రథమార్థం మిలిటరీ బాక్ డ్రాప్‌లో జరుగుతుంది. కమేండో నిరాయుధుడైనప్పుడు శత్రువుని ఎలా ఎదుర్కోవాలో బోధించే ఆఫీసర్‌గా గిరిబాబు ఒక క్లిష్టమైన పాత్రను అవలీలగా పోషిస్తున్నారు. మిలిటరీకి సంబంధించిన సన్నివేశాలను ఒక రిటైర్డ్ మిలిటరీ ఆఫీసర్‌తో సంప్రదించి చిత్రీకరించాం. హోమ్ మినిస్టర్‌గా ప్రభాకరరెడ్డి, ఐ. జి.గా నర్రా వెంకటేశ్వర్లు, జడ్జిగా పి.జె. శర్మ, వీరి కుమార రత్నాలుగా రాజేంద్ర ప్రసాద్, రాజీవర్మ, సుధాకర్‌లు నటిస్తున్నారు. ఈ చిత్ర నిర్మాత లంక వెంకటేశ్వర్లు తమ ఎస్.ఎల్.వి.మూవీ క్రియేషన్స్ బానర్‌ను ఎస్టాబ్లిష్ చేయడంకోసం ఎంత ఖర్చయినా వెనుకాడకుండా యూనిట్‌లోని వారందరికీ ఎంతో ప్రోత్సాహమిస్తున్నారు." అన్నారు ఎన్. రామచంద్రరావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వెలగపూడి చంద్రశేఖర్ నిర్వహణ బాధ్యతలు వహించే "యముడు" చిత్రంలో సంయుక్త, అశ్విని, సాక్షి రంగారావు, హరిబాబు, చిట్టిబాబు, కావలి రామకృష్ణ, సురేంద్ర, సాంబశివరావు, జానకి, జయ విజయ వగైరా తారాగణం. ఆరుద్ర, ఎన్. రామచంద్రరావు కథకు కొంపెల్ల విశ్వం సంభాషణకర్త. వేటూరి, ఆరుద్ర గీతాలకు జె. వి. రాఘవులు బాణీలు కూర్చారు. ఎన్. ఎస్. రాజ ఛాయ, రంగారావు శిల్పం, సాంబశివరావు సాహసాలు, ప్రకాష్ నృత్యాలు విక్రమ్ సహకార దర్శకత్వం, సత్యనారాయణ ప్రొడక్షన్‌తో సతీష్ కుమార్ సహ నిర్మాత. □



భానుచందర్- అశ్విని, "యముడు"



## ధరలతోపాటే భరణం!

అహమ్మదాబాదుకు చెందిన వారాంగమ్ అనే వూరికి చెందిన మంజులాబెన్ అనే ఆమెకు ఆమె భర్త విడాకులిచ్చి, భరణంగా 275 రూపాయలు నెలకు యిస్తున్నాడట ఈవిడ యీ డబ్బు తనకూ, తన కొడుక్కూ చాలటం లేదని కనుక నెలకు యీ భరణాన్ని 450 గా పెంచాలనీ కోర్టును ప్రార్థిస్తే వారు పాయింటే స్మీ అని వొప్పుకున్నారట 1975 లో యీమెకు భరణం 175 యిచ్చేవాడట భర్త ఆ డబ్బు చాలటం లేదని ఆమె కోర్టుకు ఎక్కి 1978 లో ఆ 175 ను 275 గా మార్పించుకుందట ఇపుడా 275 నూ 450 గా మార్పించుకుందిటీ మహాళ!

## ప్రతిధ్వని మహల్!

అమెరికాలో ఉడ్‌స్టాప్ అనే వో భవనంలో మనం ఒకసారి కేక వేస్తే ఆ కేక 17 సార్లు ప్రతిధ్వనిస్తుందట ఈ ప్రతిధ్వని చక్కగానూ, స్పష్టంగానూ వుంటుందట

## కృత్రిమ కన్నె పొర!

స్త్రీకి కన్నె పొర సామాన్యంగా పురుషునితో ప్రధమ సంగమ మప్పుడే చిరుగుతుందని, కనుక ఆ పొర చిరిగితే ఆమెకు ఆ విషయం ఎప్పుడో, ఎవరితోనో అయిపోయిందని నమ్మే, అనుమానంతో వేధించే భర్తలు యీ కాలంలో కూడా చాలామంది వున్నారు శత కోటి దరిద్రాలకు అనంతకోటి వుపాయా లన్నట్టు యీ పాయింట్ తీసుకుని 'గైనకాల జిస్టులు విజృంభిస్తున్నారుట స్త్రీ యోనిలో కృత్రిమ కన్నె పొరను 'హైమనోప్లాస్టి' అనే ప్రక్రియలో అమర్చి ఏ స్త్రీ నయినా కన్యగా సర్టిఫై చేసి పారేస్తున్నారట డాక్టర్లు – బ్రహ్మకు ప్రతి సృష్టి విశ్వామిత్రుడు చేస్తే – వీరిద్దరినీ యీనాడు చాలెంజ్ చేస్తున్నారో

## ఏ. సి. మేజోళ్లు

అమెరికా వంటి దేశాలలో కాళ్లకు తొడుక్కునే సాక్స్, మేజోళ్లు యిపుడు ఎయిర్ కండిషనున్నవి వస్తున్నాయట ఈ సాక్స్ వేసుకుంటే వేసవిలో కాలికి చల్లదనం, సీతలిలో వెచ్చదనమూనట – అహో అమెరికా!

## మేడ పైనించి దూకి ఆత్మహత్య!

బొంబాయి 'నరీమన్ పాయింటు'లో వున్న వో ఏడంతస్తుల మేడ మీంచి 30ఏళ్ళ బాలు దుగ్గరామ్ పాట అనే ఆయన రివ్వున క్రిందకు వురికి, ఆత్మహత్య చేసుకున్నారట ఈయన ఓ ప్రయివేటు కంపెనిలో మెనేజరుగా పని చేస్తున్నారట ఈయన ఆత్మహత్యకుగల కారణమేమిటో యింకా బయల్పడలేదట

## కల్లు తాగించి ఎనిమిదేళ్ల బాలికపై అత్యాచారం!

చిత్తూరు జిల్లా సత్యవేడు తాలుకా వరదయ్య పాలెంకు చెందిన మునిరాజా అనే వో రజకుడు తన అన్న కూతురు సంపంగి అనే ఎనిమిదేళ్ళ అమ్మాయి మీద కామోద్రేకంతో ఆమెకు కల్లు పట్టించి, బట్టలన్నీ వూడదీసి, తన వాంఛ నెరవేర్చుకున్నాట్ట పాపాత్ముడు – కాదు కామాత్ముడు

## కళ్ల గంతలతో ఘాట్ రోడ్డుపై మోటారు సైకిలు నడిపిన ఘనుడు!

జనవరి ఒకటవ తేదీన షాదో అనే పేరు గల వో యువకుడు తాను కళ్ళకు గంతలు కట్టుకుని తిరుమల కొండపైకి మోటారు సైకిలు తోలుతూ ఎక్కి దిగుతానని చెప్పాడట అతని కళ్ళు పకడ్బందీగా పద్మావతీ విశ్వ విద్యాలయం రిజిస్ట్రారు రంగయ్య నాయ్డు కట్టారట ఆనకో నల్లని ముసుగు తొడిగారట ఆ షాదో కళ్ళతో చూస్తూ నడిపినంత వేగంగానూ మోటారు సైకిలు నడుపుతూ రద్దీని, ట్రాఫిక్ రూల్సునూ చూసుకుంటూ కొండ ఎక్కి, దిగి వచ్చాడట కళ్ళ గంతలతో ఘాట్ రోడ్డులో మోటారు సైకిలు నడిపిన మొట్ట మొదటి వ్యక్తిని నేనే అన్నార్ట ఆయన – వేరీజ్ గిన్నిస్ బుక్? □




## (గత సంచిక తరువాయి)

ఆ సాయంత్రం వచ్చిన దగ్గర్నుండి తల్లితో వంటరిగా మాట్లాడాలని యెంత ప్రయత్నించినా సాధ్యం కాలేదు కృష్ణచైతన్యకు చిట్ట చివరకు వెనక్కు కరివేపాకు కోసం ఆమె వెళ్తే వెంబడించాడు

'అమ్మా ఆ అమ్మాయి మన ఇంట్లో వుంటున్నప్పుడు మన పిల్లలాగానే వుండాలి బంధువులైనా మిత్రులైనా యెవరో అనాథను తెచ్చారు, యింట్లో పని చేయించుకుంటున్నారు అని అనుకోగూడదు ప్రభాతకైనా అలాంటి భావన కలుగకూడదు, అన్నాడు

అతనికి వుదయం నుండీ తల్లిని నొప్పించానేమోనని కలవరంగా వుంది అతని కలవర పాటును ప్రభావతమ్మ గ్రహించి నవ్వుకుంది ఆమెకు ఆ మధ్యాహ్నం జరిగిన విషయం తెలిసింది కృష్ణచైతన్య అలా యెందుకు మాట్లాడాడో గుర్తించగలిగింది భోజనాలయ్యాక జయశ్రీ తీరిగ్గా తల్లితో ముచ్చటలాడుతూ కూర్చుంది అక్కడకు తప్పనిసరై వచ్చింది ప్రభాత ఆమె ఉదయం నుండీ తనను తప్పించుకు తిరగటం గ్రహించింది జయశ్రీ అందుకే ప్రభాత ఆ గదిలోకి రాగానే చప్పున ఆమె చెయ్యి పట్టుకుని "సారీ అమ్మా ప్రభాత, నిన్ను నొప్పించినట్లున్నాను" అంది

"అదేంలేదు పిన్నీ" అంది ప్రభాత ఆమెతో పూర్వం నుండీ పరిచయం వున్నదానిలా

ఈ సంభాషణాసారం యేమిటో ప్రభావతమ్మకు బోధపడలేదు ఆ తరువాత జయశ్రీ చెప్పింది అసలు విషయం

ఆ విషయం విశదీకరించి జయశ్రీ యెంత బాధపడిందో చెప్పింది ప్రభావతమ్మ కొడుకుతో

"అది సరే బయటవాళ్ళు కూడా " అన్నాడు అర్ధోక్తిలో ఆపేస్తూ

'నేనేం చెయ్యనురా కృష్ణా ఆ పిల్ల వినిపించుకోదు పనిలేకపోతే తోచదట'

> జరిగిన కథ-5 : రామస్వామి, ప్రభావతమ్మ దంపతుల పెద్ద కొడుకు కృష్ణచైతన్య. అక్క, కూతుర్ని రాజ్యలక్ష్మికి సీరియస్‌గా ఉందని తెలిసిన ప్రభావతమ్మ ఆమెను చూసేందుకు బయలుదేరివెళుతుంది. బస్సులో ఆమెకు గతం అంతా గుర్తుకు రాసాగింది. ప్రభావతమ్మ వెళ్ళేటప్పటికి రాజ్యం స్థితి చాలా దీనంగా ఉంది. భర్త పోయిన రాజ్యాన్ని ఆ స్థితిలో చూచేటప్పటికి ప్రభావతమ్మకు ఆపుకోలేని దుఃఖం వచ్చింది. రాజ్యలక్ష్మి కూతురు ప్రభాత. రాజ్యలక్ష్మి చనిపోయింది. ప్రభాతను తీసుకొని ప్రభావతమ్మ తన ఇంటికి వచ్చేసింది. రామస్వామిగారు తమ ఇంట్లో ప్రభాతను కొంతకాలం ఉంచుకోవటానికి అంగీకరించారు. ప్రభావతమ్మ రెండవ కూతురు రాధను ప్రభాత తన రూములో ఉండటం ఇబ్బంది పెట్టింది. ప్రభావతమ్మ పెద్ద కూతురు జయశ్రీ పండక్కి వచ్చింది. ఆమె తమ ఇంట్లో ఉన్న ప్రభాతను పనిపిల్ల అనుకొంటుంది. కృష్ణచైతన్యకు ఈ విషయంలో కోపం వచ్చింది.

'పని సంగతి సరేనమ్మా, ఆ అమ్మాయి బట్టలను చూడు నువ్వెళ్ళి రేపు కొంచెం మంచి బట్టలు తీసుకురా అన్నాడు

సరేలే'

ఆ మరునాడు కృష్ణచైతన్య ప్రభావతమ్మ చేతిలో డబ్బు పెడ్తుంటే యెందుకురా?" అంది ఆశ్చర్యంగా

'ప్రభాతకు బట్టలు

ఆమె ఆ విషయమే మర్చిపోయింది

'అయినా నువ్వెందుకిస్తావు నా దగ్గరున్నాయిలే అంది

'నీ దగ్గర వుండనియ్యి, ఇవి వుంచు అన్నాడు'

అలా అంటున్న కొడుకును అయోమయంగా చూచింది ఆమెకు ఎన్నో వూహలు కలిగి త్రుటి కాలంలోనే యెగిరిపోయేయి జయశ్రీ వున్న నాలుగు రోజులూ ప్రభావతమ్మకు బజారు వెళ్ళను కుదరలేదు. ఆమె వెళ్ళినాక మరో రెండు రోజులు కూడా వీలు కాలేదు కొడుకుచేత మరోసారి చెప్పించుకోవటం ఆమెకు ఇష్టంలేదు రాధను పిలిచి ఆ పని కాస్త చేసి పెట్టమని వేడుకుంది ఎవరికోసం అయినా రాధకు షాపింగ్ అంటే అంతులేని యిష్టం సంతోషంగా అంగీకరించింది బయలుదేరు బజారు వెళ్దాం' అంది ప్రభాతతో

ఆమె వెళ్ళి మాట్లాడకుండా కూరగాయల బుట్ట తెచ్చింది. ఆమె వచ్చాక బజారుకు వెళ్ళి చేసిన షాపింగ్ కూరగాయలు, పండ్లు, వెచ్చాలు మాత్రమే రామూని తీసుకువెళ్ళడం అలవాటయ్యింది ఎప్పుడైనా సాయంత్రాలు రాధ వారితో కలుస్తుంది అలాగే ననుకుని కూరలబుట్ట తెచ్చింది ప్రభాత

రాధ పకాల్న నవ్వుతూ కూరల బేరం కాదు తమకు నూతన వస్త్రాలు అంది

'నాకా?' విస్తుపోయింది

"అవును నీకే అలాగని శ్రీమాన్ పెద్ద మామయ్యగారు ఆదేశించారు

"మామయ్యా?' అంది 'నా కోసమా? అనుకుంది

పదే పదే ఆ విషయాన్ని మననం చేసుకుంది తలచుకున్న కొలదీ ఆనందం అధికమయ్యింది "మామయ్య నా విషయం ఆలోచిస్తున్నాడు అని అనుకుంటుంటే నిర్వచించలేని సంతోషం కలుగుతుంది ఆ సంతోషం కలిగిస్తున్న భావనకు మూలం యేమిటో స్పష్టంగా తెలుసుకునేటంతగా ఆమె యెదగలేదు ఆమెకు మామయ్య పట్ల వున్న భావం కృతజ్ఞతో, ఆరాధనో మరేమిటో రోజు రోజుకూ బలపడుతుంది ఆమెకు ఆ భావం కలగడానికి కూడా కారణం వుంది జయశ్రీ వెళ్తూ వెళ్తూ ఓ ప్రపోజల్ లేవదీసి వెళ్ళింది "అమ్మా! ప్రభాతను నాతో పంపించరాదూ! ఆయన హాస్పిటల్‌కు వెళ్తే నే నొక్కదాన్నే చచ్చి పోతున్నాను " అంటే ప్రభావతమ్మ జవాబేమీ యివ్వలేక పోయింది వెంటనే

తరువాత 'నాదేముంది? అంది

ఆ తరువాత భర్తతో చెప్పి 'యేమంటారు? అనడిగింది

పంపించు ఎక్కడైతేనేమిట? జయశ్రీకి కూడా తోడుగా వుంటుంది అన్నారాయన

ప్రభాతను జయశ్రీతో పంపించడానికి సన్నాహాలు ప్రారంభ మయ్యాయి అప్పుడుగాని కృష్ణ చైతన్యకు యీ విషయం తెలియలేదు

నీతో చెప్దాం అనుకుంటే రాత్రంతా నువ్వు వ్రాసుకుంటూ కూర్చున్నావు అంది ప్రభావతమ్మ అతనితో

కృష్ణ చైతన్యను సంప్రదించకుండా యే పనైనా చేయడం ఆమెకుగానీ రామస్వామిగారికిగానీ అలవాటులేదు

"నన్ను కాదు సంప్రదించాల్సింది ఆ అమ్మాయికి యిష్టం ఔనో కాదో తెలుసుకున్నావా?"

అతను ఎత్తి చెప్పే వరకూ ప్రభాత అభిప్రాయం తెలుసుకోవాలనీ, 'అసలు తనకంటూ ఆమెకో అభిప్రాయం వుంటుందని యెవ్వరికి తట్టలేదు

'లేదురా ఎక్కడైతేనేమి అన్నారు మీ నాన్న'

అనాథ అయినా, అడుక్కునే వ్యక్తి అయినా కూడా ప్రతి మనిషికీ ఒక మనసు, ఆ మనసుకు ఆలోచనా, యిష్టాయిష్టాలు వుంటాయి కనీసం మనకు సాధ్యమైనంత వరకూ ఎదుటవారి అభిప్రాయాన్ని మన్నించ గలగాలి" అన్నాడు

'ఇందులో అంత పెద్ద విషయం యేముందిరా నీ ఎదుటే అడుగుతాను ప్రభాతా ప్రభాతా "

ఈ సంభాషణ అంతా తన గదిలో కూర్చుని ప్రభాత, రాధ గదిలో కూర్చున్న రాధ, జయశ్రీ వింటూనే వున్నారు

"పందెం కాస్తాను ప్రభాత నీతో రాదు " అంది రాధ

"అంతేనంటావా?" అంది జయశ్రీ

ప్రభాత భయపడుతూ వచ్చింది ఆమెకూ పరిస్థితి చాలా యిబ్బందిగా వుంది



# వెలుగు బావుటా

ఒక మెట్టు పైకెక్కితే –
వంద మైళ్ళ విశాల ప్రకృతి! రంగులు
వరంగా గోచరిస్తాయి
ఆకాశపు టంచులు కనిపిస్తాయి
ఒక మెట్టు క్రిందికి దిగజారితే –
కూపస్త మండూకమౌతావు! చీకటుల
శాపగ్రస్త జీవితం తప్పదు
పాతాళపు టంచులు కనిపిస్తాయి
పైకి చూడు, పేరుకున్న
చిమ్మ చీకటి ఎంత ఉన్నా
వెలుగు బావుటా ఎగురుతున్నట్టుగా –
వెలిగే తారలు దారి చూపుతూ
కనుల వెలిగిస్తాయి తమ్ముడూ!

—కాశీపాకం లింగన్న

# మౌన విపంచి

జయతో వెళ్ళటం ని కష్టమేనా తల్లీ అంది ప్రభావతమ్మ సౌమ్యంగా

చెప్పమ్మా '

"చెప్పు నీ కిష్టమైతేనే వెళ్ళు ' అన్నాడు కృష్ణచైతన్య

ప్రభాత కళ్ళెత్తి అతన్ని చూసింది ఆమె చూపులు అతనికేమి చెప్పాయో,

"నువ్వెళ్ళి నీ మామూలు పని చూసుకో నువ్వెక్కడకూ వెళ్ళటంలేదు అన్నాడు

ప్రభాత అమ్మమ్మను చూచింది బెదురుగా

ఆమె ఔనన్నట్టు సంజ్ఞ చేయటంతో నెమ్మదిగా అక్కడ్నుంచి కదిలిపోయింది

విన్నావుగా" అంది రాధ

"ప్రభాత యేమి చెప్పిందే? అన్నయ్యే మాట్లాడాడు '

'ఆ అమ్మాయి యేం చెప్పుందమ్మా తనకు యింత చోటు యిస్తే చాలనుకుంటుంది పైగా తన యిష్టాలను చెప్పమంటే యేం మాట్లాడు-తుంది ' అన్నాడు

ఈ ప్రపంచంలో మామయ్యే లేకుంటే బ్రతుకెంత దుర్భరంగా వుండేదో ' అనుకుంది ప్రభాత

అయినా జయశ్రీ ఆశ వదులుకోలేదు వెళ్ళబోతూ చివరిసారిగా ప్రయ-త్నించింది అక్కడకొస్తే మీ చుట్టాలందరూ కనుపిస్తారు వాళ్ళంతా మీ బాబాయి దగ్గరకు వైద్యానికి యెప్పుడో వొకప్పుడు వచ్చి పోతుంటారు ' అంది

ప్రభాత తలదించుకుని మౌనం వహించింది

ఏం, వస్తావా? ఆశగా అడిగింది జయశ్రీ

తను రాదుగాని నువ్వెళ్ళు జయా చుట్టాలంటే పడ్డాలని ప్రభాతకో గట్టి నమ్మకం ' అన్నాడు కృష్ణచైతన్య

అతని మాటలకు అందరూ నవ్వారు మామయ్య నేనంటే యెంత శ్రద్ధ వహిస్తాడు! అమ్మమ్మ కన్నా యెక్కువ ఆదరిస్తాడు అనుకుంది ప్రభాత

* * * *

ప్రభాత తన వేషాలంకరణలో మార్పు వహించింది రెండు జడలు మానేసి ఒక్క జడ వదులుగా వేసికోవడం నేర్చింది చేతికి మట్టి గాజులు తీసేసి వెడల్పాటి గాజు చేతి కొకటి వేసుకో నారంభించింది చీరె కట్టుకోవడం నేర్చుకుని రాధతో వెళ్ళి తెచ్చుకున్న చీరెలు కట్టుకుంటోంది పొడవాటి బొట్టు మానేసి గుండ్రటి బొట్టు పెట్టుకుంటోంది అంతేగాకుండా అన్ని విధాలా ఆ యింటి జీవన విధానానికి అలవాటు పడసాగింది

ఈ మార్పును ముందుగా గుర్తించినవాడు కృష్ణ చైతన్య ఇంకా మారాలి అని కూడా అనుకున్నాడు

పేరుకు లైబ్రరీ గదిని తనది చేసికుంది గానీ ప్రభాత ఆమెకు అది యెంతో యిబ్బందిగా వుంది ఒక్కొక్కసారి కృష్ణ చైతన్య అర్ధ రాత్రి వరకూ చదువు కుంటూనో, వ్రాసుకుంటూనో గడపుతాడు అతను అక్కడ వుండగానే పడుకోవాలంటే సిగ్గుగా వుండేది ఆమెకు అయితే ఆమె యిబ్బందిని కృష్ణ చైతన్య గమనించలేదు గమనిస్తే అందుకు తగిన యేర్పాటు చేసేవాడు

ఒకరోజు ప్రభావతమ్మతో తన యిబ్బంది చెప్పుకుని "నేనా మెట్ల గదిలో పడుకుంటాను అమ్మమ్మ అంది

ప్రభావతమ్మ హాయిగా నవ్వి చిన్న పిల్లవు నీ కింత సిగ్గైతే యెలా?' అంది

భ్రబాత మాటలకోసం తడుముకుంటూ 'మామయ్యకు డిస్ట్రబెన్స్ అనీ' అంది

"నువ్వు నిద్ర పోయాక యింకేమి డిస్ట్రబెన్స్? చేతిలో పుస్తకం వుంటే వాడీ లోకంలో నే వుండడు "

ఒకరాత్రి కృష్ణ చైతన్య పన్నెండు వరకూ చదువుకుంటూ కూర్చున్నాడు మధ్యలో మూలుగు వినిపించింది మొదట అతడు పట్టించుకోలేదు కానీ బాధా తప్తన ఆ మూలుగు అంతకంతకూ అధికం కావడంతో తలెత్తి చూశాడు

ప్రభాత నిద్ర, మెలకువ కానీ అవస్థలో వుంది

రెస్ట్‌లెస్‌గా మంచంమీద పొర్లుతూంది

'ఏమైంది ప్రభాత?' అన్నాడు అక్కడ్నుంచి కదలకుండా

మూలుగు

లేచి దగ్గరకు వెళ్ళాడు

ప్రభాత బలవంతంగా కళ్ళు విప్పి చూచి వెంటనే మూసుకుంది

"ఏమిటి?'

తల పట్టుకు చూపించింది

తలనొప్పా?'

'ఒళ్ళంతా.'

అతడు వొంగి ఆమె నుదురు తాకి చూశాడు

వేడిగా వుంది

పొట్ట చూశాడు మాడిపోతూ వుంది,

"హై టెంపరేచర్ అనుకున్నాడు

డాక్టరు దగ్గరకు వెళ్దామా?'

రేపు

తన గదిలోకి వెళ్ళి రెండు టాబ్లెట్స్ తెచ్చిచ్చాడు. ఆమె లేవడానికి సహాయం చేసి మంచి నీళ్ళు గ్లాసు అందించాడు

మూసుకుపోతున్న ఆమె కళ్ళనిండా కృతజ్ఞత, ఆరాధనను గుర్తిం-చాడు

మెల్లగా ఆమెను మంచం మీదికి వాలుస్తూ టేక్ రెస్ట్" అన్నాడు

# పాలు మాత్రమే తీసుకుంటున్న మీ పాప ఘన పదార్థాలకి సులభంగా మారేలా చూడండి...

# నెస్టమ్: సున్నితమైన మార్పు కోసం ప్రత్యేకంగా రూపొందించిన బేబీ సీరియల్

మీ పాపకి మీరు ఎంతో మంచి ఆహారం యివ్వాలనుకుంటారు. అందుకే మీరు పాపకి చనుపాలు యిస్తారు. మీరు యివ్వగలిగిన వాటిలో ఎంతో పోషకత్వం కలిగి, సులభంగా జీర్ణమయ్యే ఆహారం అదే.

పాపకి నాలుగు నెలలు నిండాక, పాపకి ఆహారంలో ఘన పదార్థాలు కావాలి. కాని పాప జీర్ణం చేసుకునే విధానం యింకా సున్నితంగా వుంటుంది. అందుకే పాపకి సులభంగా జీర్ణమయే సీరియల్ కావాలి. నెస్టమ్ వంటిది.

బియ్యంతో తయారు చేయబడినది కావడంతో నెస్టమ్ మొదటి ఘన పదార్థంగా సరియైనది. పోషకాహార నిపుణులు సీరియల్‌లలో ఎంతో సులభంగా జీర్ణమయే దానిగా దీనిని అంగీకరిస్తారు.

పాలతో కలిపి తయారు చేసినప్పుడు నెస్టమ్ పోషణ శక్తి విషయంలో పరిపూర్ణమైన ఆహారం. అత్యవసరమైన పోషక పదార్థాలన్నీ అందులో ఉంటాయి. అందులోని విటమిన్‌లు మీ పాప చర్మానికి మెరుపు, కళ్ళకు కాంతి యిస్తాయి. పాప రోగ నిరోధక శక్తి పెరుగుతుంది. నెస్టమ్‌లో, ఆరోగ్యవంతమైన రక్తం కోసం ఇనుము, దృఢమైన ఎముకలు, పండ్ల కోసం కాల్షియం కూడా ఉన్నాయి.

పాలతో కలిపిన నెస్టమ్ బహు ఉపయోగకారి. ఉడకబెట్టిన పండ్లతోను, వండి, గుజ్జుగా చేసిన కూరగాయలతోను, పప్పులతోను కూడా కలిపి తినిపించవచ్చును.

ఇక మీ డాక్టర్‌ని సంప్రదించి మీ పాపకి నెస్టమ్ ఇవ్వడం ప్రారంభించండి.

## ఉచితం!

మీ పాప తన ఆహారంలో మార్పుకి ఇష్టపడతాడు. కాబట్టి ఉచితంగా లభించే నెస్టమ్ వంటల ఫోల్డర్ కోసం వ్రాయండి!

నెస్టమ్
పోస్ట్ బాక్స్ నం. 6016 న్యూ ఢిల్లీ-110 008.






ఇనుము, విటమిన్‌లతో బలపరచబడింది

తయారు చేయడం సులభం



ముందుగా మరిగిన వెచ్చని పాలు పోయండి



నెస్టమ్ వేసి కలపండి



తినిపించడానికి తయారు

# నెస్టమ్®

## బేబీ సీరియల్

పాలతో కలపండి

NESTLÉ®

# మౌన విపంచి

'అమ్మా అమ్మా

ఇప్పుడు అమ్మ లేదనీ, అది తన యిల్లు కాదనీ ఆమెకు తెలుసు అయినా నిగ్రహించుకోలేని బాధతో కణతలు నొక్కుకుంది

"తలనొప్పా?"

'ఊఁ"

"నువ్వు నిద్రపో "

అతడు నిస్సంకోచంగా ఆమె ప్రక్కన కూర్చున్నాడు బలమైన అతని చేతులు ఆమె తలను పట్టసాగాయి ఆమె మెల్లగా నిద్రలోకి, మందు కలిగించిన మత్తులోకి జారుకుని బాహ్య ప్రపంచ జ్ఞానాన్ని కోల్పోయింది

ఆమెను ఆ స్థితిలో చూస్తుంటే ఆమె వచ్చిన నాటినుండీ అతని గుండెల్లో నిక్షిప్తమైవున్న ఆమె పట్ల అతనికి కలిగిన భావోద్రేకాలు వెల్లువలా బయటకు వచ్చి అతన్ని వుక్కిరి బిక్కిరి చేస్తున్నాయి ఆమె తానొక అనాధ ననుకుంటుంది ఒదిగొదిగి భయం భయంగా ప్రవర్తిస్తూ వుంటుంది ఆమెకు అత్యంత విలువైన ఆత్మీయతను అందివ్వాలనీ, యీ ప్రపంచంలోని సర్వ సౌఖ్యాలను కలిగించి ఆమె వ్యధను పొగొట్టాలనీ అతనెప్పుడూ అనుకుంటూ వుంటాడు

ప్రభాత గాఢ నిద్రలోకి పోయేవరకూ ఆమె తల నొక్కుతూనే ఉన్నాడు తరువాత లేచి ఆమెను తదేకంగా పరీక్షించి తృప్తి చెంది తిరిగి తన టేబిల్ వద్దకు వచ్చాడు

ఆ రాత్రంత్రా అతను నిద్ర పోలేదు

ప్రభాత మధ్య మధ్య రెస్ట్‌లెస్‌గా కదులుతూనే ఉంది ఆమెకు కావలసినవి యిస్తూ, ఆమెకు హాయిని కలిగిస్తూ ఆ రాత్రి గడిపాడు తూర్పున చీకటిని చీల్చుకుంటూ వెలుగు రేఖలు జగతిని ఆక్రమిస్తున్న సమయాన టేబిల్‌మీద తల వాల్చాడు బరువెక్కిన రెప్పలు వాలిపోయాయి ఇంకా గదిలో లైటు వెలుగుతూండటంతో అప్పుడే లేచిన ప్రభావతమ్మ వచ్చి చూచింది

ప్రభాత మెద వరకూ దుప్పటి కప్పుకుని హాయిగా నిద్ర పోతోంది కృష్ణ చైతన్య టేబిల్‌పై తల వాల్చి కలత నిద్రలో ఉన్నాడు

అతని తల ముందు తెరచిన పుస్తకం

"పిచ్చి నాగన్న, చదువుతూ చదువుతూ నిద్రపోయాడు' అనుకుంటూ-- 'నాన్నా కృష్ణా, లే, లేచి నీ గదిలో పడుకో తెల్లవారింది" మెల్లగా, మెత్తగా నిద్రాభంగం కలిగించింది. ఆమె ఎంత మెత్తగా లేపినా అతడు ఉలిక్కిపడి లేచాడు కళ్ళు నులుముకుంటూ "ప్రభాతకు ఎలా ఉందమ్మా?' అన్నాడు

'ప్రభాతకు ఎలా ఉండట మేమిటి? అది సుఖంగా నిద్ర పోతోంది అసలు నీకెలా ఉంది?' ఒంగొని అతని నుదురు తాకింది

"రాత్రంతా ఆ అమ్మాయికి జ్వరం అమ్మా! విపరీతమైన జ్వరం' అంటూ లేచి ప్రభాత మంచం వద్దకు వెళ్లాడు ఆమె చెయ్యి, నుదురు పట్టుకుని చూసాడు రాత్రిమీద జ్వరం బాగా తగ్గింది అయితే నార్మల్‌కు వచ్చినట్లు లేదు -

ప్రభావతమ్మ కొడుకుని అనుసరించింది. "అయితే నువ్వు రాత్రంతా నిద్ర పోలేదన్నమాట" ఆమె కంఠంలో ప్రభాత జ్వరం కన్నా కొడుకు నిద్ర పోలేదన్న బాధని గమనించగలిగాడు కృష్ణ

ఆ తల్లి మనసులో కొడుకును గురించిన అనుమానపు ఊహలు

"నన్నెందుకు లేపలేదురా?"

"అర్ధ రాత్రి ఎవ్వరైనా ఏమి చేస్తారమ్మా?"

"ఉహూఁ లేదు నువ్వు ఆ అమ్మాయిని ఒకసారి డాక్టర్ వద్దకు తీసుకెళ్ళు "







మరింకేమీ మాట్లాడకుండా తన గదిలోకి వెళ్ళిపోయాడు అలవాటు ప్రకారం స్నానం చేసి హాల్లోకి వచ్చాడు తల్లి యిచ్చిన కాఫీ త్రాగి పేపరు తీసుకున్నాడు రాత్రి నిద్రలేక బడలికగా ఉన్న కృష్ణ చైతన్య సెలవుపెట్టి యింట్లోనే ఉన్నాడు టిఫిన్ చేసి హాయిగా నిద్రపోయాడు

"అన్నయ్యేమిటి–ఈరోజు సెలవు పెట్టాడు ఈరోజు ప్రొద్దు ఎటు పొడిచిందమ్మా?" అంటున్న రాధను చికాగ్గా చూడటం తప్పించి ఏమీ చేయలేక పోయింది ప్రభావతమ్మ

తనను పలకరించడానికి వచ్చిన కృష్ణ చైతన్యను చూసి సిగ్గు పడింది ప్రభాత బాధలో ఆ రాత్రి తాను చిన్న పిల్లలా గొడవ చేయడం తలుచుకుంటూ అతని చూపులో చూపు కలపాలంటే సంకోచంగా ఉంది

ఎలా ఉంది?'

కళ్ళు వాల్చుకుంది

అతను నవ్వుకున్నాడు

'జ్వరం కొంచెం తగ్గింది మరి తలనొప్పి?" అతడు ఎంత మామూలుగా అడిగినా ఆమె చెవుల్కను ఆ ప్రశ్నలో కొంటితనం విన్పించింది

అతి ప్రయత్నంమీద కనులు ఎత్తి చూసింది

అతని గంభీరవదనం చూస్తే అతడు చిలిపిగా ప్రశ్నించాడన్నది కేవలం తన భ్రమేమో అనుకుంది

అతని చూపులో చూపు కలిపిన ఆమె విశాలమైన కనుదోయి అతని కెన్నో భావాలను మనసు విప్పి చెప్పాయి.

'ఎందుకు రాత్రి అలా కలవరించావు?'

నేనా? ఏమని?'

నా కెవ్వరూ లేరని

అతడా మాట అంటుండగానే ఆమె కళ్ళలో నీరు చిప్పిల్లాయి తన బాధను దాచుకునే ప్రయత్నం ఆమె చేయలేదు తల్లి పోయిన దుఃఖాన్ని దిగమ్రింగిందే కాని ఆ శోకం తీరలేదు అంతరాల్లో నిలచిన బాధ సమయం వచ్చినప్పుడు ఆమెను ముంచెత్తుతూనే ఉంది ఆ బాధను పంచుకోవడానికి తనకో స్నేహమయి కావాలి సేదతీరడానికి చల్లని హృదయం కావాలి

ఏ హృదయం ఆ స్నేహాన్ని యివ్వగలదో ఆమె నిష్కల్మషమైన మనసు గ్రహించింది

అతడు ముందుకు వంగి లాలిస్తున్నట్లు ఆమె తల నిమురుతూ "టేక్ రెస్ట్ నీకు అందరూ ఉన్నారు" అన్నాడు

ప్రభాతకు జ్వరం నాలుగు రోజుల్లో తగ్గింది వారం రోజులకు మామూలుగా లేచి తిరుగుతూంది

* * * * *

ప్రతి రోజు పెందలకడనే నిద్ర లేస్తుంది ప్రభావతమ్మ అదే అలవాటు కృష్ణ చైతన్యకు వచ్చింది ప్రభావతమ్మ లేచి రామూను లేపుతుంది వాడు వెళ్ళి పాలు తీసుకుని వచ్చేసరికి తల్లీ, కొడుకులు స్నానాలు ముగించు-కుంటారు వెంటనే ప్రభావతమ్మ కాఫీ కలుపుతుంది కబుర్లు చెప్పుకుంటూ కాఫీ ముగిస్తారు కాఫీలు అయిన వెంటనే రీడింగ్ రూమ్‌లోకి వెళ్ళడం కృష్ణ చైతన్య అలవాటు కానీ ఒక్కోసారి తల్లితో చాలసేపు బాతాఖానీ వేస్తాడు

చదువుకునే రోజుల్లో తప్పదు ఇంకా తెల్లవార్లూ ఆ చదువు ఏమిటి కృష్ణా" అనే తల్లి మాటలకు సమాధానంగా నవ్వేస్తాడు

'చదువుకు అంతం ఏముందమ్మా! అదో కసాగరం!" అంటాడు

"ఏమోనయ్యా! రాత్రిళ్ళు ప్రొద్దు పోయేవరకూ మేలుకోకు

అదెలా సాధ్యం? చేతిలోకి పుస్తకం తీసుకొన్నాక అంత తేలిగ్గా నిద్ర ఎలా వస్తుంది? అతను ఇంగ్లీషు సాహిత్యం చదువుతుంటే సర్వ జగత్తునూ మరిచి గ్రంథ పఠనంలో నిమగ్నుడౌతాడు

ఇటీవల వారి ఉదయ కార్యక్రమంలో ప్రభాత కూడా పాలు పంచుకుంటూంది ఆమెకు కూడా ఉదయమే నిద్ర లేవడం అలవాటు పైగా కృష్ణ చైతన్య లేవగానే లైబ్రరీ రూమ్‌లోకి వస్తాడు అందుకని ఎట్టి పరిస్థితుల్లోనూ ఆమె ఆలస్యంగా లేవదు తాను జ్వర పడిన వారం రోజులూ అతను అదే రూమ్‌లో కూర్చుని ఉండగా తాను పడుకుని ఉండటానికి సిగ్గు పడింది బాగా ప్రొద్దెక్క గానీ రాధ, రామస్వామిగారు లేవరు వారు నిద్ర లేచాక వాతావరణం మారిపోయినట్లు ఫీలవుతుంది ప్రభాత కుటుంబ విషయాలు గానీ, వ్యాపార విషయాలు గాని వారు మాట్లాడుకుంటున్నా విననట్లు ఊరుకుంటుంది

ఆ రోజు శుక్రవారం కావడంతో ప్రభావతమ్మ మందలిస్తున్నా విన్పించుకోకుండా తల స్నానం చేసింది రాధతో వెళ్ళి తెచ్చుకున్న చీరల్లో ఒకటి తీసి కట్టుకుంది ఎర్ర గులాబీ ఒకటి జడలో అమర్చింది.

కృష్ణ పైన స్థలంలో పూల మొక్కలు పెంచుతున్నారు సిమెంటుతో పొడవుగా మట్టి పోయడానికి అనువుగా కట్టించాడు అక్కడక్కడ కార్నర్స్‌లో ప్లాస్టిక్ పాట్స్ పెట్టించాడు గులాబులు, చామంతులు, లిల్లీ వివిధ రకాలైన లతలు పెంచుతున్నాడు ఇంటి వెనుక వైపున స్థలంలో మామిడి, అరటి, కరివేపాకు, జామ మొదలైన చెట్లున్నాయి ముందు భాగాన లాన్ దాని చుట్టూ మెట్ట తామర, గులాబులు, యితర పూల చెట్లు పెంచాడు ఆ లాన్ మధ్య ఒక చక్కని ఫౌంటెన్ కట్టించాలన్నది అతని ఉద్దేశ్యం ప్రతి నిత్యం ఒకటి రెండు గంటలు గార్డెనింగ్ చేస్తే నే గాని కృష్ణకు తృప్తి తీరదు అలా మొక్కలతో, చెట్లతో కాలక్షేపం చేసే అతన్ని నందకిశోర్




## బండ క్రింద బహుమతి

జనసామాన్యానికి ఉపయోగించే పనిని అందరూ కలిసి కట్టుగా చెయ్యాలని సహృదయులు చెప్పితే దానిని అందరూ ఆమోదించి "అవును, తప్పక చెయ్యవలసినదే" అని తల-లూపుతారు. కాని, అందులో తమకూ కొంత ప్రయోజనం ఉంటేనే కాని, ఆ పనికి పూనుకోరు. ఇది సాధారణంగా కనపడే విషయం. అయితే- అందరికీ అందులో ఉత్సాహం కలిగేటట్లు ఎలా చెయ్యడం? ఇదే ఒక రాజుకు పెద్ద సమస్య. అందుకోసం ఏమిటి చెయ్యడమా? అని ఆలోచించి, మంత్రీ, తానూ కలిసి ఒక అర్ధరాత్రి ఒక బండ రాతిని, రాకపోకలు అధి-కంగా ఉన్న ఒక దారి నడుమ ఉంచారు; దాని కింద ఒక చిన్న మూటను కూడా ఉంచారు.

తెల్లవారు జామున పొలం పనులకు పోయే రైతులు, దారిలో బండ ఉండడం చూచి ఆశ్చర్యపడినా, దానిని మార్గం ప్రక్కకి తోసి, రాక-పోకలకు ఆటంకం లేకుండా చెయ్యా-లని అనుకోక, ఆ ప్రక్క నుండి వెళ్ళి-పోయారు. ఆ దారిని వచ్చే వారూ, పోయే వారూ కూడా, ఆ బండను చూచి "మనకెందుకులే" అని అనుకొని దాని ప్రక్క నుంచే వెళ్ళుతూ, వస్తూ ఉండేవారు. శకటాలు కూడా దాని ప్రక్క నుంచే వెళ్ళేవి. ఈ విధంగా ఆ బండకు రెండు ప్రక్కలా రెండు బండ్లదారులు ఏర్పడినాయి. పది రోజులు గడిచాయి. రాతి బండకు చలనం కలగలేదు. రాకపోకలు అడ్డు-లేకుండా జరిగిపోతున్నాయి.

రాజుగారు దీనిని కనిబెడుతూనే ఉన్నారు. ఆయన పదకుండో రోజు నాడు మధ్యాహ్నం మంత్రి సహితంగా అక్కడికి వచ్చారు. ఒక చిన్న గడ్డపార కూడా తెచ్చారు. రాజుగారు రావడం చూచి, చాలా మంది జనం అక్కడ చేరారు. ఆయన ఆ బండను తొల-గించడానికి సిద్ధపడగా, కొందరు "మేమే తీసి వేస్తాం, మీకెందుకు శ్రమ?" అని దాని దగ్గరకు వచ్చారు. ప్రభువు "నేనే తియ్యాలి" అని గడ్డ పార సాయంతో దాన్ని తొలగించి, దారికి దూరంగా త్రోసివేశాడు. దాని కింద-నున్న చిన్న మూట విప్పి చూస్తే, ఒక చీటి, నూరు రూపాయిలు ఉన్నవి. చీటీలో "ఈ బండనెత్తిన వారిదే యీ బహుమతి" అని వున్నది. అందరూ ఆశ్చర్యపోయారు. రాజుగారు "పది రోజులు దారికడ్డంగా బండ వుంటే దాన్ని ప్రక్కకు తోసి వెయ్యాలనే ఆలోచన ఒక్కరికీ కలగలేదు. అందరూ 'నాకెందుకులే!' అనే అను-కొన్నారు. ఇప్పుడు నేను ఆ బండను తొలగించడానికి రాగా, నా మెప్పు కోసం, ఆ రాతి బండను తొలగించ-డానికి సిద్ధపడ్డారు. మీరు ఈ పనిని మొదటనే చేసి ఉంటే యీ బహుమతి మీకే దక్కి ఉండేది" అని అనేసరికి అందరూ సిగ్గుతో తల వంచు-కున్నారు.

"నాకేమి పట్టింది?" అని అనుకోక జనసామాన్యానికి ఉపయోగపడే పనికి అందరూ నడుము కట్టుకోవాలి.

–బులుసు వేంకటరమణయ్య

## మౌన విపంచి

ఆట పట్టిస్తాడు. "ఏమోయ్! నీ స్నేహితులు ఏమంటున్నారు?" అని. "మీరు బాగా గమనించండి. అన్నయ్య చెట్లతో, ఆకులతో, పూలతో మాట్లాడు-తుంటాడు" అంటాడు.

"పండ్లనైతే తినేస్తాడు. వాటితో ఖబుర్లు అనవసరం" అంటుంది రాధ వేళాకోళంగా.

రాధకు పువ్వులంటే పిచ్చి. తన క్లాస్‌మేట్స్ మోడర్న్‌గా ఒక్క పువ్వు పెట్టుకుంటే తాను మాత్రం దొడ్లో పూసిన పూలన్నీ మాల కట్టి తురు-మాల్సిందే. తను ఒక్కతి అయితే ఫర్వాలేదు. స్నేహితులకూ, యిరుగూ పొరుగుకూ సరఫరా చేస్తుంది. రాధ పూల మొక్క దగ్గర కెళ్ళిందంటే ఆ మొక్క బోసిపోవాల్సిందే. ఆ పద్ధతి కృష్ణ చైతన్యకు నచ్చదు ఒకటి, రెండు కోసి మిగిలినవి చెట్టునే వుంచాలని అంటాడు పువ్వు చెట్టుకో అందా-న్నిస్తుంది చూసి ఆనందించాలే గాని, స్వార్థం కూడదని అతని అభి-ప్రాయం

రాధ మాత్రం కాయ కూడా చెట్టుకే అందం చూసి తరించాలి మరి నువ్వెందుకు తింటావు అంటుంది యిద్దరూ దీని గూర్చి హోరాహోరీ వాదించుకుంటారు ఎన్నిసార్లు వాదించినా విషయం అదే మారదు వారు మార్చుకోరు

ప్రభాతకు కూడా పూలంటే ప్రాణం వాళ్ళ వూరిలో ఉన్నపుడు అందరిళ్ళకూ వెళ్ళి ఏవో ఒకటి పూలు తెచ్చుకునేది వచ్చిన క్రొత్తలో ఆ యింట్లో పూల మొక్కలు చూసి సంబర పడింది రాధతో పాటు పోటీ పడి కోసి మాలలు కట్టేది కృష్ణ చైతన్య అభిప్రాయం అర్థం అయాక ఆమె ఉత్సాహం నీరు గారిపోయింది అన్నేసి పూలు తెంపడం మానింది గాని రోజుకో ఎర్ర గులాబి విధిగా తీసికుంటుంది

మల్లెలూ, జాజులూ చెట్టుపైనే వాడిపోతుంటే ఆమె ప్రాణం విల-విల్లాడుతుంది

"మీరలా ఎందుకు బాధపడతారు వెన్నెల రాత్రుల్లో చూడండి అః నక్షత్రాల్లా తెల్లగా మెరిసిపోతూ కన్పిస్తాయి ఆ చుక్కలు వెలుగునిస్తే, ఇవి పరిమళాన్నిస్తాయి అదెంత హాయిగా ఉంటుందో" అంటాడు కృష్ణ చైతన్య

'మనం వెళ్దాం పద ప్రభాతా? ఇంకొంచెంసేపు ఉంటే కవిత్వం చెప్తాడు మల్లెలమీదో, నక్షత్రాలమీదో పద పద " తొందర చేసి లాక్కెళ్ళి పోతుంది రాధ

అప్పటినుండి ప్రభాత కూడా కృష్ణ చైతన్య దృష్టితో పూ చెట్లకేసి చూసేది "నిజమే- పువ్వులు చెట్లకెంత అందంగా ఉన్నాయి అనుకొనేది

**(ఇంకా ఉంది)**

# అందరూ ఆలోచించండి!

## విన్నకోట సుశీలాదేవి

రాత్రి పది గంటల వేళ!

సుజాత వంటింట్లో సర్ది బెడ్ రూమ్‌లోకి వచ్చేసరికి రాజారావు నిద్ర కుపక్రమించబోతున్నాడు

"అప్పుడే నిద్రపోతున్నారా! మీతో ఒక విషయం చెప్పాలనుకుంటున్నాను !" అంది సుజాత

రాజారావు కళ్ళు తెరిచి

"ఏమిటదీ సుజా," అనడిగాడు

"మన పిల్లల విషయమండీ వీళ్ళని ఎంత కాలం ప్రక్కింట్లో వదులుతామండీ ఈ మధ్య ఆవిడ విసుక్కుంటోంది కూడా "

మంచి పని పిల్లని చూడు.' అన్నాడు 'ఆ అనుభవం కూడా అయిందిగా పిల్లల కోసం వుంచిన పాలు బిస్కెట్లు అదే ఖాళీ చేసేది పిల్లలు మట్టి తింటున్నా చూస్తూ వూరుకునేది ఆ పని పిల్ల వున్నన్నాళ్ళూ పిల్లల కేవేవో రోగాలు వస్తూనే వున్నాయి మనకి రెట్టింపు ఖర్చయ్యింది జ్ఞాపకం లేదూ '

'అయితే ఏం చేద్దా మంటావ్,' సాలోచనగా అడిగాడు

'ఇది మన ఒక్కరి సమస్యే కాదు వుద్యోగాలు చేసే భార్యా భర్తలందరి సమస్య! కొన్ని వూళ్ళల్లో పిల్లల్ని చూసేందుకు శిశుకేంద్రాలుంటాయి కానీ ఈ వూళ్ళో అటువంటివేమీ లేవు' విసుక్కుంది సుజాత

సుజాతకు ప్రైవేటు కంపెనీలో వుద్యోగం రాజారావు బ్యాంకులో పని చేస్తున్నాడు ఈ కరువు కాలంలో భార్యా భర్తలిద్దరూ వుద్యోగాలు చేస్తేనేగాని సంసారాలు సజావుగా సాగవు వాళ్ళకి ఇద్దరు పిల్లలు అమ్మాయికి మూడేళ్ళు పిల్లాడికి ఏడాది సుజాత రాజారావు ఇద్దరూ వుద్యోగాలకు వెడితే ఇంట్లో వాళ్ళని చూసేవాళ్ళు లేరు పిల్లలు కొంచెం పెద్దవాళ్ళయ్యే వరకూ ఇబ్బంది

"ఆఫీసులో పని చేస్తున్నా మనసంతా ఇంటి పైనే వుంటుంది పిల్లలు ఏం చేస్తున్నారో? ఎలా వున్నారో అనే బెంగ' బాధగా అంది

ఈ సమస్య నెలా పరిష్కరించాలో రాజారావు కేమాత్రం అర్ధం కాలేదు

నే నొక మాట చెప్పనా

సుజాత మళ్ళీ అంది

'కొంపదీసి వుద్యోగం మానేస్తానంటుందా రాజారావు భయపడ్డాడు ఆమెకి వచ్చే జీతం మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు ఈ మధ్యనే స్కూటర్‌కి ఆర్డరు ఇచ్చాడు రెండు నెలల్లో వస్తుంది సుజాత జీతం నెల నెలా ఆ స్కూటర్‌కి చెల్లించాలి ఇంకా స్థలం కొనాలి, ఇల్లు కట్టాలి సుజాత వుద్యోగం మానకూడదు.

"ఏమిటో చెప్పు సుజా' అన్నాడు ఏం వినాల్సి వస్తుందో నని బెరుకుతో

"అత్తయ్యగారిని పిలిపించండి.' అంది

అది విని రాజారావు ఆశ్చర్య పోయాడు!

"సుజా నిజంగానే అంటున్నావా?"

"అవునండి అంతకంటె మార్గంలేదు పిల్లల్ని చూస్తారు ఇంట్లో నాకు పనికి సహాయంగా వుంటారు ఒక్కదాన్ని ఆఫీసుపని ఇంటి పని చేసుకోవాలంటే చాలా కష్టంగా వుంటోంది అంది

రాజారావు మాట్లాడలేదు

"మీరింకేమీ ఆలోచించకండి మనిద్దరం వెళ్ళి ఆవిడని తీసుకొద్దాం' మనకి అంతకంటె మార్గంలేదు అని మంచం మీద పడుకుని కళ్ళు మూసుకుంది

* * *

కానీ రాజారావుకు నిద్ర రాలేదు

సుజాత అన్న మాటతో అతడికి చాలా రోజుల తర్వాత తల్లి గుర్తుకు వచ్చింది

అరవై ఏళ్ళ వయసులో ఎండిపోయిన శరీరంతో ఆ పల్లెటూళ్ళో ఒక ప్రక్కకు ఒరిగి పోయిన ఇంట్లో- చిరిగిపోయిన చాప మీద పడుకుని నా కొడుకు ఇక నా దగ్గరకు రాడేమో' అనుకుంటూ వుంటుందేమో!

రోజూ ఉదయపు వేళ గుమ్మంలో నిలబడి "బాబూ, పోస్టుమేనూ మావాడు నాకేమన్నా వుత్తరం వ్రాశాడా?' అని అడుగుతూ వుంటుందేమో?

రాజారావు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఇన్నాళ్ళూ ఎప్పుడైనా తల్లి గుర్తుకు రాబోయినా బలవంతాన మనస్సు మరల్చుకునేవాడు

ఈనాడు సుజాత మాటతో ఆవిడ గురించిన ఆలోచనలలో రాజారావు వుక్కిరి బిక్కిరవసాగాడు

రాజారావుకు పెళ్ళయిన కొత్తలో రాజారావు భార్యతో కలిసి పట్నం వస్తోంటే తల్లి తనని కూడా కొడుకు రమ్మంటాడేమోనని ఎదురు చూసింది రాజారావు ఆ మాటేమీ ఎత్తక పోవడంతో నిరాశపడింది ఆ తర్వాత సంక్రాంతి పండక్కి వచ్చినప్పుడు ఆవిడ తనంతట తానే అడిగింది కొడుకుని

'బాబూ! రాజా ఇక్కడ ఒక్కదాన్ని వుండలేక పోతున్నానురా నేనూ నీతో వచ్చేస్తాను మీకు నేనేమీ అడ్డుగా వుండను మీరు పెట్టింది తింటూ- ఒక మూల పడి వుంటాను నన్నూ తీసుకెళ్ళు నాయనా.' దీనంగా అడిగింది

రాజారావు మనస్సు కరిగి పోయింది

"అలాగే అమ్మా అనబోయాడు

ఈ సంభాషణంతా లోపలనుండి వింటున్న సుజాత భర్తని పిలిచింది

రాజారావు లోపలికి వెళ్ళాడు

సుజాత కోపంతో ఎగిరిపడింది

'మనం కొత్త దంపతులం మనిద్దరం హాయిగా వుండకుండా మన మధ్య ఈ ముసలావిడ దేనికండీ ఇక్కడ ఇల్లు వుందిగా! ఆవిడని ఇక్కడే వుండమనండి అంతగా కావాలంటే నెలకి ఏదో కొంత డబ్బు పంపించవచ్చు అందరినీ కూర్చోబెట్టి నేను చెయ్యలేను " అంది తీవ్రంగా!

సుజాత మాటలు సబబుగానే తోచాయి రాజారావుకి

"ఈసారి వచ్చినప్పుడు తీసుకెడతానమ్మా!' అని తల్లితో నమ్మకంగా చెప్పి వెళ్ళిపోయాడు!

అంతే మళ్ళీ ఎప్పుడూ తల్లి దగ్గరకు వెళ్ళలేదు వెడితే ఆవిడ వస్తానని వెంట పడుతుందేమోనని భయం తనకి వీలయినప్పుడు డబ్బు పంపించి- అంతటితో బాధ్యత తీరిందనుకున్నాడు

మళ్ళీ ఇన్నాళ్ళకి అంటే దాదాపు అయిదేళ్ళ తర్వాత తల్లిని తీసుకురావడానికి వెడుతున్నాడు అది కూడా ఆమెపై అభిమానంతో కాదు తన స్వార్ధం కోసం తల్లి ఏమంటుందో?

"ఏమిటండీ! ఇంకా పడుకోకుండా అలా కూర్చున్నారే,' సుజాత ప్రక్కకు వత్తిగిల్లుతూ అడిగింది

"ఏం లేదు?

"ఇంకా ఆ విషయమే ఆలోచిస్తున్నారా" అంది

"అవును సుజా అమ్మ వస్తుందంటావా?" అనుమానంగా అన్నాడు

"మీకే అనుమానం అక్కర్లేదు ఆవిడ తప్పకుండా వస్తుంది మీరంటే చాలా ఇష్టం ఆవిడకి!"

ఆవలిస్తూ కళ్ళు మూసుకుంది "

రాజారావు మనస్సు చివుక్కుమంది నిజమే? అమ్మకి తనంటే ఇష్టం తను ఒక్కగా నొక్క కొడుకవడం వలన ఎంతో ప్రేమతో పెంచింది తండ్రి చిన్నప్పుడే చనిపోయినా ధైర్యంగా నిలబడి తనకు చదువు చెప్పించింది ఆవిడ పస్తులుండి తన కడుపు నింపేది రాత్రనక- పగలనక తనకోసం కష్టపడి-ఆవిడ ఆరోగ్యం చెడగొట్టుకుంది

అటువంటి తల్లిని ఆనాడు నిర్లక్ష్యం చేశాడు ఆవిడ బరువు బాధ్యతలు వహించాల్సింది పోయి ఆవిడని మరింత మానసిక వ్యధకి గురి చేశాడు ఆవిడని నెత్తి మీద పెట్టుకుని పూజించక మట్టి-పాలు చేశాడు కళ్లతో వేడుకున్నా కాలదన్నాడు ఛీ! తను కొడుకుకాదు దుర్మార్గుడు రాక్షసుడు అను-కున్నాడు రాజారావు!

అతడిలో పశ్చాత్తాపం కల్గసాగింది

తన తల్లిని తీసుకొచ్చి— ఆవిడకే కష్టమూ కలగ-కుండా చూస్తాడు తను ఇన్ని రోజులు తను చేసిన అన్యాయానికి ప్రాయచిత్తంగా ఆమెను ప్రాణం-కంటె ఎక్కువగా అభిమానిస్తాడు

అతడిలో ఆవేశం ఆనందం కలగసాగాయి తను వెంటనే వూరు వెళ్లాలి వీలైతే రేపే

తన పిలుపు కోసమే ఎదురుచూస్తున్న తల్లి తను పిలవగానే వచ్చేస్తుంది పాపం ఇన్నాళ్ల నిరీక్షణలో ఆవిడ ఎంత అలిసి పోయిందో? మానసికంగా ఎంత క్రుంగి పోయిందో?"

*        *        *

సుజాత చెప్పిందంతా విని వర్ధనమ్మ చిన్నగా నిట్టూర్చింది

"అత్తయ్యగారూ! ఇప్పుడు మా కుటుంబానికి మీరు ఎంతో అవసరం పిల్లల్ని పక్కింట్లో వుంచి ఆఫీసుకు వెళ్లాలంటే చాలా ఇబ్బందిగా వుంది

అంటే పిల్లల కోసం నేను రావాలన్నమాట' అంది ఆవిడ

సుజాత కంగారు పడింది



ఆ రాత్రి ఆ నిశ్శబ్ద వాతావరణంలో ఒంటరిగా కూర్చుని తల్లి దగ్గరకు వెంటనే వెళ్లి పోవాలని ఆరాట పడసాగాడు రాజారావు

"అబ్బెబ్బె అది కాదండి మీరు లెని లోటు ఇన్నాళ్ళకు తెలిసొచ్చింది ఆ వయసు వేడిలో పెద్ద తప్పు చేశాం మీరు మమ్మల్ని క్షమించాలి" అంది సుజాత వేడికోలుగా!

కోడలు మాటలకు మనసులో నవ్వుకుంది ఆవిడ రాజారావు కల్పించుకున్నాడు

"అమ్మా ఇంకా ఎన్నాళ్ళిలా ఒంటరిగా వుంటావ్! నువ్వు పెద్దదాని వవుతున్నావ్ నిన్ను దగ్గర వుంచుకుని జాగ్రత్తగా చూడటం నా బాధ్యత, అందుకే నిన్ను మాతో తీసుకెళ్ళడానికి వచ్చాం

కొడుకు మాటలు ఆమెకు బాధ కలిగించాయి

తను ఆ రోజు కొడుకుని తీసుకెళ్ళమని ఎంత బ్రతిమిలాడింది ఏడ్చింది కానీ నిర్లక్ష్యంగా వెళ్ళిపోయాడు ఈనాడు తనతో అవసరం కాబట్టి ప్రేమ చూపిస్తున్నాడు. 'బాధ్యత' అంటూ పెద్ద మాటలు వాడుతున్నాడు అంతానటన "మోసం వంచన

ఈ లోకంలో అన్ని బంధాం కంటె తల్లీ బిడ్డల బంధం గొప్పదంటారు కానీ ఈ రోజుల్లో అది కూడా. స్వార్ధ పూరితమై పోయింది ఈ లోకంలో ఏదీ నిజం కాదు. ఏదీ శాశ్వతం కాదు

"అత్తయ్యగారూ! మనం రేపే బయలుదేరాలి నాకు సెలవు ఎక్కువలేదు"

## వేఱుపాటు

నగ్నంగా కదలాడినా
నీతుల్ని పలికినా
వేమన్న దృష్టి
అభ్యున్నతి వైపు!
నగ్నంగా చరిస్తున్నా...
నీతుల్ని వల్లిస్తున్నా...
మన దృష్టి
అధోగతి వైపు!

— కె. అశోకుబాబు
— కె. అశోకుబాబు

## అందరూ ఆలోచించండి!

"సుజాతా ఇంటి పని ఆఫీసుపని చేసుకోలేకపోతే నువ్వు వుద్యోగం మానెయ్యకూడదూ. వాడి కొచ్చేదీ నీ సంపాదనకి చాలు కదా అయినా డబ్బుకు మితం ఎక్కడ?" అంది ఆవిడ.

రాజారావు భయపడి పోయాడు

"అబ్బే సుజాత వుద్యోగం మానేస్తే చాలా కష్టం అమ్మా ధరలు మండిపోతున్నాయి ఇద్దరి సంపాదనా లేక పోతే ఎలా అమ్మా నీకు ఎక్కువే పనేం వుండదమ్మా సుజాత వుందిగా నువ్వు ఇంట్లో వుంటే చాలు అదే మాకు తృప్తి!" అన్నాడు!

కొడుకు మాటలు ఆనందానికి బదులు దుఃఖం కలిగించాయి వర్ధనమ్మకు!

'బాబూ ఇన్నాళ్ళూ నువ్వు నన్ను రమ్మనక పోయినా బాధపడలేదు ఎవరి సంసారం వాళ్ళ కుండటం మంచిదే కదా అని సరిపెట్టుకున్నాను ఇన్నాళ్ళూ

నువ్వు కొన్ని వేల మైళ్ళ దూరంలో వున్నా నా ప్రక్కనే వున్నట్టుండేది కానీ ఈ రోజు నాదగ్గరకు వచ్చి నీ స్వార్ధం కోసం నన్ను పిలిచి– మన మధ్య వున్న బంధాన్ని పుటుక్కున తెంచేశావు మనిద్దరం దగ్గరగా వున్నా మన మధ్య కొన్ని వేల మైళ్ళ దూరం ఏర్పడేట్టు చేశావు! నువ్వు రాకుండా వున్నా బాగుండేదిరా అనుకున్న దావిడ మనసులో బాధగా!

"అమ్మా ఇక్కడేవన్నా బాకీలుంటే తీర్చేద్దాం సుజాత ఈ సామాన్లన్నీ సర్దేస్తుందిలే' అన్నాడు రాజారావు

'నాయనా నేను నీతో రాలేనురా" అంది ఆవిడ మెల్లగా!

సుజాత- రాజారావు నిశ్చేష్టు లయ్యారు!

అమ్మా!'

'అవును రాజా చిన్నప్పుడు నిన్నెంత గారాబంగా పెంచానో? నీ చదువుకు ఎంత కష్ట పడ్డానో నీకు తెలుసా! నీకు పెళ్ళయ్యాక నీ నీడలో నిశ్చింతగా కాలం వెళ్ల దీద్దామనుకున్నాను కానీ నువ్వు నన్ను రమ్మన్లేదు నేను వస్తానని బ్రతిమిలాడినా తిరస్కరించావు నన్ను ఒంటరిదాన్ని చేసి నీ దారి నువ్వు చూసుకున్నావు ఈ వయసులో తల్లి ఒంటరిగా ఎలా వుండ గలదో నని ఆలోచించావా? ఈనాడు మీ అవసరం కాబట్టి నేను గుర్తుకొచ్చాను ఇన్నాళ్లూ తిన్నానో, చచ్చానో కూడా పట్టించుకోలేదు ఇక్కడికివస్తే నీ వెంట పడతానని రావడం మానుకున్నావు, రాజా కన్న కొడుకులు కూడా స్వార్థ పరులైతే ఇక మాలాటి తల్లుల గతేమిటి బాబూ!' అంది ఆవేదనగా!

ఇద్దరూ తలొంచుకున్నారు

రాజా! ఈ వూరు ఇప్పుడు ఇదివరకటి పల్లెటూరుకాదు బస్తీగా మారింది నువ్వు గమనించే వుంటావు ఇక్కడ ఎన్నో ఆఫీసులు వెలిశాయి వుద్యోగాలు చేసే ఆడా మగా ఎక్కువయ్యారు మీలాగా పిల్లల సమస్యతో బాధపడేవాళ్ళు ఈనాడీ వూరిలో చాలామంది వున్నారు నేను, ఒంటరిగా వున్నానని తెలిసి ఈ చుట్టు ప్రక్కల ఉద్యోగస్తులైన అధవాళ్ల పిల్లల్ని చూడమని నన్ను కోరారు నేనూ ఒంటరితనంతో బాధపడుతున్నా కదా! అందుకే వెంటనే అంగీకరించాను ఈ వీధి చివర ఒక ఇల్లు తీసుకున్నాను వాళ్ల పిల్లల్ని పొద్దున వదిలి సాయంత్రం తీసుక పోతారు నేను ప్రొద్దున నుండి సాయంత్రం వరకు అక్కడే వుండి వస్తాను నాకు సాయంగా ఒక పని పిల్ల కూడా వుంది బాబూ! రాజా! ఒకనాడు నీ పిల్లలతో ఆడుకోవాలని ఆశపడ్డాను! కానీ ఈరోజు నాకెందరో మనవలు మనవరాళ్ళు వున్నారు నాకిప్పుడెవరి దయాధర్మం అక్కర్లేదురా అబ్బాయ్! ఆ పిల్లల మధ్య జీవిస్తాను! వారి మధ్య కన్ను మూస్తాను " అంది ఆవిడ

సుజాత, రాజా రావు ఆశ్చర్యంతో వినసాగారు! తమ ఎదురుగా వుంది ఒక సామాన్య వ్యక్తి కాదు ఒక మహాద్భుత శక్తిలా కనబడింది

రాజా! ఈనాడు నీ పిల్లలు చిన్న వాళ్ళు! వాళ్లకు నా అవసరం వుంది కాబట్టి నన్ను ప్రేమతో రమ్మంటున్నారు వాళ్ళు పెద్దవాళ్లయ్యాక నా అవసరం ఉండదు! కాబట్టి మళ్లీ నన్ను, మీరు గెంటియ్యవచ్చు! అప్పుడు నా పరిస్థితి ఏమిటి? నేనెక్కడికెళ్లగలను? నన్నెవరాదరిస్తారు?

'అబ్బే అలా జరగదండి ఏదో చెప్పబోయారిద్దరూ! ఆవిడ అడ్డు పడింది

'ఒకప్పుడు మీరంటే పిచ్చి అభిమానం వుండేది! మిమ్మల్ని వదిలి వుండలేక మీ వెంట వస్తానని చిన్న పిల్లలా ఏడ్చాను! నన్ను కాలితో తన్నేసి వెళ్లిపోయారు ఆ రోజు నేనెంత బాధపడ్డానో ఆ దేవుడికే తెలియాలి ఆ తర్వాత ఏ క్షణాన్నయినా నువ్వొస్తావేమోననే పిచ్చి భ్రమతో గడిపాను! నాయనా! నీకోసం ఏడ్చి ఏడ్చి ఈ కళ్ళల్లో నీళ్ళు ఇంకిపోయిందిరా! నీ గురించిన ఆవేదనతో ఈ మనస్సు చచ్చిపోయింది ఈ జీవచ్ఛవం ఇప్పుడు నీకేం వుపయోగపడుతుంది బాబూ ఒకసాడు నాకు నువ్వొక్కడివే కొడుకువి ఈనాడు నాకెంత మంది కొడుకులు కోడళ్ళు వున్నారు! వీరి మధ్య హాయిగా వున్నాను

ఆవిడ చాప మీద నుండి మెల్లగా లేచి నిలబడింది!

నాయనా! ఇంక ఎక్కువ ప్రేమ నటించకండిరా! ఈ ముసలి తల్లి భరించలేదు! అమ్మా సుజాతా! నాలాటి అత్తలు మీ వూళ్లో కూడా వుంటారు! వాళ్లతో మీ అవసరం తీర్చుకోండి" అని లోపలకు వెళ్లిపోయిందావిడ! ☐

## ఇ'వేమన' పద్యాలు






# బాలసంక్షేమంకోసం



బాలల అభ్యున్నతి దేశాభ్యుదయానికి తొలి సోపానమన్న ఆర్యోక్తి అక్షర సత్యమని ఎవరైనా అంగీకరిస్తారు నేటి బాలల రేపటి పౌరులని వారి భవిష్యత్తే జాతి ప్రగతికి మూలాధారమని తెలిసి కూడ బాలల సంక్షేమం పట్ల శ్రద్ధ చూపక పోవడం బాధను కలిగించే అంశం ఈ విషయంలో విశ్వవ్యాప్తంగా ఒక విధమైన పోకడ కానరావడం దురదృష్టకరం ఈ దుస్థితిని గుర్తించి యునెసెఫ్ వారు బాలల సంక్షేమం కోసం శాయశక్తులా ప్రయత్నించడం ఎంతైనా ముదావహం .ఎన్నో పధకాలను వారు రంగంలోకి తీసుకొని రావడం ఎంతో సంతోషాన్ని కలిగిస్తుంది

1983 అంచనా ప్రకారం సాలీనా 150 లక్షల మంది పిల్లలు మరణిస్తున్నారు రోజుకి 40 వేల మంది మృత్యువు నోటబడితే మరో 40 వేల మంది వికలాంగులై అలమటిస్తున్నారు ఈ దుర్భర పరిస్థితి వెనుకబడిన దేశాలలో తారా స్థాయిలో ఉండగా, వర్ధమాన దేశాలలో ఇప్పుడిప్పుడే అదుపు తప్పుతోంది అభివృద్ధి చెందిన దేశాలలో పిల్లల మరణ శాతం తక్కువ అయినా తాత్సారము చేయదగ్గది మాత్రం కాదు!

పిల్లల మరణాలకి మూల కారణాలుగా చెప్పబడుతున్న వాటిలో నీళ్ల విరేచనాలు, ధనుర్వాతము, పోలియో, పొంగు, మశూచి, మలేరియా వంటి తీవ్రమైన వ్యాధులు ఉన్నాయి డిఫ్తీరియా, కోరింత దగ్గు, టిటానస్– వీటికంటే కూడా ప్రమాదకరమైనది నీళ్ల విరేచనాలు! పిల్లలు ఎండిపోతే ఎంతో చెరుపు కలుగుతుంది ఇలా ఎండిపోవడం వల్ల పెద్ద ఎత్తున పిల్లలు మరణిస్తున్నారని నిపుణులు చెప్పడం ఎంతో ఆశ్చర్యాన్ని, ఆందోళన కలిగిస్తుంది ఈ వ్యాధతే కాదు పోషకాహారలోపం, కల్తీ ఆహారం, అపరిశుభ్రత, తల్లిదండ్రుల నిర్లక్ష్యం మొదలైనవి కూడ పిల్లల మరణాలకి కారణాలని చెప్పక తప్పదు ఇది తెలుసుకొనేపాటి అక్షర జ్ఞానం లేకపోవడం ప్రధాన లోపమని అంగీకరించవలసి వస్తుంది లోపాలు ఎవరివైనా వాటికి బలవుతున్నది ముక్కుపచ్చలారని పసి పిల్లలు! వారి భవితవ్యమే జాతి భవితవ్యమని గుర్తించి వారిని కంటికి రెప్పలా కాపాడుకో లేకపోతే జాతి మొత్తం తుడిచి పెట్టుకొని పోతుందని గ్రహించగలగాలి మరి పిల్లల ఆరోగ్య ప్రమాణాలను కాపాడుకోవడమెలా?

బాలల సంక్షేమాన్ని ఆశించి యునిసెఫ్ వారు సూచించిన పథకాన్ని– అన్ని దేశాలవారూ– రాజకీయాలను మరచి, మత వివక్షను విడచి పాటించవలసి ఉంది

పిల్లలకు తల్లి పాలను మించిన శ్రేష్టమైన పాలు ప్రకృతిలో ఎక్కడా లభ్యంకాదు తల్లిపాలు త్రాగడంవల్ల ఎన్నో రకాల జబ్బులను ఎదుర్కొనే శక్తి పిల్లలకి వస్తుందని వైద్య నిపుణులు అంటున్నారు కొన్ని నెలల తరువాత తల్లి పాలతో పాటు ఆరోగ్యకరమైన ఆహార పదార్థాన్ని డాక్టర్ల సలహా మేరకు పిల్లలకు ఇవ్వడం తల్లులు నేర్చుకోవాలి పిల్లల తొలిగురువు తల్లేనన్న నగ్న సత్యాన్ని ఎవరైనా, ఏ కాలానికైనా కాదనలేరు బలవర్ధకమైన ఆహారంతో పాటు నెల నెలా వైద్య సలహాలు పొందుతూ వ్యాక్సిన్‌లు, టీకాలు పిల్లలకు వేయించాలి తల్లి చూపే ఈ శ్రద్ధే శ్రీరామ రక్షయై బాలల నుదుటి రాతలు మారుస్తుంది

ఇన్నాళ్ళుగా ఈ టీకాలు, వాక్సిన్‌లు ఉన్నాయా? పిల్లలు పెరిగి పెద్దలు కాలేదా? అని తలబోసే మహానుభావులు కూడ ఉన్నారు ఇప్పటి వాతావరణం వేరు పరిస్థితులు వేరు కాలుష్యం ఊహకందని విధంగా ఊపిరి పోసుకుంటోంది కలలో కూడ అనుకొని సరికొత్త అంటువ్యాధులు ప్రబలుతున్నాయి ప్రతిక్షణం సంధిగ్ధంగా ప్రాణం ఉసూరుమనే పరికరాలలో పెద్దలే బ్రతకడం కష్టంగా ఉంటే ఇక పిల్లల సంగతి చెప్పాలా? కాబట్టి పిల్లల పట్ల ప్రత్యేకమైన శ్రద్ధ చూపటం విధిగా, బాధ్యతగా, దేశసేవలో ఒక భాగంగా తలబోసి వారి సంక్షేమం కోసం పాటుపడాలి.

ఈ విషయాన్ని తల్లులు తెలుసుకోవాలి అక్షరాస్యత లేని తల్లులు తెలియచెప్పాలి వందలు, వేలు సంఖ్యలో వాలంటీర్లను తయారుచేయాలి. సందు సందుకు, మూల మూలకు ఆ వాలంటీర్లు వెళ్లి ప్రతి తల్లినీ, తండ్రినీ, తోడ బుట్టిన వారిని మేలుకొలపాలి పిల్లల సంక్షేమంలో వారి పాత్ర ఏమిటో స్పష్టం చేయాలి అప్పుడే పిల్లల మనుగడ సుసాధ్య మవుతుంది ఈ చైతన్య విప్లవం లక్ష్యాన్ని చేరుకొనే దాకా ఆగకూడదు లక్ష్యాన్ని చేరుకొన్నాక కూడ నిలవకూడదు

అభివృద్ధి చెందిన దేశాల సంగతి అటు పెట్టినా వర్ధమాన దేశాలలో 8 వేలకి పైగా రేడియో స్టేషనుల కార్యక్రమాలు రెండు వేల అయిదువందల టి వి స్టేషన్ కార్యక్రమాల, ఎనిమిదివేల దిన పత్రికలు అందుబాటులో ఉన్నట్లు తెలుస్తోంది వీటి ద్వారా బాలల సంక్షేమ విధానాన్ని మనం ప్రతి ఒకరికీ చెప్పవచ్చు పైగా ఎన్నో స్వచ్ఛంద సంస్థలు ఈ రంగం పట్ల ఆసక్తి చూపుతున్నాయి కూడ! మన దేశంలోనే 12 వేల స్వచ్ఛంద సంస్థలు ఉన్నాయని వింటుంటే ఆశ్చర్యం వేస్తుంది పిల్లల కోసం త్యాగానికైనా సిద్ధపడే వ్యక్తిత్వం కావాలి!

ఇన్ని సదుపాయాలు ఉన్నాయి యోజన కూడ సిద్ధంగా ఉంది ఇక ఆచరణే తరువాయి శ్రమయేవ జయతే అన్న నానుడి మనకు తెలిసిందే!

(యూనిసెఫ్ వారి సౌజన్యంతో )

–డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

సీరియల్

# కాగితపు పడవలు

యర్రగుంట్ల వరలక్ష్మీదేవి

(గత సంచిక తరువాయి)

## 20

ఆమరుసటి ఆదివారంనాడు సుబ్బారావు, కంటకాపల్లి వచ్చే షు. ఆది వారం రామారావు, వెంకటరమణ మిగతా ఆ ఇంటి సభ్యులు తీరుబాటుగ ఆ [illegible] ఉంటారని, ఆనాడు సుబ్బారారావు వచ్చేడు

ఈ వారం రోజులు సుభద్ర ఆలోచనలు అల్లిబిల్లిగా అల్లుకుంటు పోతున్నాయి సుబ్బారావు మేష్టారు చాలా మంచివాడు, నెమ్మదస్తుడు తనని ప్రేమించేనన్నాడు తను అతనికి భార్యనైతే అతడు ఎంతో అదృష్ట-వంతుడనవుతానన్నాడు తనని పొందడం ఓ భాగ్యంగ భావిస్తున్న వ్యక్తిని పెండ్లాడంకన్న తనకి కావల్సిందేముంది అందమైన మగవాడు, కాళ్ళు చేతులు దృఢంగ ఉన్నవాడు భార్యను కొట్టడానికి, తన్నడానికి వినియో-గించగం తను ఎన్నిసార్లు వినలేదు! స్త్రీకి తనని ప్రేమించి, తనని ఆదరించి, తనే ఓ అదృష్టంగా భావించే వ్యక్తిని భర్తగా పొందడంకన్న కావల్సిం-దేముంది అవయవాలకన్న ముఖ్యమైనది హృదయం అది కుంటిది కాకుండ ఉండాలి తన తల్లి దండ్రు లేమన్న తను ఈ పెండ్లికి సంసిద్ధురాలే

"నమస్కారమండి "

"నమస్కారం- రండి మేష్టారుగారు," అని సాదరంగ పిలిచి కుర్చీ చూపేడు జనార్ధనయ్య ఆ సరికి రామారావు కూడ ఆ గదిలోనే ఉన్నాడు. అంతవరకు వచ్చేక సుబ్బారావుకి చాల జంకు, సిగ్గు కల్గింది కాస్సేపు మౌనంగ కూర్చున్నాడు మనసులో ఆనందం ఉప్పొంగుతుంటే సుభద్ర ఆ గొంతుకవిని కిటికీకి ప్రక్కకు వచ్చి నిల్చుంది

రామారావు అతని అవస్థను గమనించేడు చిరునవ్వు వచ్చింది

జరిగిన కథ-12 : సుమతి జగ్గారావుల పెళ్ళి జరిగి [illegible] ఉద్యోగం వచ్చిన తరువాత జయలక్ష్మి పెళ్ళి [illegible] ... ఆ విషయం రామారావుతో [illegible] రామారావు ఉత్సాహంగా [illegible] గమనించి [illegible] రామారావు జయలక్ష్మి పెళ్ళి [illegible] సుభద్ర [illegible] సదభిప్రాయం కల్గింది. రామారావుకి [illegible] సుభద్రను [illegible] సంబంధం [illegible] రామారావు [illegible] ప్రేమిస్తున్న [illegible] వివాహం చేసుకుంటా[illegible] [illegible] మాత్రం ఎలాగైనా [illegible] కుంటుంది. [illegible] జీవితం తన [illegible] పాడు [illegible] [illegible] చేసుకోవాలనుకుంటుంది. రామారావు [illegible] వెంకటరమణ, సుబ్బారావు మాష్టారు [illegible] [illegible] వెళ్ళారు. సుభద్ర, సుబ్బారావు [illegible] [illegible] చెప్పుకొన్నారు. జయలక్ష్మి వారిని [illegible]

"మాష్టారుగారు! ఏమిటివిశేషాలు? మా వాడు బుద్ధిగా చదువుకుంటు-న్నాడా?"

"వెంకటరమణ ఎప్పుడూ బుద్ధిమంతుడే. ఇప్పుడు చదువు మీద శ్రద్ధ ఎక్కువైంది. వెంకటరమణ ఇంట్లోలేడా?"

"బజారుకు వెళ్ళేడు- వచ్చేస్తుంటాడు "

"జనార్ధనయ్యగారు! మీకో ముఖ్యమైన విషయం చెప్పడానికి వచ్చేను నేనేమైన తప్పుగా మాట్లాడితే నన్ను క్షమించండి; "ధైర్యం చేసి అనేసేడు ఉపోద్ఘాతంగ

జనార్ధనయ్య ఆశ్చర్యపోయేడు. పైగా ఆందోళన కల్గింది వెంకటరమణ మళ్ళీ కాలేజీలో ఏదైనా గొడవ తెచ్చేడేమోనని భయపడ్డాడు.

"ఏమిటి మేస్టరుగారు! మళ్ళీ మా రమణ ఏమైన గొడవ తెచ్చాడా?"

"మీ అబ్బాయి గురించి కాదండి ఇది నా విషయం "

"చెప్పండి- సందేహ మెందుకు?"

ఎలా చెప్పడమో తెలియక కాస్త తికమక పడ్డాడు. ఆఖరికి స్థిరపడ్డాడు

"జనార్ధనయ్యగారు! నేను మీ అమ్మాయి సుభద్రను పెండ్లి చేసుకోవా-లనుకుంటున్నాను మీరు దయచేసి నాకు అనుమతి ఇవ్వాలి "

జనార్ధనయ్య విని చాల ఆశ్చర్యపోయేడు. మొదట సుభద్రను ప్రేమించి పెండ్లి చేసుకుంటానని తనకు తానుగ ముందుకు వచ్చిన వ్యక్తి ఉన్నందుకు ఉక్కిరి బిక్కిరయ్యేడు తరువాత ఆనందంతో పొంగిపోయేడు వెనువెంటనే ఆ వ్యక్తి సుబ్బారావు మేస్టరు అయినందుకు సందేహంలో పడిపోయేడు.

రామారావు సంతోషంతో లేచివచ్చి సుబ్బారావుమేష్టరు చేతిని అందు-కున్నాడు ఆదరంగా

"సుబ్బారావుగారు! చాల సంతోషకరమైన మాట చెప్పేరు మీకు మావారి అందరి తరఫున నా ధన్యవాదాలు చెప్పుకుంటున్నాను," అన్నాడు

సుబ్బారావు రామారావు చెప్పిన అభినందనలకు ఆనందించేడు, గాని జనార్దనయ్య తను ఊహించిన దానికి విరుద్ధంగ ఉత్సాహం చూపక పోవడము సుబ్బారావుని చాల నిరుత్సాహ పరచింది

"జనార్ధనయ్యగారు! మీరు మీ సమ్మతిని తెలియ జేయలేదు "

"నాకు అభ్యంతరం లేదు బాబు. కాని అమ్మాయిని, మా ఆవిడను సంప్రదించాలికదా. పెండ్లి అన్నది నూరేళ్ల పంట అన్ని విషయాలు ఆలోచించుకోవాలికదా."

"అమ్మగార్ని కూడా ఒకసారి పిలవండి. నేనే స్వయంగా ఆమెకు చెప్తాను "

జనార్ధనయ్య సంశయపడుతుంటే రామారావు లోనికి వెళ్ళి తల్లిని తీసుకుని వచ్చేడు. తండ్రి నిర్లిప్తతకు సుభద్ర ఆశ్చర్య పోయింది

కామేశ్వరమ్మ గదిలోకివచ్చి సుబ్బారావువంక, భర్తవైపు చూచింది

"సుబ్బారావుగారు నీకో మాట చెప్తానన్నారు," అన్నాడు జనార్ధనయ్య

"మరేమి లేదండి- నేను మీ పెద్దమ్మాయి సుభద్రను వివాహం చేసుకుందా మనుకుంటున్నాను. మీరందరు దయచేసి ఈ పెండ్లికి సమ్మతించమని కోరుకుంటున్నాను నాకు కట్నాలుకాని, కానుకలుకాని ఏమి ఇవ్వనక్కరలేదు. నేను వేటిని ఆశించిన వ్యక్తిని కాను మీ అమ్మాయి నాకు నచ్చింది మీరందరు నా కుంటికాలుని మాత్రం విస్మరించి ఈ పెండ్లికి ఒప్పుకోవాలి మీ అమ్మాయికి ఏ లోటు రానీయను ఎంతో ప్రేమతో చూసుకుంటాను "

సుబ్బారావు మాటలకి కామేశ్వరమ్మ ఎంతో సంతోషించింది.

"బాబూ! మీరు నాకు మీ మాటలతో చాల ఆనందాన్ని కల్గించేరు మీ సహృదయతకు మీరు చిన్నవారైనా ఇవే నా నమస్కారాలు- కాని ఒక్క మాట. అమ్మాయితో నేనోసారి మాట్లాడి మీరు రేపోసారి వస్తే మా అందరి ఉద్దేశం తెలియజేస్తాను. అంత వరకు మీరు మమ్మల్ని క్షమించి మమ్మల్నోసారి ఆలోచించుకోనివ్వాలి "

సుబ్బారావు నిట్టూర్చి నిల్చున్నాడు

సరే మరి నేను వెళ్లొస్తాను రేపు నేను వచ్చినప్పుడు నాకు నిరాశ-కల్గించకండి." అని వెళ్లి పోయేడు

బస్సు స్టాపు వరకు రామారావు వెళ్లి సుబ్బారావుకి ధైర్యం చెప్పేడు

మేస్టరుగారు! ఈ పెండ్లి కుదిరినట్లే భావించండి ఆనవాయితీగా సుభద్రను తల్లి దండ్రులు అడగాలికదా! అందుకే మా అమ్మ, నాన్నగారు వెంటనే జవాబు చెప్పలేక పోయేరు మీరు మరోలా భావించకండి మీరు నా చెల్లెల్ని పెండ్లాడుతానంటే నిజంగా నా కెంతో సంతోషం కల్గింది "

'రామారావుగారు! మీకో రహస్యం చెప్పనా గతవారం మనం తాటిపూడికి పిక్‌నిక్‌కి వెళ్లినప్పుడు నేను సుభద్రగార్ని అడిగేను. నా మనస్సులోని మాట చెప్పి ఆమె నన్ను పెండ్లాడడానికి సమ్మతించేరు "

'అయితే ఇంకేం కంగ్రాచ్యులేషన్స్! రేపు తప్పకుండా రండి "

"అలాగే '

తేలికైన హృదయంతో సుబ్బారావు తన వూరుకు పోయేడు

తల్లి, తండ్రి సుభద్రకు ఈ విషయం చెప్పి ఆమె ఉద్దేశం అడిగేరు

"నాకు ఇష్టమే '

'అది కాదమ్మా- అతడి కాలు కుంటిది అది తెల్సుకదా పైగా నల్సురు ఏమనుకుంటారు? అమ్మాయికి ఓ అవిటి వాడికిచ్చి పెండ్లి చేసేరు అంటారు మేము నీకు పెండ్లి చెయ్యలేక కాదమ్మా వచ్చిన సంబంధం ఏదైనా ఒప్పేసు-కుందికి కాలం కల్సి వస్తే మాంచి సంబంధమే కుదురుతుంది "

అమ్మా! ఇన్ని మాట లెందుకు అతనికి కాలు కుంటిదికాక కాలులేక పోయిన అతడ్ని చేసుకుందికి నాకు సమ్మతమే సుబ్బారావుగారు చాల యోగ్యులు, చాల ఉత్తములు "

తరువాత కామేశ్వరమ్మ, జనార్దనయ్య కొంత తర్జన భర్జన చేసిం-తరువాత కొడుకు రామారావును సంప్రతించి ఆ వివాహానికి ఒప్పుకున్నారు

ఆ మరునాడు సుబ్బారావు రాగానే జనార్దనయ్య ఆనందంతో ఆహ్వా-నించేడు

'అమ్మాయిని అడిగేం ఆమెకు ఈ వివాహం సమ్మతమే మీ తల్లి తండ్రుల అడ్రసు ఇస్తే నేను వెళ్లి మాట్లాడి వస్తాను."

'మీరు వచ్చే శనివారంనాడు వెళ్లండి నేను ముందుగా ఇవాళే మా వాళ్లకు అన్ని వివరాలతో ఉత్తరం వ్రాస్తాను మా వాళ్ళు ఏమీ-కట్నం కోరరు నాకు తెల్సు ఏవో లాంఛనాలు అన్నీ కలిపి రెండువేలకు మించకుండా కోరతారు వాళ్ల సంతృప్తికి ఒప్పుకోండి అదే నా కోరిక"

"అదెంత మాట బాబు! కట్నం కోరనప్పుడు లాంఛనా లివ్వడం మాకేమి భారంకాదు, మేము గౌరవంగ, బాగానే వివాహం జరిపిస్తాం మీ వాళ్లెక్కడ ఉన్నారన్నారు "

'మానాన్నగారు రిటైరయ్యేరు మా అమ్మ, నాన్న, మా తమ్ముడు శ్రీకాకుళంలో ఉన్నారు మా నాన్నగారు ఇన్సూరెన్సు ఆఫీసులో పని చేసేవారు. మేమిద్దరం సంతానం మా తమ్ముడు శ్రీకాకుళంలో పాలిటెక్నిక్ చదువు-తున్నాడు ఓ తెల్లకాగితం అందుకోండి నేను మా నాన్నగారి యడ్రసు వ్రాసిస్తాను "

పెండ్లి మాటలయ్యేయి ముహూర్తం దగ్గర్లోనే పెట్టేరు ఈ వార్త తెల్సి జయలక్ష్మి చాల సంతోషించింది

"ఏం సుభద్రా! గడుసరివే ఏమీ తెలియని అమాయకురాల్లా నటించి సుబ్బారావు మేస్టర్ని ప్రేమించి దారిలోకి తెచ్చేవే పాపం! చాలా నెమ్మ-దస్తుడు ఈ పెంకి పిల్లవలలో పడ్డాడు – ఏం బాధపడాలో!"

"చూడు వదినా–అతడేం అమాయకుడు కాడు, నేనేమీ పెంకిదాన్ని కాను ఇద్దరం సమ ఉజ్జీలమే ఇంతకీ నాకన్న నువ్వే చాలా ఉత్సాహ పడి-పోతున్నావు నాకు తెల్సులే నీ కండ్లలో ఆకాంతులేమో"

"సుభద్రా! నీకు పెండ్లి అంటే నాకు ఆనందం కాదూ?"

ఆనందమే– నీ పెండ్లికి లైను క్లియర్ అవుతుందని చూడువదినా! అంత తొందర పడకు– మా అన్నయ్య చాల కోపిష్టి పెండ్లి అవగానే నిన్నేమి కొడ్తాడో అని భయంగా ఉంది

'చా! పో! అంత ఉత్తముణ్ణి నేను మరొకర్ని ఎరగను

"ఓహో! పెండ్లి కాకుండానే వెనుక వేసుకుని వస్తున్నావు వదినా! ఒకలాగ చెయ్యకూడదు?" నాపెండ్లితో పాటు నీ పెండ్లీ చేసుకోకూడదూ?"

జయలక్ష్మి ఏం చెప్పడానికి ముందుగా కాస్త నిగ్గు కల్గినా తరువాత మెల్లగా తలెత్తి–

"మీ అన్నయ్యకు చెప్పరాదూ?" అంది

తరువాత–

'అన్నయ్యా! నా పెండ్లి, ఈ ముహూర్తానికే ఇక్కడే నీ పెండ్లి జరిపేస్తే బాగుంటుంది కదూ?

"ఈ ఉద్దేశం నీకే కల్గిందా– ఎవ్వరైనా చెప్పేరా? ఆ ముందటి రోజు జయలక్ష్మి వచ్చి వెళ్లడం రామారావుకి తెల్సు

"వదిన తొందర పడుతుంది 'అందుకే మరి ఆలస్యం దేనికి?'

"నువ్వే మీ వదినను ఉసిగొల్పి ఉంటావు నీ సంగతి నాకు తెల్సు సరే ఎలాగు ప్రస్తావన వచ్చింది గనుక నువ్వే నాకు సహాయం చెయ్యి అమ్మకు నాన్నగార్కి చెప్పి నా పెండ్లి అప్పుడే జరిగేటట్టు చెయ్యి "

"సరే– నేను చేయిస్తాగాని నాకు ఆడపడుచు కట్నం అయిదు వంద-లిప్పించాలి "













"ఒకే- వాళ్ళివ్వకపోతే నేనే మీ వదిన తరపున ఇస్తాను"

"నువ్వు రేపు ఆఫీసుకు వెళ్ళిపోగానే నేను అమ్మ నాన్నను కదపి వస్తాను

## 21

కొడుకిచ్చిన మాటప్రకారం తల్లి తండ్రులు కూతురు పెండ్లితో బాటుగ కొడుకు పెండ్లి చేయడానికి సమ్మతించేరు జనార్ధనయ్య ఆ విషయమై అడగడానికి కొత్తవలస వెళ్ళేడు

"జనార్ధనయ్యగారు! మీరుకోరి ఏ కట్న కానుకల్ని ఆశించకుండ మీ అబ్బాయికి మా అమ్మాయిని చేసుకుంటామంటే నా కంతకన్న వేరే అదృష్ట మేముంటుంది చెప్పండి కాని నేను ఒక్క మాట చెప్పాలి మా అబ్బాయి చదువు పూర్తయింది ఉద్యోగ ప్రయత్నం చేస్తున్నాడు త్వరలోనే ఉద్యోగం దొరకొచ్చు మావాడికి ఉద్యోగం దొరికిన మరునాడే నేనే స్వయంగ మీ ఇంటికి వచ్చి మిమ్మల్ని సంప్రదించి ముహూర్తం పెట్టిస్తాను అంతవరకు మీరు నన్ను క్షమించాలి ఇంతకు మించి నాకు దైవసాక్షిగ మరే ఉద్దేశంలేదు గనుక మీరు దయచేసి అన్యధా భావించకండి"

చేసేదేమీలేక జనార్ధనయ్య ఇంటికి తిరిగొచ్చి ఈ విషయాన్ని అందరికి చెప్పేడు రామారావుకి కుటుంబరావు మొండితనం మీద కోపం వచ్చింది ఆ మరునాటి సాయంత్రం ఆఫీసు అయిపోగానే జయలక్ష్మిని కలసి ప్రస్తా-వించేడు ఇద్దరూ తరువాత ఏదో బస్సులోనో, ట్రెయినులోనో వెళ్దా-మనుకుని బీచికి పోయి కూర్చున్నారు

"జయా! మీ నాన్న మొండి వైఖరి నా కేమీ అర్ధం కావడంలేదు మీ చెల్లెలికి పెండ్లి అయిపోయింది నా చెల్లెలుకి పెండ్లి అయిపోయింది ఇన్నాళ్ళు ఏవో సాకు చెప్తూ వచ్చేరు ఇప్పుడు మరేమి వచ్చింది? మీ తమ్ముడికి ఉద్యోగం దొరికేవరకూ నీ పెండ్లి ప్రసంగం జరగడానికి వీలులేదని కూర్చున్నాడు మీ నాన్న ఇదేమి సబబు చెప్పు?

"రామారావు తొందర పడకు- నేను మళ్ళీ మా నాన్నతో మాట్లాడుతాను మానాన్న జంకంతా నాకు పెండ్లయిపోతే ఆ ఇల్లు ఎలా గడుస్తుందని- అంతే"

"నేను ముందే చెప్పేనుగా నీ జీతం నీదేగాని నాదికాదని నీ జీతం నువ్వెలా వాడుకున్నా ప్రశ్నించే హక్కు నాకులేదని నువ్వు కష్టపడి ఆర్జించిన డబ్బును తీసుకునే కుసంస్కారిని, నికృష్టుణ్ని కానని చెప్తున్నాగా, మనం పెండ్లి చేసుకున్నాక నువ్వు నాకు వండిపెడ్తావు, సేవలు చేస్తావు నిన్ను పోషించే బాధ్యత నాది కష్ట సుఖాలలో ఒకర్ని ఒకరం ఆదుకుంటాము అంతే మా నాన్న బీదవాడే మా అమ్మ ఏమీ చదువుకోలేదు ఏ ఉద్యోగం చెయ్యలేదు ఆ ఇంటికి ఇల్లాలు మాత్రమే అంతమాత్రం చేత మా నాన్నగారు మా అమ్మను పోషించలేదా, గౌరవించలేదా?, అభిమానించలేదా? అందరి భార్యలు ఉద్యోగాలే చేస్తున్నారా? మా డివిజనల్ ఇంజనీరుగారి భార్య ఏ ఉద్యోగం చేస్తున్నదని?ఆమె దర్జాగా డబ్బు ఖర్చు చేయడం తప్పు? అందు-చేత నీజీతం నా చేతుల్లో పోస్తే తప్ప నిన్ను పోషించడం, ఆదరించడం చెయ్యనని నువ్వుగాని మీ నాన్నగాని అనుకోకండి"

"అదేం మాట రామారావు? నిన్ను నేను అర్ధం చేసుకోలేదని భ్రమపడకు నన్ను నేను ఎంతగా ఎరుగుదునో నిన్ను నేను అంతగా ఎరుగుదును నువ్వేమి ఆవేశపడకు. నేను మా నాన్నగారితో మాట్లాడతాగా- ఇంతకీ అబ్బాయిగార్కి పెండ్లిమీదకు మనసు పోయింది- అంతేగా!"

"నువ్వీ విషయాన్ని పరిహాసంగా తీసుకోకు నీకు పెండ్లి చేసుకోవాలని లేదూ- నిజం చెప్పు?"

జయలక్ష్మి ప్రేమగా రామారావు ముఖంలోకి చూసి రామారావు చేతిని అందుకుని తన హృదయం మీద ఉంచి-






"ఇప్పుడు చెప్పు నా మనస్సు ఏం చెప్తుందో?"

అప్పుడే చీకటి పడింది మనుష్యులు లీలా మాత్రంగానే గోచరిస్తున్నారు రామారావు హఠాత్తుగ ఆవేశపూరితంగ జయలక్ష్మిని తన కౌగిలిలోకి తీసుకున్నాడు జయలక్ష్మి ఆనందంతో ఆ వెచ్చని కౌగిలిలో ఒదిగి పోయింది రామారావు బరువెక్కిన స్వరంతో,- "జయా! నువ్వు నాకు కావాలి," అని కోరేడు

జయలక్ష్మి ఆ కౌగిలిలోంచి విడిపోయి రామారావు రెండు చేతుల్ని తన చేతులలోకి తీసుకుని ఎంతో ప్రేమతో -

"రామూ! ఈ నాశరీరం, మనస్సు, ఆత్మ అంతా నీదే! ఎప్పుడు కావలిస్తే అప్పుడు తీసుకో నీయెందు నా కెటువంటి సంశయంలేదు."

రామారావు ఏదో ఆలోచిస్తున్నాడు ఇంతలో కూల్‌డ్రింక్సువాడు అట్లావచ్చేడు రామారావు రెండు లిమ్కాలు కొని, ఒకటి జయలక్ష్మికిచ్చి తనొకటి పుచ్చుకున్నాడు కూల్‌డ్రింక్‌వాడు వెళ్ళిపోయిన తరువాత జయలక్ష్మి చేతుల్ని ప్రేమతో ముద్దు పెట్టుకుని- "పద జయ వెళ్దాం," అని లేచేడు

ఇద్దరు ఆటో వద్దకు వచ్చేరు అప్సరా హోటలుకి పోనివ్వమన్నాడు రామారావు. జయలక్ష్మి గుండె అతి వేగంగ కొట్టుకుంటోంది ఏదో ఆందోళన కల్గనారంభించింది ఇద్దరు అప్సర హోటలు చేరుకున్నాక రామారావు ఆటో వాడికి డబ్బులిచ్చేసి ఎయిర్ కండిషన్డు భోజనశాలలోకి దారితీసేడు జయలక్ష్మి మారు మాటాడకుండా అతడ్ని అనుసరించింది.

భోజనం ముగిసింది. అంతవరకు ఎవ్వరు మాట్లాడలేదు ఎవరి ఆలోచనలు వారివి ఎవరి ఆందోళనలు వారివి లేచేవేళకి జయలక్ష్మి వణుకుతున్న చేతితో రామారావు చేతిని తాకింది రామారావు జయలక్ష్మిలోని కంపనను గ్రహించేడు అనురాగంతో, చిరునవ్వుతో జయలక్ష్మి ముఖంలోకి చూచేడు రామారావు ఇంతసేపు అదే ఆలోచనలో ఉన్నాడు ఆలోచనల ఫలితంగ వివేకం మేల్కొని ఆవేశం తగ్గింది

"జయా! పద పోదాం," అని హోటలు బయటకు దారితీసేడు.

ఇద్దరు కలసి ఆటోలో బస్సు స్టాండుకు వచ్చేరు. మరో పావుగంటలో కొత్తవలస మీదుగ విజయనగరం పోయే బస్సు వస్తుందన్నారు ఇద్దరు దూరంగ పోయి మాట్లాడుకున్నారు ఆ సరికి ఇద్దరి మనస్సులు ప్రశాంతంగ నున్నాయి

"రామారావు! నేనేమైన నీ మనస్సును బాధిస్తే చెప్పు, నువ్వేం చెయ్యమన్నా చేస్తాను "

"నాకేమి బాధలేదిప్పుడు సాయంత్రం నీ మీద కోరిక ఉధృత మయిందనుకో- గాని బాగా ఆలోచించేక నాకు తట్టిందేమిటంటే, తొందరపడి మనం ఏ హోటలు గదిలో దూరినా, ఆ ఛాయ మన జీవితంలో పడుతుందని నాకు కావల్సింది మన దాంపత్య జీవితం చాల నిర్మలంగ పోవాలని రహస్యమన్న, దొంగతనమన్న నాకు మొదటి నుంచీ ఏహ్యతే కాని ఒక్కొక్కప్పుడు మన ఆవేశాలే మన వివేకాన్ని అణగ దొక్కేస్తాయి ఏమయితేనేం మనమిప్పుడు ఆ ఉద్రేకం నుండి బయట పడ్డాం ముందు సంగతి ఆలోచించు "

"రామారావు! నేను మా నాన్నగారితో మాట్లాడతాను ముందు మీ చెల్లిలు పెండ్లి అయిపోని తరువాత నెల్లాళ్ల వరకు నాకు టైమియ్యి ఈ లోగా మా వాళ్లను ఒప్పిస్తాను. వాళ్లు ఒక వేళ ఇంకా కాదంటే ఇద్దరం మీ ఇంట్లోనేనా, సింహాచలంలోనైనా వివాహం చేసుకుందాం- సరేనా "

"ఒకే- ఇంకా ఆలస్యం చేస్తే నీకే ప్రమాదం- జాగ్రత్త!" నవ్వుతూ జయలక్ష్మిని హెచ్చరించేడు

"నీ వల్ల ప్రమాదం జరిగినా నాకు ప్రమాదమే," అని నవ్వుతూ జయలక్ష్మి జవాబు చెప్పింది.

"అమ్మాయికి తొందరగానే ఉందే!"

* * * * *

సుభద్ర పెండ్లి బాగానే జరిగింది. రెండు కుటుంబాలు ఒకే కుటుంబంలా ఎంతో అన్యోన్యతతో వ్యవహరించేయి ఒక వెయ్యి రూపాయల ఖర్చుతో సింపుల్‌గా గౌరవంగా పెండ్లి జరిగి పోయింది. మరో వెయ్యి రూపాయలు ఖర్చు చేసి ఏన్నాళ్ళు బాగా జరిపించి, సుభద్రకు కావల్సిన బట్టలు కొని కార్యం చేసి సుభద్రను అత్తవారింటికి పంపి ఆ కుటుంబ సభ్యులు హాయిగా ఊపిరి తీసుకున్నారు

రామారావు తరువాత మామూలుగానే ట్రయినులో ఆఫీసుకు పోతున్నాడు. ఆ కుటుంబం మరే చికాకులు లేక సాగిపోతుంది

జయలక్ష్మి కోరిన నెల్లాళ్ల గడువు గడచి ఓ వారమయింది ఆ ఆదివారం ఆనందంతో జయలక్ష్మి కంటకాపల్లి వచ్చింది

"రామారావు! చాల సంతోషకరమైన వార్త తెచ్చేను చెప్పుకో "

"మన పెండ్లికి మీ నాన్న ఒప్పుకున్నారు అదేనా?"

"కాదు- మా తమ్ముడికి విశాఖలో హిందూస్థాన్ జింకులో టెక్నీషియన్‌గా ఉద్యోగ మయింది మా నాన్నగారు విశాఖలో ఇల్లు అద్దెకు తీసుకుని కాపురాన్ని అక్కడకు మార్చివేద్దామనుకుంటున్నారు "

"మరి మన పెండ్లి?"

"కొత్తవలసలో పెండ్లి జరిపించే విశాఖకు పోతామన్నారు మా నాన్నగారు బహుశా ఈ వారంలోనే ఇక్కడకు వచ్చి మీ వాళ్లతో సంప్రదించి

## కాగితప్పు పడవలు

ముహూర్తం నిశ్చయం చేస్తామన్నారు

ఇప్పుడు నీతో చెప్పేరా?

అదేం మాట! నేను పెండ్లికూతుర్ని కదా నాతో చర్చిస్తారా? మనిద్దరి తరపున మాట్లాడడానికి మా అక్కయ్య ఉంది కదా ఆమే అన్ని సెటిల్ చేసింది

జయా! ఒక విషయం చెప్పనా?'

చెప్పు కొంటెగా చూసింది

ఇవాళ నీ కండ్లు ఎంత అందంగా మెరిసి పోతున్నాయో తెలుసా?'

మరి పెండ్లి అంటే ఏ ఆడపిల్లకైనా సంతోషం కాదూ?

గుడ్! అమ్మాయికి మూడు వచ్చేసింది '

'ఉండు మీ నాన్నగార్కి, మీ అమ్మగార్కి ఈ శుభవార్త చెప్పివస్తా "

ఏం మనం పెండ్లి సంగతా?'

ఛీ! ఎంత ఉబలాటంగా ఉన్నా ఆడదాన్ని కదా– అది కాదు మా తమ్ముడికి ఉద్యోగ మయిందని చెప్తా '

'అలా చెప్పి మన పెండ్లి గురించి వాళ్లకు ఓ హింట్ ఇవ్వడానికా?"

పో– మరీ పెంకి మాటలు! అని వంటింట్లోకి దారితీసింది

అత్తయ్యా! మా తమ్ముడికి విశాఖపట్నంలో ఉద్యోగ మయింది '

చాల మంచి మాట చెప్పేవు "

'విన్నారండి– ఇలా రండి చెప్తా"

'ఏమిటే ఏమయింది– ఏమమ్మా ఏమిటయింది "

'మామయ్యా! మా తమ్ముడికి హిందుస్థాన్ జింక్ ఫ్యాక్టరీలో ఉద్యోగ-మయిందండి "

చాల సంతోషమమ్మా– మరి మీ నాన్నగారు ఇప్పటికైన నీకు పెండ్లి చేస్తారా– లేక అదేదో కథలో చెప్పినట్లు మీ తమ్ముడికి ప్రమోషన్ వచ్చే వరకు ఆగాలంటారా?'

"మర్కి ఏ ఆటంకం చెప్పరండి '

'నాకు కోప మొచ్చింది నేను రానని చెప్పు అతడికిష్టముంటే నా వద్దకే వచ్చి ఆ మంచి మాటేదో చెప్పమను '

"అలాగే మామయ్యా– మీ మాటగా చెప్తాను కాని మీరు కోపం తెచ్చుకోకండి "

"అతని కోపం కేమమ్మా– ఇట్టేమండి ఊరుకుంటుంది '

జయలక్ష్మి ఇంటికి చేరేక జనార్ధనయ్య ఆడిన మాటలకి మరిన్ని జోడించి ఘాటుగా వాళ్లకు చెప్పింది దాంతో కమలమ్మ హడలిపోయి వాళ్ల నాన్నకు విన్నవించుకుంది ఎంతో ఆదుర్దాతో

'అదికాదునాన్నా, ఆడ పిల్ల కలవాళ్లం మొండిగ ప్రవర్తిస్తే మరి వాళ్లకు కోపం రాదూ? ఈ నెలలో ఏదో ఒకటి తేల్చకపోతే వాళ్ల అబ్బాయికి వేరే పిల్లను చూసి పెండ్లి చేస్తారట జనార్ధనయ్యగారు అంతటి సౌమ్యులా– మరి అతనికే కోపం వచ్చిందంటే మాటలా! మనం మేల్కొని ఏదో తొందరగా ముహూర్తం పెట్టకపోతే కొంప మునుగుతుంది వాళ్లబ్బాయికి వేరే సంబంధం చూసి పెండ్లి జరిపిస్తే, మనం మన జయకు వేరే పెండ్లి చెయ్యలేం జయ, రామారావు కలసి తిరుగుతున్నారని, ఒకరింటికి మరొకరు రాక పోకలు సాగిస్తున్నారని అందరికీ తెల్సుకదా దానికి చిలువలు పలవులు అల్లి తరువాత చెప్పుకుంటారు పైగా ఓ ఆరువేలైనా ఇస్తేగాని ఇంకెవరూ ఒప్పుకోరుకదా అంతటి డబ్బు మనదగ్గరలేదు ఏ కట్నాన్నీ ఆశించని వాళ్లువారు ఏమంటావు నాన్నా?"

"అలాగేనమ్మా! నీ మాటే కానియ్యి ఈ వారంలోనే మంచి రోజు చూచుకుని కంటకాపల్లి వెళ్తాను– సరేనా?"

ఈ మాటలన్నీ జయలక్ష్మి పక్క గదిలోంచి వింది ఆమె హాయిగా గాలి పీల్చుకుంది ఆ మరునాడే ఈ శుభవార్తను ఆఫీసుకు వెళ్తున్నప్పుడు రామారావుకి చెప్పింది

(ఇంకా ఉంది)

# ఇదీ ఈ దేశం

రావినూతల సువర్ణాకన్నన్



అది ఒక బస్టాపు!

రాత్రి పది గంటలు దాటింది

చుట్టూ చీకటి! ధనుర్మాసపు సీతగాలులు శరీ-రాన్ని ఒణికించేస్తున్నాయి రోడ్డు కిరువైపులా వున్న పట వృక్షాలు గాలికి దెయ్యాల్లా ఊగుతూ అదో-లాంటి శబ్దాలతో జనాన్ని భయపెడుతున్నాయి

అక్కడ షెడ్ లాంటి దేంలేదు ఎప్పుడో, ఏదో క్లబ్‌వారు కట్టించిన షెల్టర్ మాత్రం దాదాపు శిధిలావస్థలో ఉంది అయితే దానిమీద రాయించిన పేర్లు మాత్రం స్పష్టంగా కనిపిస్తున్నాయి

ఆ ప్రాంతాలవారు ఏ వూరు వెళ్ళాలన్నా అక్కడి-కొచ్చి బస్సెక్కాల్సిందే తరవాత మరో బస్సు మారతారో తప్ప ఆ బస్సెక్కకుండా మాత్రం తప్పుకో లేరెవరూ ఒక్క స్వంత వాహనాలున్న వాళ్ళు తప్ప

అలాగే ఆ రాత్రి అక్కడికి చాలామంది చేరారు బస్సు కోసం

కొందరు దూరంగా వున్న కాకా హోటల్లోనూ, మరికొందరు కాస్త దగ్గరగా ఉన్న సారా కొట్లోనూ కూర్చుని వారి వారి తాహతును బట్టి ఒంట్లోని వేడిని పెంచుకుంటూ ఉత్సాహంగా కబుర్లాడు-కుంటున్నారు

అలాంటిచోట నాలుగ్గంటల్నించీ బస్సు కోసం ఎదురు చూస్తూ నిల్చున్నాడు రాజు

బస్సులు వస్తున్నాయి! వెళ్తున్నాయి!

ఎక్కేవాళ్ళు ఎక్కుతున్నారు, దిగేవాళ్ళు దిగు-తున్నారు కానీ అతనికి మాత్రం ప్రవేశం లేదు

నిల్చుని నిల్చుని కాళ్ళు పీకుతున్నాయి!

రాజు ఇరవై రెండేళ్ళ యువకుడు

పేదరానికి ప్రతినిధి!

నాలుగు రోజుల క్రితం ఏదో ట్రైనింగ్ కోసం ఆ వూరొచ్చిన అతనికి పిడుగులాంటి వార్త అందింది టెలిగ్రాం ద్వారా

"మదర్ సీరియస్ స్టార్ట్ ఇమ్మీడియట్లీ" అంటూ

రాజు వూపిరి క్షణం ఆగింది!

అసలు అతను బయల్దేరే ముందే తల్లికి ఆరోగ్యం బాగా లేదు హాస్పటల్లో చేర్పించి, డాక్టర్లు పరవా-లేదన్న తరవాతే అతను బయల్దేరి వచ్చాడు కానీ ఇంతలో ఈ టెలిగ్రాం!

"సీరియస్" అంటే నిజంగా సీరియస్సా లేక తను కంగారు పడతాడని అలా ఇచ్చారా? ఒకవేళ నిజంగా అమ్మ కేదైనా అయితే? ' అను-కుంటేనే అతనికి దుఃఖం ఆగడంలేదు

తనని తాను ఓదార్చుకుని, గబగబా బేగ్‌లో నాలుగు గుడ్డలు పెట్టుకుని చెప్పవలసిన వాళ్ళకి చెప్పి పరుగున ఇక్కడి కొచ్చాడు! అయితే అతనిక బస్సు మాత్రం దొరకలేదు!

అతని తర్వాత వచ్చిన వాళ్ళంతా ఒకక్కరే బస్సెక్కి వెళ్ళిపోతున్నారు

ఇంతమందికి ఉన్న సీట్లు తనకి మాత్రం ఎందుకు లేవు? అని ప్రశ్నించుకుంటే–

నీకు చొరవ లేకపోవడమే!" అంది మనసు

"ఈసారెలాగైనాసరే బస్సు ఆగ్గానే తోసుకు మరీ ఎక్కుతాను!" అనుకున్నాడు రాజు గట్టిగా

దూరంగా ఏదో బస్సు వస్తున్న చప్పుడు!

రాజు కళ్ళు తళుక్కుమన్నాయి

చటుక్కున లేచి నిల్చున్నాడు

బస్సు వచ్చి ఆగింది! అది వాళ్ళ ఊరి బస్సే

గబగబా ఎక్కబోయాడు

"ఆగు! కాళీ లేదు!" అరిచినట్టు అన్నాడు కండెక్టర్

"నేను అర్జంటుగా వెళ్ళాలండీ! ప్లీజ్!" బ్రతిమాలు-తున్నట్టు అన్నాడు రాజు

'ఇక్కడ అర్ధ రాత్రి చల్లో కూర్చుని బస్సుకోసం ఎదురు చూస్తున్నారంటే అందరికీ అర్జంటే మరి! వెకిలిగా నవ్వాడు కండెక్టర్ మరో అతనికి టికెట్టిస్తూ

అదో జోక్ అన్నట్టు కొందరు పకపకలాడారు

"అదికాదండీ! మా అమ్మకి జబ్బుగా ఉంది! నేను తప్పనిసరిగా వెళ్ళాలి! ప్లీజ్!"

"అరె! కాళీ లేదని చెప్పేది నీక్కాదూ? ముందు బస్సు దిగు!"

"ప్లీజ్! "

"దిగు దిగవయ్యా! వెనకాల ఇంకో బస్సొస్తోంది ఎక్కు" అంటూ ఒక్క తోపు తోశాడు కండక్టర్

పడబోయి నిలదొక్కుకున్న రాజు నిస్సహాయంగా చూశాడు

'రైట్ రైట్" అంటూ ఓ పోలి కేక పెట్టాడు కండక్టర్ బస్సు దుమ్ము రేపుకుంటూ వెళ్ళిపోయింది

రాజుకి దుఃఖం వచ్చేస్తోంది

"ఇప్పుడేలా వెళ్ళాలి? అమ్మనెలా చూడాలి? పిచ్చిగా జుట్టు పీక్కున్నాడు

దూరంగా ఉన్న చర్చిలోని గడియారం పన్నెండు గంటలు కొట్టింది.

కాకా హోటల్ ముయ్యడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి

రాజు కళ్ళు చీకట్లు ముసురుకున్నాయి

పొద్దు నెప్పుడో తిన్న పచ్చడి మెతుకులు హరించి పోయాయి అలా నిస్త్రాణగా ఓ చెట్టు మొదట్లో కూలబడ్డాడు

అతనికి తల్లి దండ్రులు, తన ఇల్లు గుర్తొ-చ్చాయి!

*　　　*　　　*

దశరధరామయ్యగారు పౌరోహిత్యం చేసుకు బ్రతికే ఒక పేద బ్రాహ్మడు ఆయనకున్న ముగ్గురు సంతానంలో రాజు ఆఖరివాడు అన్నలిద్దరూ తండ్రి ననుసరించినా అతను మాత్రం పౌరోహిత్యంమీద ఇష్టంలేక, చదువులో పడ్డాడు ఎలాగో కష్టపడి ఇంటర్ కాలేజీ ఫస్ట్న పాసై గోల్డ్ మెడల్ కూడా సంపాదించుకున్నాడు

అయితే ఇంక పై చదువులు చదవడం ఎంత కష్టమో గ్రహించిన రాజు అక్కడితో ఆ చదువు ఆపేసి, తమ వూరికి మూడు వందల కిలో మీటర్ల దూరంలో వున్న మరో ఊళ్ళో ఏదో ట్రైనింగ్ సెంట-రుందని తెలిసి దానికి అప్లై చేసుకున్నాడు అతనికా సీటు తేలిగ్గానే వచ్చింది

ఆ ట్రైనింగ్ పీరియడ్లో స్టైఫండ్ కూడా ఇస్తారు అందుకే రాజు ఆనందంగా బయల్దేరాడు అయితే ఎన్నడూ తన ఇంటిని, తన వారిని వదలి వుండని కారణాన అంత దూరం వంటరిగా వెళ్ళాలంటే ముందు కాస్త దిగులు పడ్డాడు అయినా కొన్నాళ్ళేగా అని సరిపెట్టుకున్నాడు

అతనికి తల్లి దగ్గర బాగా చనువు ఆవిడ కూడా రాజు ఆఖరివాడు కావడానో ఏమో కాస్త గారాబం ఎక్కువే రాజుకి తల్లే ప్రాణం! తల్లే లోకం! తల్లి దగ్గర మరీ పసివాడిలా గారాలు పోయేవాడు అన్నలు, ఇరుగు పొరుగులు అతన్ని "అమ్మ కూచి" అని ఎక్కిరిస్తూండేవారు అయినా అతను పట్టించుకునేవాడు కాదు

"ఇన్నాళ్ళు అమ్మ నొదిలి ఎలా వుంటానో!" అను-కున్నాడు దిగులుగా.

రాజుని పంపడానికి డబ్బు కోసం అనేకచోట్ల ప్రయత్నం చేశాడు దశరథ రామయ్యగారు అయితే పైసా పుట్టలేదు

ఆలోచించి, ఆలోచించి, మనసు కాస్త కష్ట కలిగించినా తన గోల్డ్ మెడల్ తాకట్టు పెట్టి అయిదొందల రూపాయలు తీసుకుని ఓ వంద తండ్రి కిచ్చి మిగతా నాలుగొందలు బేగ్లో పెట్టుకున్నాడు రాజు

అయితే అనుకోని సంఘటన ఒకటి జరిగి


హిమాలయాలు

— పైడిపాటి సుబ్బరామశాస్త్రి

## ఇదీ ఈ దేశం

పోయింది రాజు రేపు వెళ్తాడనగా ఉన్నట్టుండి తల్లికి డమేరియా ప్రారంభం అయింది ఆ వెంటనే డోకులు కూడా మొదలయ్యాయి

కంగారుగా హాస్పటల్కి తీసికెళ్ళారు

ఇక్కడ కాదని అక్కడా, అక్కడ కాదని ఇక్కడా తిప్పి తిప్పి ఉదయం వెళ్ళిన పేషెంట్ని సాయంత్రం అవుతుండగా దయతీల్చి, ఓ వందరూపాయలు పుచ్చుకుని మరీ చేర్చుకున్నాడు ధర్మాసుపత్రిలోని, ధర్మరాజులాంటి ఓ డాక్టరు

రాజు ట్రైనింగ్కి వెళ్లనని మొండికేశాడు కాస్త తేరుకున్న తల్లిదండ్రులు, అన్నలు అతనికి ధైర్యం చెప్పి వెళ్లమన్నారు.

వందరూపాయల మత్తు వదలని డాక్టరు కూడా – మీ అమ్మగారికేం పరవాలేదు! మేం వున్నాం వెళ్లిరా అంటూ అభయం ఇచ్చి మరీ పంపాడు

వెళ్లడమైతే వెళ్లాడుగానీ రాజు మనసు మనసులో లేదు అమ్మకెలా వుందీ? తగ్గివుంటుందా? ఆ! తగ్గే వుంటుంది! ప్రశ్నా, జవాబూ కూడా తనే చెప్పుకుంటూ గడిపాడు

కానీ ఈ రోజు ఈ టెలిగ్రాం!

అతని కెందుకే తల్లి పోయిందనే అనిపిస్తోంది "అతని తృప్తికోసం సీరియస్ అని ఇచ్చుంటారు!" అనుకున్నాడు!"

అతని ధ్యేయమల్లా ఒక్కసారి అమ్మని కళ్లారా చూడాలి! ఆమె చల్లని ఒడిలో తలదాచుకోవాలి! అదే! తను జీవితంలో ఇంకేం కోరుకోడు!

*　　　*　　　*

బస్సు హారన్ భయంకరంగా మోగింది తృళ్లిపడ్డ-రాజు గభాల్న లేచి బస్సెక్కపోయాడు "దిగు! దిగు! ఖాళీలేదు!" మామూలుగానే అరిచాడు కండెక్టర్

ఖాళీ లేకపోతే ఎందుకాపావ్?" అని గద్దించా-లనిపించింది రాజుకి అయినా అవుసరం తనది! అనుకుని –

ప్లీజ్! మా అమ్మగారికి సీరియస్గా ఉంది! సీట్ లేకపోయినా పరవాలేదు నిల్చుంటాను! ఒక్క టిక్కెట్ ఇవ్వండి!" అన్నాడు

అతని గొంతులోంచి కోపం, దుఃఖం, బాధ, నిస్సహాయత్వం నేనంటే నేనని ముందు కురుకు-తున్నాయి

ఈల్లేదు!.. ఇప్పటికే ఓవర్లోడయింది!" అంటూ నిర్దయగా అతన్నొదిలేసి, మరో ఇద్దర్ని ఎక్కించుకుని వెళ్లిపోయాడు కండక్టర్.

కుప్పకూలిపోయిన రాజు మోకాళ్లలో తల దాచుకుని పసివాడిలా భో రుమన్నాడు

బాబూ! ఒక చల్లని పిలుపు!

చివ్వున తలెత్తి చూశాడు రాజు

ఎదురుగా ఓ వృద్ధుడు!

ఏడికెల్లాలి బాబూ?" అన్నాడు మెల్లగా చెప్పాడు రాజు

శానా బస్సులెల్లిపోయాయిగా?"

'ఎక్కించుకోలేదు!" మరీ పసివాడిలా అన్నాడు రాజు

పిచ్చి అవతారంలా ఉన్న అతన్ని బుజ్జగించి అన్ని వివరాలూ తెలుసుకున్నాడా వృద్ధుడు

"ఆ కండట్రికి డబ్బేమైనా ఇచ్చావా?" అన్నాడు అనుమానంగా.

'డబ్బా? టికెట్కేనా?' అమాయకంగా అన్నాడు రాజు

'కాదు నిన్ను బస్సెక్కనిచ్చినందుకు!"

"అదేమిటి?" తెల్లబోయాడు రాజు

"అదంతే! ఇటుకాసి బస్సులు ఎక్కువరావు వచ్చినా మా రద్దీగా వుంటాయి అయినా జనం ఎక్కడం మాన్రు! అందుకే సమయాన్ని బట్టి కండట్రు డబ్బుచ్చుకుంటాడు పొద్దుగూకితే మరీ రేటు పెరుగుద్ది!" వివరించాడు ముసలతను

"అంటే, లంచమన్నమాట!

"అయ్యో! పిచ్చి మారాజా!" ఇయ్యన్నీ నీకొత్త-నాగుంది ఈ పని నువ్ ముందే సేసుంటే ఈపాటికి సగం దూరం ఎల్లిపోయేవోడివి పోన్లే! ఈసారి బస్సొచ్చినప్పుడు కండట్రు సేతిలో ఓ పది రూపాయ-లెట్టు!"

"లంచం ఇస్తావా? అని కసిరితే?" భయంగా అన్నాడు రాజు

అతని అమాయకత్వానికి జాలిగా నవ్వాడా వృద్ధుడు

ఏం పరవాలేదు! సొదార్నంగా ఇక్కడ జరిగే పనే అధి! నీ కెందుకు ఈసారిచ్చి సూడు! నేనికాడే వుంటాను ఏదన్నా ఒత్తే నేను సూసుకుంటాను ఇదే ఆకరి బస్సు ఎలాగైనా ఎక్కియ్యి!" హెచ్చరించాడు వృద్ధుడు

"అలాగే" అన్నట్టు తల ఊపాడు రాజు

వారపత్రికలకు ఒరవడిదిద్దిన

# ఆంధ్రపత్రిక

సంస్థ నుంచి వెలువడిన మరో వనితా పక్షపత్రిక

# కలువబాల



పఠితలను ఆలోచింపచేసే రచనలు,
వినూతన శీర్షికలు, పూర్తి ఆఫ్‌సెట్ ముద్రణ

$\frac{1}{4}$ డెమ్మీ సైజు.

మరో పది నిమిషాల్లో బస్సొచ్చి ఆగింది . వెళ్ళు! అన్నట్టు రాజుని ముందుకు నెట్టాడు ముసలతను రాజు ఎక్కాడు.

"దిగు! దిగు! ఖాళీ లేదు!" నెట్టబోయాడు కండక్టర్

రాజు కంగారుగా ముసలతనికేసి చూశాడు అతని చేతిలోని పది రూపాయల నోటు నలిగిపోతోంది లంచం ఇవ్వడంలో కూడా ఇంతకష్టం వుంటుందని తె లియదతనికి

"ఇవ్వు!" అన్నట్టు సైగ చేశాడు ముసలతను

రాజు తెగించి నోటుని కండక్టర్ చేతిలో పెట్టి గుప్పెటమూసి – .ప్లీజ్!" అన్నాడు చిత్రంగా కండక్టర్ మొహం ప్రసన్నంగా అయిపోయింది

"అదిగో!. అక్కడ కూర్చోండి!" మాటలో కూడా మర్యాద! మసగ బారిన కళ్లతో రెండు చేతులూ జోడించి – "వెళ్తొస్తా తాతా!" అన్నాడు రాజు ముసలతనితో

"ఎల్లుబాబూ! మీ యమ్మకీపాటికి తగ్గిపోయే వుంటది!" ధైర్యం చెప్తూ వీడ్కోలిచ్చాడు వృద్ధుడు

"రైట్! రైట్!" ఉత్సాహంగా అరిచాడు కండక్టరు

* * *

"బస్సు' గమ్య "స్థానం చేరింది!"

రాజు గబగబా లేచి బేగ్ అందుకున్నాడు

ఒళ్ళు తూలిపోతోంది! శారీరకంగానూ, మానసికంగానూ అతను బాగా అలసిపోయాడు

అలాగే తూలుతూ బస్సుదిగి ఓ రిక్షా ఎక్కి కూర్చుని ఏరియా చెప్పాడు

"ఇప్పుడు అమ్మ ఏ స్థితిలో ఉంటుంది?. బెడ్-మీదా?, లేక వీధి అరుగుమీదా? అదీగాక ముంగిట అంతిమ యాత్ర వాహనం మీదా?

ఏమో! అమ్మ ఎక్కడున్నా ఒక్కసారి చూడాలి! నా ప్రాణాలు పోయినా సరే అమ్మని చూడాలి! ఆమె స్పర్శలోని చల్లదనాన్ని చివరిసారైనా అనుభవించాలి! "

"ఇదో! రామ్మందిరం కాడికొచ్చేసినం బాబూ! అన్న రిక్షావాడి మాటలకి తృళ్ళిపడ్డాడు రాజు

దూరంగా తమ ఇల్లు కనిపిస్తోంది!

హడావిడేం లేదు!

రిక్షావాడు అడిగిన డబ్బు ఇచ్చేసి గబగబా తన ఇంటివైపు అడుగులు వేశాడు

ఇంటి ముందు ఛాయలు చూసి కొయ్యబారిపోయాడు

ఇంటి ముందు, నీళ్ళు, పూలు, దర్భలు, కాలిపోయిన పిడక ముక్కలు! అతనికి పరిస్థితిని విప్పి చెప్పాయి

"అంటే .అమ్మ? ."అమ్మా!" అంటూ పిచ్చివాడిలా ఇంట్లోకి పరిగెత్తాడు రాజు, బంధువులంతా గొల్లుమన్నారు

'అమ్మని ఎప్పుడు తీసికెళ్లారు?" పింతల్లిని కుదుపుతూ అడిగాడు రాజు

అతనికి ఏడుపు రావడం లేదు.

"ఇప్పుడేరా నాయనా!" అంటూ అతన్ని పట్టుకుని

## జపాన్ పెళ్ళిళ్ళు!

నమ్మండి, నమ్మకపోండి... యువ జపాను జంట పెండ్లి చేసుకోవడానికయే సగటు ఖర్చు 6.86 మిలియన్ల యెన్‌లు (3 లక్షల రూ.లకు పైగా) ఖర్చు అవుతాయని ఒక జపాన్ ప్రభుత్వ బ్యాంక్ జరిపిన సర్వేలో బయట పడింది.

వివాహానికి వరుడి తాలుకు ఖర్చులిలా వుంటాయి 8,40,000 యెన్‌లు (40,000 రూ.లు) పెళ్ళి నిశ్చితార్థ సమయంలో వధువు తల్లిదండ్రులకు కానుకగా 1.38 మిలియన్‌ల యెన్‌లు (70,000 రూ.లు) ఫర్నిచర్ తదితర గృహ ఖర్చులకు 4,30,000 యెన్‌లు (20,000 రూ.లకు పైగా) పెండ్లికీ, విందుకూ అయ్యే ఖర్చుకూ, 2,80,000 యెన్‌లు (15,000 రూ.లు) హనీమూన్ ఖర్చుల కోసం దాచవలసి వుంటుంది.

కాగా వధువు తన పెళ్ళి నిశ్చితార్థ సమయంలో వరుడి తల్లి దండ్రులకు బదులు కానుకగా 4,20,000 యెన్‌లు (20,000 రూ.లు), 2.8 మిలియన్‌లు యెన్‌లు (1.4 లక్షల రూ.) ఫర్నిచర్ తదితర ఖర్చులకు, పెళ్ళికి, విందుకూ తన వంతు ఖర్చుగా 4,30,000 యెన్‌లు (20,000 రూ.లకు పైగా), హనీమూన్‌కు 2,80,000 యెన్‌లు (15,000 రూ.లు) ఖర్చు పెట్టాల్సి వుంటుంది!

(జ. వా.)

## ఇదీ ఈ దేశం

బావురుమందావిడ

తనని చుట్టిన ఆ చేతుల్ని విసురుగా విదిలించుకుని వీధిలోకి పరిగెత్తాడు

అతని ప్రవర్తనకి బిత్తరపోయింది పినతల్లి

"తొందరగా వెళ్లరా 'నాయనా'. .. వెంటనే వెళ్తే చూపొందచ్చు!" వెనకనించి అరుస్తూ, స్మశానం గుర్తులూ అవీ చెప్పాడు తాతగారు ఏడుస్తూనే.

రన్నింగ్ రేస్‌లా పరుగు తీశాడు రాజు అతనికి సైకిల్ తొక్కడంరాదు.

స్మశానం చాలా దూరం!

'ఎలా వెళ్ళాలి? ఎలా? ఎలా? ఎలా?"

దిక్కుతోచని రాజు సెంటర్లో నిల్చుని అటుకేసి వెళ్ళే కార్లనీ, స్కూటర్లనీ ఆపడానికి ప్రయత్నించాడు

కొందరు ఆగి తిట్టిపోశారు!

మరికొందరు ఆగకుండానే–"పాపం! ఎవరో పిచ్చివాడు!" అనుకుంటూ సాగిపోయారు

కచ్చగా జుట్టు పీక్కున్నాడు రాజు.

రిచ్చారానా బాబూ?" ఆశగా అడిగాడో రిక్షావాడు

'వద్దు!" అంటూనే దూరంగా ఓ ఆటో రావడం చూసి ఆశగా చప్పట్లు కొట్టాడు రాజు

ఆటో వాడు చూసినా ఆగలేదు

ఉసూరుమన్నాడు రాజు

రెండు మూడు ఆటోలు అలా చూసీ చూడనట్టు వెళ్ళిపోయాక ఓ ఆటోవాడు దయతలచి ఆగాడు

"ఎక్కడికి?" అన్నాడు నిర్లక్ష్యంగా

ఆటో లో కూర్చుంటూ చెప్పాడు రాజు

కళ్ళు చిట్లించి అనుమానంగా చూశాడు ఆటోవాడు

"ప్లీజ్! తొందరగా పోనీండి! అర్జంట్!" వేడికోలుగా అన్నాడు రాజు

"ముప్పయి రూపాయలవుతుంది!" బీడీ నుసి విదిలిస్తూ తాపీగా అన్నాడతను

"ముప్పయి రూపాయలా? తృళ్ళిపడ్డాడు రాజు

'అవును!'

"మీటర్‌కి అయిదు రూపాయ లవుతుంది!

పైన ఇంకో రూపాయిస్తాను!" బ్రతిమాలాడు రాజు

"కుదరదు"

"ఇది అన్యాయం!" నిస్సహాయంగా అరిచాడు రాజు

'అన్యాయమో న్యాయమో! ఇస్తావా పొమ్మంటావా?" స్టార్ట్ చేస్తూ అన్నాడు ఆటో అతను

కృంగిపోయిన రాజు కంగారుగా జేబులోని డబ్బు తీసి లెక్క చూసుకున్నాడు

ముప్పయి రూపాయలపైన ముప్పావలా ఉంది పద" అన్నాడు ఆదుర్దాగా

ఆటో అతను విజయగర్వంతో ఆటో స్టార్ట్ చేశాడు

'కాస్త తొందరగా పోనీ!'

ఆటో సడన్‌బ్రేక్‌తో ఆగింది కొంతదూరం వెళ్ళాక

అక్కడేదో తగూ!

ట్రాఫిక్ జామ్ అయిపోయింది!

రాజు మొహం పాలిపోయింది

"బాబూ!, ఈ తగూ ఇప్పట్లో తేలేలా లేదు! మనం అలా పక్కనించి వెళ్దాం!" అన్నాడు

"అదెలా కుదురుతుంది? చాలా చుట్టు!"

తగూని వేడుగ్గా చూస్తూ అన్నాడు ఆటో వాడు

"నీకు డబ్బు ఎక్కువే ఇస్తున్నానుగా ప్లీజ్! అటువైపు పద!"

"అలా అయితే మరో పది రూపాయలౌతుంది!" నిర్దయగా అన్నాడతను

కొయ్యబారి పోయాడు రాజు.

"అయినా నీ దగ్గర లేవుగా ఇంకేమిస్తావులే!" అన్నాడు మళ్ళీ అతనే.

రాజుకి దిక్కుతోచలేదు.

మరో పావుగంట తరవాత పోలీసులు రంగంలోకి రావడంతో గొడవ సర్దుమణిగింది

ఆటో తిరిగి బయల్దేరింది.

ఆ కాస్సేపటిలో నరకమంతా అక్కడే అనుభవించాడు రాజు

చివరికి ఎలాగో స్మశానం చేరుకుంది ఆటో.

ఒణుకుతున్న కాళ్ళతో దిగి ఆటో వాడికి డబ్బు ఇచ్చేసి పరుగులాంటి నడకతో గేట్లోంచి లోపలి-కెళ్ళాడు.

కళ్ళు పత్తి_కాయల్లా చేసుకుని చూశాడు.

"అమ్మ ఏదీ?" అనుకుంటూ.

కాస్త దూరంలో తండ్రీ, బంధువులూ తడి బట్టలతో కనిపించారు.

"నాన్నా!" అంటూ అరిచాడు రాజు.

ఇవతలగా వచ్చి కొడుకుని పట్టుకుని భోరు-మన్నాడు తండ్రి.

అన్నలు కూడా కుళ్ళి కుళ్ళి ఏడుస్తున్నారు. అయితే రాజుకి మాత్రం ఏడుపు రావడంలేదు. అమ్మకోసం అతని కళ్ళు ఇంకా ఆశగా వెతుకుతూనే ఉన్నాయి.

"అమ్మ....?" అస్పష్టంగా అన్నాడు.

"ఇంకెక్కడి అమ్మరా బాబూ! పిడికెడు బూడిదై-పోయింది!" గొల్లుమన్నాడు మేనమామ.

కొయ్యబారి పోయాడు రాజు.

అతని చెవుల్లో హోరు మొదలైంది.

....ఇంతకీ....అమ్మ....ఎక్కడ?" తడారిన గొంతుతో అన్నాడు మండుతున్న నాలుగైదు చితులను చూస్తూ.

"అదిగో!" ప్రజ్వరిల్లు ఆరిపోతున్న ఓ చితిని చూపించి కండువా నోట కుక్కుకున్నాడు తండ్రి.

రాజు మెల్లగా ఆ చితి దగ్గరగా వెళ్ళాడు.

చితి పక్కగా పసుపు కుంకుమలు, పూలు చిందర వందరగా ఉండి సుమంగళి చావుగా చెప్తున్నాయి.

"ఇంత తొందరగా అయిపోయిందా?" అన్నాడు రాజు మెల్లగా.

"అవున్నాయనా! కోలుకోవాలంటే నెలలు పడు-తుందిగా నీ బూడిదవడానికి క్షణాలు పట్టదు! అందులోనూ పిట్టలాంటి మనిషి!" కళ్ళు ఒత్తు-కున్నాడు చిన్నాన్న.

చితిలోకే పరిశీలనగా చూస్తూ మౌనంగా నిల్చు-న్నాడు రాజు.

"నాన్నా! నన్ను చూడ్డానికొచ్చావా?" అని తల్లి అడుగుతున్నట్టనిపించిందతనికి.

అతని ధోరణికి బిత్తరపోయిన బంధువులు భయంగా చూస్తున్నారతన్ని.

"అమ్మా!" అని అరుస్తూ చితిలోకి దూకబోయాడు రాజు హటాత్తుగా.

బలవంతంగా అతన్నాపారంతా కలిసి.

కూర్చోబెట్టి మొహం కడిగారు.

అనునయ వాక్యాలు పలికారు.

"అంతా ఎప్పుడో ఒకప్పుడు పోవాల్సిన వాళ్ళమే నాయనా! కాకపోతే కాస్త ముందు వెనకా! అంతే!" అంటూ స్మశాన వైరాగ్యం బోధించారు.

అయినా అవేం వినిపించడంలేదు రాజుకి.

తల్లి చల్లని రూపం గుర్తొస్తోంది!

ఆ వెంటనే తల్లిని హాస్పిటల్లో చేర్చడానికి కెళ్ళి-నప్పుడు అక్కడివారు చేసిన తాత్సారం, చూపిన నిర్లక్ష్యం, డబ్బుకోసం పీడించిన వైనం కళ్ళకి కట్టి-నట్టు కనిపిస్తోంది.

వెంటనే ట్రీట్‌మెంట్ జరిగితే అమ్మ బ్రతికేదా? ఏమో!....

కానీ.... అమ్మ రూపాన్ని కడసారిగానైనా తను చూడలేకపోవడానికి కారకులెవరు?

"అమ్మ కండిషన్ బానే ఉందని చెప్పి పంపిన డాక్టరా?

డబ్బుకోసం బస్సెక్కనియ్యని కండక్టరా? అదీగాక తన పేదరికాన్ని చూసి ఆపని ఆటో డ్రైవర్లా? పరి స్థితి గమనించి ఉచ్చుం, నీచం చూడకుండా అయిదు రూపాయలు వచ్చేచోట ముప్పయి రూపాయలు గుంజిందేగాక ట్రాఫిక్ జామ్ అయితే నాలుగు గజాలు దూరం ఎక్కువవుతుందని పక్కనుంచి రాకుండా ఆ తగూనే వేడుకగా చూసిన ఆ ఆటో డ్రైవరా?

అదీగాక.... ఇన్ని అన్యాయాలు జరుగుతున్నా ఇంత అవినీతి పెరిగిపోయినా, ప్రజల నౌకర్యాలు తమకి పట్టినట్టు తప్పుకు తిరుగుతున్న ప్రభుత్వమా?

ఎవరు? ఎవరు? ఎవరు?

నా స్థితికి కారకులెవరు?

"ఎవరూ కాదు!.... నేనే!.... నా దుస్థితికి నేనే కారకుణ్ని!

ధర్మాసుపత్రిలో ధర్మం మాత్రమే వుండదని తెలియని నేనే బాధ్యుణ్ని!

లంచం ఇవ్వడం చేత కాని నేనే ఓ తెలివి తక్కువ వెధవని!

కాదు! అన్నింటికీ మించిన మరో రాక్షసుంది!

అదే దరిద్ర దేవత!

నన్ను తన కబంధ హస్తాలతో కబళిస్తున్న దరిద్ర దేవత!

అవును!.... ఇవే కారణాలు! కానీ.... ఇంకెన్నడూ ఇలా జరగనివ్వను! యువకులందరికీ లోకం పోకడ నేర్పుతాను. మేడి పండులాంటి ఈ సమాజంలోని కుళ్ళుని బైట పెడతాను!" ఇలా రాజుని ఉక్కిరి బిక్కిరి చేసేస్తున్నాయి ఆలోచనలు.

"జై భారత మాతా!" హటాత్తుగా అరిచాడు రాజు.

బిత్తర పోయారంతా.

"ఇది నా దేశం! పవిత్ర భారత దేశం." పగలబడి నవ్వుతూ నినాదాలు చేస్తున్న రాజుని అతి బలవంతం మీద ఇల్లు చేర్చారు అతని వారు.

* * *

ఎప్పుడైనా మీరా వూరెళ్ళడం తటస్థపడితే జాగ్రత్తగా గమనించండి!

ఆ స్మశానంలోనీ, స్మశాన ప్రాంతాల్లోనో ఒక బక్క చిక్కిన యువకుడు.

"ఇది నా దేశం, ఇది పవిత్ర భారతదేశం, ఇది స్వతంత్ర భారత దేశం" అని అరుస్తూ మీక్కని-పిస్తాడు.

అతనే రాజు! అతన్ని చూసి జాలేస్తే రెండు కన్నీటి బొట్లు విడవండి. లేకపోతే "పాపం!" అనైనా అనుకోండి!" □

## హైదరాబాద్ నోట్‌బుక్

### చెప్పినట్లే జరిగింది :–

తెలుగు దేశం పార్టీ పార్లమెంట్ ఎన్నికలలో ఘన విజయం సంపాదించింది. శ్రీ ఎన్. టి. రామారావు రాజకీయాలలో ప్రవేశిస్తున్నారని, ఆయన పార్టీ విధానసభ ఎన్నికలలో ఘన విజయం సాధించ-గలదని అందరికన్నా ముందు హైదరాబాద్ నోట్‌బుక్ చెప్పినట్లే, పార్లమెంటు ఎన్నికలలోను తెలుగుదేశం పార్టీ, మిత్రపక్షాలు దాదాపు 33 స్థానాలు సంపాదించగలవని చెప్పిన భవిష్యవాణి కూడ ఫలించింది. ప్రజల మనస్తత్త్వం తెలియక మారు మూలల్లో కూర్చుని తమ భావాలను ప్రజాభిప్రాయాలని భ్రమిస్తూ రాజకీయ పునఃపాకం చేస్తున్నవారి అంచనాలు తారుమారయ్యాయి. ఈ విజయంతో తెలుగుదేశం బాధ్యత మరింత పెరిగింది. లోక్ సభలో కాంగ్రెసు తర్వాత చెప్పుకో దగిన పార్టీ తెలుగుదేశమే గనుక ప్రధాన ప్రతిపక్ష వర్గమవుతుంది. బాధ్యత గల ప్రతి పక్షంగా జాతీయ స్థాయిలో వ్యవహరించ గల అంతస్తును ఆ పార్టీ సభ్యులు అందుకోవాలి; కేకలు, ఆవేశాలు, అపశబ్దాలు లేక ప్రశాంతంగా ఆలోచించి రాష్ట్ర శ్రేయస్సుతో పాటు యావద్భారత శ్రేయోదృష్టితో ప్రజావాణిని వినిపించాలి; దేశంలోని ప్రతి పక్షాలను ఏక సూత్రంపై నడపడానికి ప్రయత్నించాలి.

### నేషనల్ రిజిస్టరు అవసరం :–

మన దేశంలోని తప్పుల తడక వోటర్ల జాబితా వంటిది మరే దేశంలోను వుండదనుకుంటాను. ఎన్ని తప్పులు! ఎన్ని తప్పులు! మూడున్నర దశాబ్దంగా ఎన్నికలు జరుగుతున్నాయి గదా? ఇన్ని తప్పులు ఎలా వస్తాయి? వోటర్ల జాబితాను సిద్ధ పరచేవారు నిరక్షరాస్యులు కారు. ఒకరికి మారు నలుగురు కట్టకట్టుకుని వస్తారు. ప్రశ్నల వర్షం కురిపిస్తారు. సమాధానాలు సరిగా వ్రాసుకోవాలిగదా. ఆ పనికే నియుక్తులయినవారు గదా. శ్రద్ధ ఏ కొద్దిగా చూపినా తప్పులు రావు. లింగవచనాలు, సంబంధ బాంధవ్యాలు తారుమారు ఎలా అవుతాయి? నేను పోలింగు బూతుకు వెళ్లాను. నాపేరు తిరిమెల రామ "అని వుంది. నీవు కాదు అంటారు పోలింగు అధికారులు. తండ్రి పేరు, వయస్సు సరిగా వుండడం వల్ల ఎలాగో వోటు వేశాననుకోండి. మా పక్క వాటా వారికయితే తండ్రి, భర్త ఒకరే. పది మంది ఇంటిపేరు ఒక్కటే. వారు వోటు వేయడం గగన మయింది. ఈ తప్పులకు కారణం ఎన్నికలకు ముందు ఆదరా బాదరాగా పది ప్రెస్సులకు వోటర్ల జాబితా అప్పగించడం, ఆ ప్రెస్సుల వారు సరిగా ప్రూఫయినా చూడక అచ్చు గుద్దడం పరిపాటి అయిపోయింది. ఈ అవక తవకను మార్చడానికి ఒకే ఒక ఉపాయం నేషనల్ రిజిస్టరు పద్ధతి. పాశ్చాత్య దేశాల మాట అటుండగా, పక్కన వున్న మలేషియా వంటి దేశాలలో ఈ పద్ధతి వుంది. దీనివల్ల తప్పులు రాక పోవడమే కాక రిగ్గింగుకు కూడ అవకాశం వుండదు.

### కొత్త దిన పత్రిక ఉదయం :–

సుప్రసిద్ధ చలన చిత్ర దర్శకుడు, నటుడు, నిర్మాత శ్రీ దాసరి నారాయణరావు యాజమాన్యాన, సుప్రసిద్ధ పత్రికా రచయిత శ్రీ ఎ. బి. కె. ప్రసాద్ సంపాదకత్వాన "ఉదయం" అనే కొత్త దిన పత్రిక ప్రారంభోత్సవం డిసెంబరు 28 సాయంకాలం జరిగింది. ప్రారంభోత్సవ సభకు ముఖ్య మంత్రి శ్రీ ఎన్. టి. రామారావు అధ్యక్షత వహించారు. గవర్నర్ డాక్టర్ శంకర్ దయాళ్‌శర్మ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. సుప్రసిద్ధ చలన చిత్ర నటులు డాక్టర్ అక్కినేని నాగేశ్వరరావు తొలిసంచిక ప్రతిని ఆవిష్కరించారు. రాష్ట్ర కాంగ్రెస్ (ఐ) అధ్యక్షులు డాక్టర్ వై. ఎస్. రాజశేఖరరెడ్డి తొలి ప్రతిని, స్వీకరించారు. అధికార భాషా సంఘం అధ్యక్షుడు డాక్టర్ సి. నారాయణరెడ్డి ప్రసంగించారు. సమాజంలో పెచ్చు పెరుగుతున్న హింసా ప్రవృత్తికి వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని మలచవలసిన బాధ్యత పత్రికల బాధ్యత అని గవర్నర్ డాక్టర్ శర్మ ఈ సందర్భంలో ప్రసంగించారు. పత్రికా రచనా వృత్తి అత్యుదాత్తమైందని, దేశ స్వాతంత్ర్య సమర సమయంలో పత్రికలు గొప్ప సేవ చేశాయని ఆయన అన్నారు. అప్పటి పత్రికల ఆదర్శ దృష్టితో నేటి పత్రికలు కృషి చేయాలని ఆయన అన్నారు. ముఖ్య మంత్రి శ్రీ రామారావు ప్రసంగిస్తూ, ప్రజలకు, ప్రభుత్వానికి, పత్రికలకు సన్నిహిత సంబంధం వుందని, ప్రభుత్వ విధానాల పట్ల ప్రజల్లో సదవగాహన కలిగించడం, తప్పులు చేసినప్పుడు సరైన మార్గం చూపడం పత్రికల కర్తవ్యమని అన్నారు. ప్రజాభిప్రాయాన్ని ప్రతిబింబించే ఉద్యమాలను ముందుకు నడిపే పత్రికలే నిలబడతాయని డాక్టర్ నారాయణరెడ్డి అన్నారు. శ్రీ దాసరి నారాయణరావు కృతజ్ఞత తెలుపుతూ, రెండు లక్షల 25 వేల సర్క్యులేషన్‌తో ఏక కాలంలోనే హైదరాబాద్, విజయవాడల నుంచి వెలువడుతున్న దిన పత్రిక పత్రికా చరిత్రలో ఇదేనని అన్నారు.

సంపాదన కోసం పత్రిక పెట్టడం లేదని, ప్రజా సేవకోసమే పెడుతున్నానని అన్నారు. ఈ సందర్భంలో ప్రముఖ పత్రికా రచయితలు శ్రీయుతులు భావరాజు నరసింహారావు, జి. వి. రాఘవరావు, ఎ. బి. కె. ప్రసాద్, మున్నగు వారిని, చిత్రకారుడు శ్రీ గోపీని శ్రీ నారాయణరావు సన్మానించారు.

### ఉపశ్రుతి:–

ఎందుకుసార్ హడావుడి, అంతా అయిపోయినంక?–– అన్నాను ధరావత్తు తినివేసిన ఒక లోక్ సభ అభ్యర్థితో. వచ్చే ఎన్నికలకు ధరావత్తు మొత్తం పెంచుతారట. దానిని సంపాదించు కొనడానికి పార్ట్ టైం ఉద్యోగం సంపాదించాను. మరి వెళ్లవద్దూ?– అన్నారు ఆయన.

–తిరుమల రామచంద్ర




*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar Vijayawada-3, Editor: S. Radhakrishna, Phones: P. B. X. 61247, 61248 & 75...*

# ఒలింపిక్ కోచ్ జిమ్ ఒ డోహెర్టీ అంటారుగదా:

# "బలం, చేవా సమకూర్చడానికి కాంప్లాన్® లాంటిది మరొకటి లేదు మరి."

ఒలింపియన్ జిమ్ ఓ' డోహెర్టీ, జటిలమైన పోటీ పందేలకోసం, భారతదేశంలోనే గాక ప్రపంచమంతటా, ఉత్సాహంగల యువతరం వారికి తరిఫీదు యిచ్చారు. ఛాంపియను పుట్టుకతో అవరు, తరిఫీదు యిచ్చి తయారుచేయాలి వారిని అని ఆయన నమ్మకం. మరి విజేత అవడానికి కావలసినది మనో శక్తి—దాంతోటే శరీర శక్తినూ.

"ఈతగాళ్ళకీ, ఎథెలెట్స్‌కీ, ముఖ్యంగా, పెరిగే వయస్సులో పిల్లలకీ కాంప్లాన్ తీసుకోమని సిఫార్సు చేస్తాను," అంటారు. జిమ్ ఓ' డోహెర్టీ. "కాంప్లాన్, ఆ చేవను సమకూర్చడంకోసం ఆరోగ్యవంతమైన పెరుగుదలనిచ్చే, తేలికగా అరగగల, 23 కీలక పదార్థాలున్న సంపూర్ణ ఆహారం."

ఈ కిటుకును జిమ్ ఓ' డోహెర్టీ నుంచి తెలుసుకోండి. మీ పిల్లలకు, పూర్తిగా ఆరోగ్యవంతమైన పెరుగుదలకోసం, ప్రతి రోజూ యివ్వండి కాంప్లాన్. కాంప్లాన్ రుచికరమైన సువాసల్లో వస్తుంది—పిల్లలకిది ఎంతో యిష్టం!




GLC.9-2116 TL

# కాంప్లాన్® - సంపూర్ణంగా ఆరోగ్యబద్ధమైన ఆహారం